# నరసభూపాలరాజీయ్యము.

ఇది

పెదనందిపిల్ల్యగ్రహారవాస్తవ్యులును, రామకృష్ణార్జున
నారాయణీయాది త్ర్యర్థిప్రబంధకర్తలును నగు

ఓరుగంటి సోమశేఖరకవిగారిచే

రచియింపఁబడినది.

# నరసభూపాలరాజీయ్యము.

ఇది

నందిపిల్ల్యగ్రహార వాస్తవ్యులును, రామకృష్ణార్జుననారాయణీయాది
త్ర్యర్థిప్రబంధకర్తలును నగు

ఓరుగంటి సోమశేఖరకవిగారిచే

రచియింపఁబడి,

వారిపౌత్రులున్ను, నరసప్పగారి కుమారుడున్ను అగు

ఓరుగంటి శ్రీరాములుగారిచే

ప్రచురింపఁబడియె.




కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁ బడియె.

1937.




[వెల రు 1-0-0.

# నరసభూపాలరాజియ్యము.

## ప్రథమాశ్వాసము.



లక్ష్మీసతి నాథకౌస్తుభమణిశ్లిష్టాత్మబింబప్రభో
ద్వేలవ్యక్తి బరాబ్జనేత్రయని భావించంగ వే దాని
దద్వాబలాశ్లేషతమాన్బి నవ్వకమలాపద్మాననాభర్త
గోపాలగ్రామణి బ్రోవుతన్ నరసభూపాలక్షమావల్లభున్.

సీ. ప్రతనుకటాక్షపోషితదేవలోకేశ
లోకేశవిభవ యేలోకవినుత
కింకరీకృతసిద్ధకిన్నరస్వఃకాంత
కాంతాసమూహ యేకంబుకంఠ
సంతతాహితభక్తిసంగతాఖిలలోక
లోకాభివంద్య యేలోలనయన
మహానియ్యశారదమదబంభరాజీవ
రాజీవనేత్ర యేరాజవదన
యాజగన్మాత బుధగీత యమలప్రాస
పాటినారాయణావనీభర్తృతనుజ
నరసభూపాల మందిరాంతరమునందు
నిండుమదితోడ గదలక నిలుచుగాత.

సీ. భూరిరత్నాహీన భూషణంబులవారు
లలితశివాఖ్యతో వెలయువారు
ప్రాంచితరాజీవపాణులుగలవారు
శిరమున నెలవంక జెలగువారు

ఘనచంద్రికాస్మేర కాంతులుగలవారు
హంసయానాంచితులైనవారు
కనదబ్జమిత్రాంబకంబులుగలవార
లాశ్రితమందారులైనవారు
నిత్యతుల్యస్వరూపులై నెగడువారు
పార్వతీపరమేశ్వరుల్ భద్రమతులు
విలసదైశ్వర్యసంపదల్ వెలయజేసి
కరుణబ్రోతురు నిరత మిక్ష్వాకువ్యపతిని.

శా. సామాథర్వణఋగ్యజుస్సులనగా సంధిల్లువేదంబు లు
ద్దామప్రక్రియ నేకకాలమున నందంబొందగాబల్కునె
మ్మోములాలుగు దాల్చినట్టి సుమనోముఖ్యుండు దీర్ఘాయు స
త్కామైశ్వర్యములిచ్చుగాత నరసక్ష్మాభర్తకెల్లప్పుడున్.

సీ. గురుకాంతినిర్జితకుందేందుకాదంబ
హాటకరత్నవీణావలంబ
నీలసీలాలకనిర్జితరోలంబ
సద్వక్త్రజితపూర్ణచంద్రబింబ
యంబుసంభవసంభవాననాంబుజలంబ
కమనీయ్యసరసనత్కవిజనాంబ
కాంచికాంచితదివ్య కాంచనాద్రినితంబ
యధరాధరీకృత మధురబింబ
వితతలోకకుటుంబసంశ్రితకదంబ
సరసగుణమణినికురంబ శారదాంబ
కలితతాండవ మొనరించుగాత తాత
రాణివాణిమదియ్యాగ్రరసనసీమ.

ఉ. దక్షసుతాపయస్సు లలితంబుగతుండముచేత బీల్చిప
ద్మాక్షపదీపయస్సు సముదంచితతుండముచేత బీల్చి బల్

కుక్షిగరంబునిండగను గ్రోలుచునప్పుడివ్వమాత్రకుండు ఫా
లాక్షతనూజుడీవుతశుభావళినీకృతిభర్త కెప్పుడున్.

సీ. కందుకీకృతశైలసందోహగగనప్ర
వర్తనోద్ధృతవజ్రవాసవములు
భూరిజంఘాబలాభోగగోవత్సాంఘ్రి
చంద్రకీకృత సర్వసాగరములు
తరణిసందిష్టవిద్యాభ్యాస వేళాద్వి
చరణాక్రమితపూర్వచరమగిరులు
చక్రలంఘనకళాసతోర్ధ్వగతికల్ప
చరమ శంకాచలచ్ఛారదంబు
లల్పలోమీకృతేంద్ర వజ్రాయుధములు
భీమవజ్రాయుధీకృతలోమకములు
బాలసామీరివిక్రమప్రక్రమములు
దురితపైశాచికశ్రేణి దోలుగాత.

సీ. క్షమగవితాకల్పకము నూడ్చెనొక్కండు
శాఖిశాఖాస్ఫూర్తి జరిపెనొకడు
సదుపమానోన్నతి బాదలజేసెనొకండు
సుమనోర్థగురువృత్తి జూపెనొకడు
ఖగవరాంతస్థితి గల్పించెనొక్కండు
తులతూగరసవృష్టి నిలిపెనొకడు
లలితపదస్ఫూర్తి వెలయించెనొక్కండు
నిఖిలధర్మంబులు నించె నొకడు
వారిభాషావిశేషకాసారకవుల
గవుల నాకూద్భవవ్యాసకాళిదాస
భారవిమయూర భవభూతిసూరిదండి
మాఘులనిరాఘులను నాదుమదినిగొలుతు.

గీ. ప్రకటవాగనుశాసనపాత్రమందు
బుట్టి శ్రీనాథపదమున మెట్టి సోము
దలనుశోభిల్లి కుండలిదావునంటు
కవితయనుగంగ వెలయించు ఘనులదలతు.

క. గురుభక్తింగొల్చెదను, గ్గురునిన్ వరనిష్ఠశక్తిగురునిమనీషా
గురునోరుగంటిలక్ష్మీ, నరసింహామనీషిగురుని నవగుహాగురునిన్.

ఉ. ధారుణిశాస్త్రనైగమవిధానములేక విభాసివిద్యనం
స్కారములేక మే లమరకాండపటిష్ఠతలేక భీరులౌ
వీరులబోలుచున్నకుకవిప్రచయంబు లసూయబల్కి న
ద్వీరులసర్వధీరులగవీంద్రుల దాకిన గెల్వనేర్తురే.

వ. అని యిష్టదేవతానమస్కారంబును సుకవిపురస్కారంబును గుకవి
తిరస్కారంబునుం గావించి శ్రీముకుందచరణారవింద దైనందిన వం
దనానందిత వందారుజనానంద కరరథాంగ కరకథాసుధారస పూర్ణ
తుందిలంబును మృదులపదసుందరంబుగా శృంగారరసప్రబంధ విశే
షంబు రచియింపంబూనియున్న సమయంబున,

సీ. రహిమహేంద్రాద్యూఢి రాజిల్లె నెవ్వాడు
దీప్తిచే సతతభోగాప్తిచేత
దేవాద్రిసమశక్తి దీపించె నెవ్వాడు
బెట్టుచే ధైర్యంపుగుట్టుచేత
విధుపృథుప్రౌఢిచే విలసిల్లె నెవ్వాడు
కీర్తిచే శ్రీలసత్స్ఫూర్తిచేత
నజరాజితాకృతి నలరారె నెవ్వాడు
హేలచే భారతీలీలచేత
నతడు వీరాధివీరవీర్యప్రతాప
విజయసత్యహరిశ్చంద్ర సుజనకల్ప

దానరాధేయ దాతలదాత బిరుద
పరమగుణహారి నరసభూపాలశౌరి.

వ. ఒక్కనాడు నరసకవితా కాసారకవులగుకవులును, సకలలౌక్య విద్యాస్వతంత్రులగు మంత్రులును, సమస్తశాస్త్ర లీలామండితులగు పండితులును, సర్వక్రియాచాతుర్యపటులగు వీరభటులును, సంగీత విద్యాప్రవీణులగు వైణికులును, నిఖిలప్రయోజన ధీమంతులగు సామంతులును, ప్రజాపాలనమహేంద్రోద్యోగులగు నుద్యోగులునుం గొలువ భేరోలగంబుననుండితత్వవిద్యానిధులగుబుధులతో నిట్లనియె.

సీ. రామాయణము కవిరచియించుటనె కదా
రఘువంశవిఖ్యాతి రహివహించె
భారతంబును వ్యాసభట్టారకుడు జెప్ప
బాండుసూనుచరిత్ర బరిఢవిల్లె
కాళిదాసుండు సత్కవితజేర్చగ గదా
భోజరాజుచరిత్ర భువిని నిలచె
పెద్దనార్యుడు కృతి పెంపుజూపుట గదా
దేవరాయచరిత్ర దేజరిల్లె
గాన నీరీతి సత్కృతికర్తభర్త
ధరణి వెలయును రాచంద్రతారకముగ
కృతియనగధరణి శాశ్వతకీర్తితనువు
గనుక కృతినందవలయు భూకాంతు డెపుడు.

వ. కావున సృష్ట్యాది మొదలుకొని యిప్పటివఱకు నెందరు మహారాజధరణీపురందరులేగిరి వారిపేరులే తెరగో వినంబడెనే యని సరసమహాకవికృత కృతినందనిశ్చయించి,

మ. నను గోపాలకబాలరూపహరిపన్నాళీకసేవాసదా
జనితానందుని భారతీఘనదయాసారప్రసారోద్భవ

ఘనబంధోచితగద్యపద్యకవితాధారాసుధామాధురీ
ఖని సత్పూరివిధేయు బిల్చిపలికెంగారుణ్యమొప్పారగ౯.

గీ. సప్తసంతతిలోన నాచంద్రతారకముగ
సీతాగసేతువిఖ్యాతిమెరసిసతత
మభివృద్ధిగనునది కృతియు ధాత్రి గాన
మాకీవుమది సోమకవిలలామ.

వ. అని సబహుమానంబుగాఁ దాంబూలజాంబూనదాభరణాంబరాదుల నాదరించుటయు నేనును సంతోషితస్వాంతుఁడనై కృతిపతివంశావతారం బభివర్ణించెద.

సీ. శ్రీకమలాలయాసీమంతినీమణీ
నాయకుం డఖిలార్థదాయకుండు
హారకిరీటకేయూరకుండలముఖ్య
భూషణుం డాశ్రితపోషణుండు
శంఖచక్రగదాసిశార్ఙ్గాదిసాధన
భూషితుం డమలసంభాషితుఁడు
ఘనవనమాలికాకౌస్తుభగ్రైవేయ
కంధరుండురుదయాబంధురుండు
భాసురుండు సురక్షితవాసవుండు
శ్రీధరుండు బలోద్ధృతభూధరుండు
సాధుజనమునిదేవతాసకలభక్త
రంజనపరాయణుండు నారాయణుఁడు.

వ. వెలయు నతనికిఁబుట్టె,

సీ. గరుడవాహనునాభికాసారసంభూత
పానియ్యజాతమ్మెవ్వానిమాత
పదనతాఖిలబుధప్రకరదేవశ్రేణి
వాణిసుశ్రోణిమెవ్వానిరాణి

సకలచరాచరజంతుసంతతి రూప
వరసృష్టిజాల మెవ్వానిలీల
దివ్యాంగసహితమూర్తి భవద్ఘనవేద
ములపిండు లెవ్వానిముఖాలనుండు
నట్టిచతురాననుండు పరాత్మభవుఁడు
సకలలోకేశుఁ డజుఁడు ప్రశాంతమూర్తి
కనకగర్భుండు పరమేష్ఠి వినుతబుధుఁడు
ప్రకటగుణధుర్యుఁడగు పరబ్రహ్మ దనరు.

వ. అతనికి మరీచిపుట్టె నమ్మరీచికి గశ్యపప్రజాపతిబుట్టె నతనికి,

సీ. వసువులవర్షించులసదర్యమాఖ్యుండు
విధుపదప్రియవృత్తి వెలయుహంస
గోపాలనప్రౌఢి గొరలుమహేంద్రుండు
ఘనచక్రములప్రోచుకనదినుండు
పద్మినీప్రియవృత్తిబరగుచుండినహేళి
పరతమంబడచుసన్మార్గచారి
పడిరాజు తేజంబు నడచెడుశూరుండు
గలుషాబ్ధిదాటించిగ్రాలుతరణి
యవనిబ్రహ్మమయుండన హరియనంగ
నబ్జధరుడన మెరసివాగధికమూర్తి
యమలకమలానుమోదియార్యాభిగణ్యు
డన వెలయుచుండు సూర్యనారాయణుండు.

క. అతనికి వైవస్వతమను, వతనికినిక్ష్వాకునృపతి యతనికిగుక్షి
క్షితిపతిజనియించిరి త, త్పతివంశసుధాబ్ధిలోనబహురాజన్యుల్.

శా. కాకుత్స్థుండుబృథుండునున్ సగరభూకాంతుండు మాంధాతను
శ్లోకాఖ్యుండు భగీరథుండు భరతక్షోణీతలాధీశుడున్

సాకల్యాగము డంబరీషుడు హరిశ్చంద్రుం డజుండున్ రఘు
క్ష్మాకాంతుండు దిలీపుడున్ దశరథజ్యానాయకాధీశుడు౯.

వ. వారిలో దశరథరాజన్యునకు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులన నలుగురుకుమారు లుదయించిరి వారిలోన,

సీ. క్షితినిమహాజవకృతమఖశరణుండు
వరపినాకసుధన్వనర్ధనుండు
సీతామనోహరశ్రీమూర్తిగలవాడు
ఘనగురువరశాఖికాండచారి
పరభక్తివిలసితహరిసుతవరదుండు
బలజాలకృతసింధుబంధనుండు
వడిరావణాసురవరదాననిపుణుండు
గౌరవామితభూతిగనినవాడు
ఘనుడు శ్రీరాజశేఖరు డనగ వెలసె
గలితవాల్మీకిముఖమహాకవివిరచిత
చిత్రరామాయణాదిచరిత్రభర్త
రామచంద్రుండు త్రైలోక్యరక్షకుండు.

క. అతనికిజనియించి, సుతులిరువురు కుశుడులవుడు శోభితయశులై
క్షితిలో వెలసినదత్సం, తతిలోపలబుట్టి రధికధరణీనాథుల్.

వ. వారిలోన,

సీ. ప్రకటకలాకలాపప్రౌఢరీతిచే
నేదార జేదారనీసడించు
భూరిగుణాభోగభోగప్రవృత్తిచే
నేభర్త గోభర్తనేవగించు
శాశ్వతశ్రీవిలాసప్రీతిరీతిచే
నేనేత యూనేతనెగ్గులాడు
నవభాసమాసమాసప్రభావంబు చే
నేరాజు రారాజునెంచుమించు

నతఁడు సీతాగసేతువిఖ్యాతమహిత
లాధీశ కోటీరమణివిభావిభాసి
తపదారవిందుఁడై ప్రబలుచుండె
బుద్ధవర్మ సామోఘసిద్ధవర్మ.

వ. అమ్మహారాజు కుమారుండు,

సీ. సద్ధర్మకాండ విస్తారతాచాతురి
　　　శమనజార్జునులతో సాటివచ్చు
ప్రత్యర్థిదానైకపారీణతావృత్తి
　　　గర్ణభార్గవులతో గణనకెక్కు
భూవినుతాభోగభోగప్రసక్తిచే
　　　వసువాసవులతోడ వాసిఁ జెందు
మంజులగతిమించు రంజదభిఖ్యచే
　　　జంద్రసూర్యులతోటి సవతుగాంచు
ననుచు నెవ్వనివర్ణింతు రఖిలవిబుధు
లతఁడు హారపటీరనీహారహార
తారకాకాశడిండీరచారుకీర్తి
వజ్రవరవర్మ మాధవవర్మ వెలయు.

వ. మఱియును,

సీ. గోరాజతుల్యత గోరల నెమ్మేటి
　　　రుచికీర్తిభారతీరూఢికళల
శ్రీధరతుల్యత జెలగెను నేరాజు
　　　ప్రకటసంపద్ధైర్యపాలనముల
బుధగురుచ్ఛాయను బొలుపారు నేతేఁడు
　　　విజ్ఞానమతికళావిభ్రమముల
నరహరిపోకల మెరసెను నేదొర
　　　పరజయభోగార్థపాలనముల

సతము బొగడొందు కకుబంతవితతకీర్తి
కనకదుర్గాప్రసాదసంజనితభీమ
బలసముద్ధూతదిగ్గేశపార్థివుండు
ధర్మగుణకోటి మాధవవర్మమేటి.

గీ. ఇంద్రనీలాద్రిచెంత నాయింద్రభోగి
కృష్ణవేణీతటంబున గెరల నాళ
కటకము గట్టె జయవాటికాపురంబు
కాపురంబుగగీర్తిలోకముల వెలయ.

గీ. స్వర్ణగిరిజాప్రసాదసంజనితమయిన
హయగజరథాళితో గూడి యహల నదిమి
కనకదుర్గాలసద్దయాగరిమవలన
గనకవర్షంబు గురిపించె ఘనులు పొగడ.

వ. అమ్మహాధర్ముసకు దేవవర్మయనుతనయుండు జనియించె నతంసు,

సీ. మిత్రమందిరముల శత్రుమందిరముల
గాంచనచయవృద్ధి గలుగజేసె
దుష్టాలయంబుల శిష్టాలయంబుల
బటుశివారవములు బరగజేసె
పాపగేహముల నిష్పాపగేహంబుల
ఘనతరోరువిభూతి గలుగజేసె
బండితస్థలుల పాషండస్థలంబుల
గమలాకరంబులు గాగజేసె
ననుచు నెవ్వని వర్ణింతు రఖిలబుధులు
శుంభదంభోధిమథనసంరంభజనిత
ఘుమఘుమారావలలితవాగ్గుంభనముల
సతము బొగడొందె దేవవర్మాఖ్యవిభుడు.

క. ఆరాజు గాంచె గరతల, ధారాధరవర్షకాలధారాధరస
ద్ధారాధికధారాగురు, భౌరాహతరాజహంసపక్ష్ముని శ్రీమున్.

సీ. తనఘనమహనీయ్యధర్మం బమేయమై
ధరణిలో వసువృష్టి గురియుచుండ
దనవజ్రవరహేతిధారధారాధర
పరపక్షవిక్షేపపటిమ దనర
దనసద్గుణంబు మందారసమగ్రమై
సుమనోభిపాలనస్ఫూర్తి మెరయ
దనదర్శనము సుదృక్తతిమనోహారియై
వేయువిధంబుల వెలయుచుండ
రాజదేవేంద్రు డితడన దేజరిల్లె
గుందబృందేందుమందారచందనాచ్ఛ
కందధవళారవిందాబ్జకలితకీర్తి
భీమబలధారి యరిభీమ భీమశౌరి.

సీ. అంబాతులితమైలమంబాసుతుండౌట
మైలమభీమాఖ్య మలయుచుండె
భీమాహవక్షోణిభీమాంచితుండౌట
భూమి మహోద్దామభీముడయ్యె
దోరమా యేరువదుర్గపాలనమున
యేరువభీమాఖ్య మీరుచుండె
నియమాభిరామతనివ్వటిల్లుచు జిక్క
జిక్కభీమాఖ్యచే జెన్నుమిగిలె
నిశితధారాధరంబుచే నశనిదునిమె
పూర్వజితుడైనభళ్లాణభూమివరుడు
మరలగా వానిదృంపకమహిమనాత్మ
ఛేదమొనరించుటను బదిచ్ఛేదియయ్యె.

గీ. నాటనుండియు తద్వంశనరవరేణ్యు
లిలఁబరిచ్ఛేదులనగను వెలసిరిట్లు
వరలగా జనకవంశంబు వారలెల్ల
జనకులన బేరుగాంచినసరణిబోలె.

ఉ. రాజితకీర్తియరాయమలరాజు జనింపుచు తత్కులాబ్ధిలో
రాజిలె జాయయూపరతిరాజుమహీధరణాప్తిభార్గవీ
రాజు ధనప్రభూతివసురాజుమహోద్యుతి బాలపద్మినీ
రాజు విశిష్టభోగసురరాజు గళాతతిరాజుభూమిలోన్.

క. అలపూసపాడనంగను, వెలసినబురమేలుచుంటవిశ్వంభరలో
పలపూసపాటివారన, విలసిల్లిరి రాజవరులు విశ్రుతులగుచున్.

గీ. దేవసుతు డాతడక్కపదేవియందు
గనె గుమారుల నేవుర వినుతయశుల
వారిలో పలనయ్యప్రభువరుండు
లోకవినుతుండు సుగుణరత్నాకరుండు.

గీ. అట్టియయ్యపభూపాలు డమితగుణుల
బుత్రులనుగాంచె నార్వురభూరియశుల
వారిలోతిమ్మభూపాలవరుడు
కీర్తిశోభితదిగంతరాళుడై సొంపుమిగిలె.

గీ. అట్టితిమ్మనృపతియన్నమదేవిల
లామమందు సుతులభీమబలుల
ముగురగాంచె వారిముగ్గురిలో రాచ
రాజుకీర్తివిజితరాజు వెలసె.

ఉ. దామెరతిమ్మభూవరుని దాకి జయింపుచు నాత్మకింకిర
గ్రామణి జేసి మ్లేచ్ఛనృపకాండములన్ వధియించి మాళవో
ద్దామబలంబుగెల్చి వడిదద్దయు తద్ఘనభీమమన్యసు
త్రామనువాని బల్బిరుదుడాలిచె రాచనృపాలుడుద్ధతిన్.

సీ. శ్రీబ్రహ్మదత్తసుశ్రుతికలాపాఢ్యుడై
తతవిబుధాన్నప్రదాతయగుచు
సర్వంసహాభారసౌకర్యధారియై
నరసింహుడనగను బరగుచుండె
బలిశిరోమణిపాదపద్మసంశోభియై
విక్రమజితరాజవీర్యుడగుచు
శ్రీరామమూర్తియై శ్రితగోపవర్యుడై
సర్వజ్ఞుడనకలి జాలహారి
చక్రిబహురూపములుదాల్చుక్రమమువీడ
యొకటనన్నిగుణంబులు ప్రకటపరచె
ననగవిలసిల్లె సజ్జనావనప్రతిష్ఠ
రమ్యసత్కీర్తిజితరాజు రాచరాజు.

గీ. భువినిశ్రీదంతులూరి శ్రీరభూమిజాని
యాత్మభవసూరమాంబిక యామెయందు
తనయులను తిప్పరాజును దమ్మిరాజు
ఘనునిశ్రీకృష్ణరాయుని గనియె నతడు.

సీ. విధిహరిహరులట్ల వెలసినవారిలో
తమ్మిభూపతి నెన్నదరమె ధాత్రి
దండిచే బెల్లముకొండసాధించెను
రహిగెల్చె నలరంగరాజు కొండ
రావుశింగినమూరు రాయాంకువేబరా
జితుజేసె రాజులవితతి గెలిచె
గాచెను బాహాదిఖాను నిశరణన్న
నోడపల్లిజయించె నుగ్రశక్తి
జండకోదండకాండప్రకాండగరిమ
సర్వసర్వంసహాచక్రధూర్వహుడు

రాజిలె వసిష్ఠగోత్రవారాశిపూర్ణ
చంద్రుడనగను రాజదేవేంద్రు డతడు.

గీ. అట్టిరాణ్మౌళి దానన్నమాంబయందు
రాచరాజును మరి తిప్పరాజు కృష్ణ
రాజవరుడనుసుతుని విరాజితిని
గాంచె గకుబంతవిశ్రాంతకాంతయశుల.

గీ. వారిలోపల రాచభూవాసవుండు
గండపెండేరమునుబూనె దండినూత్న
భారతంబన గృతిజేసె భాసురముగ
గీతవరపట్టనేశుడై కీర్తిమించె

సీ. జంభారికుంభీశదంభోళికుంభీర
వరశరదంభోదవార మేలి
మందారకుందారవిందారిబృందార
కార్వసర్వేశరుగ్గర్వ మడచి
గంగాతరంగాజతుంగాశితాంగార్వ
గళవళత్తుప్రభావళుల నేలి
తారాతుషారాగ హారాలిహీరాధి
పాత్మభూధారావిభాలి మించి
యులరు నెవ్వనిసత్కీర్తి యంగవంగ
లాటకర్ణాటచోళమరాటయవన
సాల్వమాగధమాత్స్యదేశములయందు
నతడు బొగడొందడె రాచకులభర్త.

సీ. అతనితమ్ముడు తిప్పకులభర్త విరోధి
హర్త లసద్ధర్మకర్త దాను
గొట్టెముక్కలయన్నకులనాయకపుత్రి
మల్లమదేవినామలయుచున్న

నువిద చింతపాటి యుద్దండ రాజుత
నూజ గోపమదేవి రాజవదన
గ్రమమున వరియించి ఘనుడు పిన్న నెలంత
గోపమాంబికయందు గురుభుజులును
నందనులగాంచె పెదకృష్ణనరవరేణ్యు
రాచజననాయకుని తిమ్మరాజవరుని
వితతసత్కీర్తికాంతుల విమలమతుల
దానవీక్షాభివిజితమందారతరుల.

సీ. భాషాసతీవజ్రభూషాకలాపంబు
పూషాబ్జనేత్రకర్పూరకలన
రంభావిలసదూరురంభాచ్ఛవసనంబు
కుంభీనసీశిరఃకుందమాల
తారావధూకంఠహారావళీచ్ఛాయ
హారాకరస్వచ్ఛనీరజంబు
శాలీకురంగాక్షి కేళీమరాళంబు
లీలింతుముఖసభా గీతవాణి
యగుచు వెలసెను నేభర్త యమలకీర్తి
యతడు భూతలదేవేంద్రు డనగ వెలసె
దిప్పరాజకుమారులం దొప్పగాంచి
పరమరుచి హేళి కృష్ణభూపాలమౌళి.

గీ. అట్టి శ్రీకృష్ణచారిత్రు డైనకృష్ణ
రాజు నెమ్మిని దిరుమలరాజు దాస
రాజునందన తిమ్మమారమణిసతిని
ప్రేమరమణీశిరోమణి బెండ్లియాడె.

గీ. ఆరమణియందు సుతులను సమరగనియె
పెదజగన్నాథభూపతి పృథులకీర్తి

పినజగన్నాధభూపతిజనవరులను
వారితారిజనేశులా వారిలోన.

సీ. గాధేయుతో దానరాధేయుతో సాటి
వెలయంగ సత్తపోవితరణముల
రాముతో గిరిజాభిరాముతోడను సాటి
పొలుపొందు గురుభక్తి భూతిగతుల
జామ్రుతో సల హరిశ్చంద్రుతోడను సాటి
చర్చింపగా కీర్తి సత్యరతుల
ధాతతో నల్లమాంధాతతోడను సాటి
సొంపొంద భారతీసుగుణగతుల
ననుచు నెవ్వనివర్ణింతు రఖిలవిబుధు
లతడు శేషాహిమృత్యుజిహ్వాకరాళ
కఠినకరవాలనిర్జితక్ష్మావరుండు
పినజగన్నాధభూపతిఘనబలుండు.

గీ. బాధితారాతి పినజగన్నాధరాజు
భూమణుడు గొట్టుముక్కల బుచ్చినృపతి
యాత్మభవపాపమాంబికయందు గనియె
కృష్ణభూపాలుభూపాలు విష్ణుసముల.

వ. వారిలోన,

క. ఆభూపాలుడు మహీభర, తాభూపాలకు డటంచు ధరణీధవులుం
శోభిల్లబొగడ వెలిగె మ,హాభుజకరవాలనిర్జితారివరుండై.

గీ. ధరణి వర్ణాటుజంపెసతమ్మనృపతి
తిమ్మయామాధిపసోదరి దేవిగాక
వేంకటాంబను బెండ్లాడి విమలమతిని
వెలసె లక్ష్మిని వరియించు విష్ణుడనగ.

వ. ఆ వేంకటాంబయం దాభూపాలరా జేవుర సుతులగాంచె.

క. హరు పంచముఖములనగా, హరిపంచాయుధములనగ నలపాండుక్ష్మా
వరు పంచతనయులనగా, ధరలో విలసిల్లి రధికదర్పోద్ధతులై.

సీ. వారిలోపల పెద్దవాడు కృష్ణావనీ
నాథుండు దా రమానాథు డరయ
నతని సోదరుడు భూతలనాయకుడు భగ
వాన్రాజు భూలోకవాసవుండు
తదవరజుండు భూధవసేవితుండు ప్ర
చండవిక్రమశాలి కొండనృపతి
తదనుసంభూతుండు ధారుణీధరమౌళి
పెదజగన్నాథుండు పృథుయశుండు
పినజగన్నాథు డందరి వెనుకవాడు
కొండనృపుడంచు కౌండిన్యగోత్రుడగుచు
దనరు జంపెనతిమ్మభూధవునితనయ
గంగమాంబను బెండ్లాడె ఘనతరముగ
పార్వతీసతి వరియించు భర్గుడనగ.

సీ. విక్రమంబువహించి వివిధసంపదలివ్వ
బలిచక్రవర్తిగా బలుకు టరుదె
దానధారావృష్టి ధరణీతలమునింపి
స్థిరకీర్తిబెంచగా దేవు డనరె
బుధనాథునకు కర్ణభూష లర్పింపగా
కర్ణవాతఖ్యాతిగాంచు టరుదె
గళలుగాంచుచు బుధకులమును బోషింప
సర్వజ్ఞమణి యనజాలు టరుదె
వేంకటాచలమాహాత్మ్య విపులకృతిని
గృతినిరచియింప బుధవరు డితడటంచు

పినజగన్నాథభూపతిజనవరులను
వారితారిజనేశులౌ వారిలోన.

సీ. గాధేయుతోఁ దానరాధేయుతోఁ సాటి
వెలయంగ సత్తపోవితరణముల
రాముతోఁ గిరిజాభిరాముతోడను సాటి
పొలుపొందు గురుభక్తి భూతిగతుల
జగ్రుతోఁ నల హరిశ్చంద్రుతోడను సాటి
చర్చింపగా కీర్తి సత్యరతుల
ధాతతోఁ నల్లమాంధాతతోడను సాటి
సొంపొంద భారతీసుగుణగతుల
ననుచు నెప్పుడువర్ణింతు రఖిలవిబుధు
లతఁడు శేషాహిమృత్యుజిహ్వాకరాళ
కఠినకరవాలనిర్జితక్ష్మాపవరుండు
పినజగన్నాథభూపతిఘనబలుండు.

గీ. బాధితారాతి పినజగన్నాథరాజు
భూమణుఁడు గొట్టెముక్కల బుచ్చినృపతి
యాత్మభవపాపమాంబికయందు గనియె
కృష్ణభూపాలుభూపాలు విష్ణుసముల.

వ. వారిలోన,

క. ఆభూపాలుడు మహీభర, తాభూపాలకు డటంచు ధరణీధవులుం
శోభిల్లఁబొగడ వెలిగె మ,హాభుజకరవాలనిర్జితారివరుండై.

గీ. ధరణి వర్ణాటుజం పెసలమ్మనృపతి
తిమ్మయాధిపసోదరి దేవిగాక
వేంకటాంబను బెండ్లాడి విమలమతిని
వెలసె లక్ష్మిని వరియించు విష్ణుడనగ.

వ. ఆ వేంకటాంబయం దాభూపాలరా జేవుర సుతులగాంచె.

క. హరు పంచముఖములనగా, హరిపంచాయుధములనగ నలపాండుక్ష్మా
వరు పంచతనయులనగా, ధరలో విలసిల్లి రధికదర్పోద్ధతులై.

సీ. వారిలోపల పెద్దవాడు కృష్ణావనీ
నాథుండు దా రమానాథు డరయ
నతని సోదరుడు భూతలనాయకుండు భగ
వాన్రాజు భూలోకవాసవుండు
తదవరజుండు భూధవసేవితుండు ప్ర
చండవిక్రమశాలి కొండనృపతి
తదనుసంభూతుండు ధారుణీధరమౌళి
పెదజగన్నాథుండు పృథుయశుండు
పినజగన్నాథు డందరి వెనుకవాడు
కొండనృపుడంకు కౌండిన్యగోత్రుడగుచు
దనరు జంపెనతిమ్మభూధవునితనయ
గంగమాంబను బెండ్లాడె ఘనతరముగ
పార్వతీసతి వరియించు భర్గుడనగ.

సీ. విక్రమంబువహించి వివిధసంపదలివ్వ
బలిచక్రవర్తిగా బలుకు టరుదె
దానధారావృష్టి ధరణీతలమునింపి
స్థిరకీర్తి బెంచగా దేవు డనరె
బుధనాథునకు కర్ణభూష లర్పింపగా
కర్ణవాతఖ్యాతిగాంచు టరుదె
గళలుగాంచుచు బుధకులమును బోషింప
సర్వజ్ఞమణి యనజాలు టరుదె
వేంకటాచలమాహాత్మ్య విపులకృతిని
గృతినిరచియింప బుధవరు డితడటంచు

బలుక జెల్లదెయని జనుల్ ప్రస్తుతింప
గౌరవెగురుకీర్తి జితరాజు కొండరాజు.

గీ. అతడు రఘునాథనృపతిని వితతకీర్తి
కృష్ణభూపాలశేఖరు కృష్ణవిభుని
దనయులనుగాంచె సంప్రీతివినుతనయుల
శరశరచ్చారుచంద్రికాసాంద్రయశుల.

గీ. వారిలోపల కృష్ణభూవల్లభుండు
కీర్తినిరహించె రణజయకృష్ణుడనగ
కేవలంబుగ రిపువనకృష్ణుడనగఁ
గెరలు నరపాలనంబున కృష్ణుడనగ.

గీ. అతడు కొండిన్యగోత్రుడై యలరెడు కలి
దిండిరామాంబికారామమండలాధి
పతుల కాత్మజ శ్రీరంగభర్తయనుజ
పాప మాంబిక బెండ్లాడి పరిఢవిల్లె.

సీ. ఆరామయందున నారాజుగనె కొండ
రాజు సీతారామరాజతిలకు
ఘనజగన్నాధు భూకాంతుని భూపాల
రాజుని శ్రీరంగరాజమణిని
వేంకటరామభూవిభుని వారందర
లోకొండవిభుడు చాలోకభర్త
యాతని యనుజుండు భూతలనాధుండు
రమ్యసీతారామరాజతిలకు
డతడు శివధర్మవర్ధన మాచరించె
ఖరుల దునుమాడె మానులగాచె మిత్ర
సంతతిని బ్రోచె సామ్రాజ్యసౌఖ్య మొసగి
బలధన సమృద్ధి బౌలస్త్యు గెలిచివెలిగె.

గీ. అమ్మహారాజు దానజితాంగరాజు
వరల కలిదిండినరసభూవరతనూజ
చెల్లమాంబను పెండ్లాడి చెలగె భూమి
జాత బెండ్లాడుజానకీజానివగిది.

వ. అతని యనుజన్ముండగు భూపాలరాజును వర్ణింపదరమె,

సీ. కమలాదిసత్కళాకాండంబులొనగిన
దనదు పుష్కరభూతి వనదుడిడిన
కనకకుండలముల గర్ణుడర్పించిన
సురశాఖ ఫలతతి జూరలిడిన
శిబిమేను దెగగోసి చేతుకిచ్చిన
గోరిరాజ్యము బలి కొమ్మటన్న
నీరధిస్వర్ణంబు నీపాలటన్నను
సురగవి కోర్కులు గురియుచున్న
మాని వారలనందర దానకన్య
నీకరగ్రహణావాప్తి నివ్వటిల్లె
ననుచు నెవ్వనివర్ణింతు రఖిలవిబుధు
లతడు గోపాలభూపాలు డలరుజగతి.

గీ. అతనిభామిని శ్రీదేవియార్యవినుత
కొమ్మభారతి కౌండిన్యగోత్రుకైన
రమ్యజంపెన యమలాఖ్య రాజతనయ
ధరణిసకలగుణాలంబ నరసమాంబ.

గీ. అట్టి దంపతులందున బుట్టి రెలమి
కీర్తివెలయించు వేంకటకృష్ణరాజు
విజయరామనృపాలుడు సుజనహితుడు
సాంద్రయశుడగు శ్రీరామచంద్రనృపతి,

వ. వారిలోన,

సీ. శారదశరతారతారకాదరహీర
హీరహారతుషారవారమేలి
డిండీరహారికాండకాండమగధ్వపిచండ
ఖండాంశుసుతపరాజశ్వములమీరి
జంభశాసనకుంభికుంభినీధ్రపశంబు
శంభువాహనచంద్రచయముదూరి
చందనామృతకుందకుందాశ్వగళనంద
నందనాగ్రజబిసద్బృందమొరశి
వెలసె నెవ్వనిసత్కీర్తివిశదమూర్తి
సకలహరిదంతకరిదంతనికరశోభ
యతఁడు విలసిల్లు దివ్యరూపాత్మభవుఁడు
కృష్ణసమకృతి వేంకటకృష్ణనృపతి.

వ. అతనియనుజుండు,

సీ. తతకృతిధని కాళిదాససంసేవ్యమై
భవభూతివైభవప్రచురమగుచు
వరలశంకరదత్తవాణీనివాసమై
రహిమాఘాఖ్యాన్నతిదండి రమ్యమగుచు
నసమబాణాకృతిరసికతాహాసమై
ప్రౌఢిమాఘుజయోక్తి భద్రమగుచు
సుకృతి చిత్రమయూరశోభాభిరామమై
సతతభారవిబుధసహితమగుచు
భోజసభమాట్కి నెవ్వనిభూరిగోష్ఠి
వెలుగునతఁడు సముంచితవిపులకీర్తి
విష్ణుభక్తిసుధాకరవిమలకృతికి
కర్త శ్రీవిజయరామభూభర్త దనరు.

వ. ఆయన యనుజుండు,

సీ. మంజువాణీలసన్మహితుఁడై యుండియు
విబుధనాథుఁ డనఁ బెలయుచుండె
నార్యాభిరాముఁడై యలరుచునుండియు
శ్రీధరుండనఁగను జెలగుచుండె
ధర్మరాజనఁగను దనరుచునుండియు
ధనదుఁడనంగ దా నొనరుచుండె
నర్జునాఖ్యుండన నలరుచునుండియు
గర్ణప్రియఖ్యాతి గాంచుచుండె.
ననుచు నెవ్వని వర్ణింతు రఖిలబుధులు
సకలదిగ్దేశనృపసభాస్థలములందు
నతఁడు వొగడొందు బరనిర్జితారిభర్త
చారుముఖరాజు శ్రీరామచంద్రరాజు.

వ. ఆధారుణీధవకుమారుండు,

సీ. నరసింహుఁ డనుచు వర్ణనజేయుటబ్రమా
తతహేమకశిపుదానత జెలంగ
బలభద్రుఁ డనుచును భాషించుటబ్రమా
కుందేందు లసదభిఖ్యుండుగాఁగ
మహివృషధ్వజుఁడని మన్నించుటబ్రమా
యతులవిభూతిశోభితుఁడుగాఁగ
ఘనబుధజ్యేష్ఠుఁడంచనుబల్కుటబ్రమా
సొంపగు వాగ్విలాసుండుగాఁగ
ననుచు నెవ్వాని వర్ణింతు రఖిలబుధులు
సేతుకాశీతలాంతరఖ్యాతకీర్తి
యతఁడు నరపాలవృత్తవీరారిభర్త
లీల వలరాజు వరలు భూపాలరాజు.

వ. అమ్మహామహునందనుండు,

సీ. రాజేంద్రులునుగాని రాజేంద్రులునుగారు
పురుడు కళాభోగభోగతతుల
నరదేవులునుగాని నరదేవులునుగారు
సరివాగ్విలాసవిశ్రాణనముల
కాశ్యపీశులుగాని కాశ్యపీశులుగారు
పోల్కి తేజోభూతిభూతిగతుల
భూపాత్మజులుగాని భూపాత్మజులుగారు
సాటిసత్వవిలాసపాటవముల
నిమ్మహారాజునకు నని నెమ్మిపొగడ
వెలసె సురదైత్య కర్షితవిపులమంద
రాద్రిసంక్షుబ్ధదుగ్ధవారాశిగర్భ
కీర్తి వేంకటపతిరాజు కృష్ణరాజు.
వ. అతని రమణీశిరోమణియు,
సీ. వజ్రాంకుగల నెలవంకదాల్చినవేళ
గామినిసర్వమంగళ యనంగ
కేలలీలాబ్జంబు కీలు కొల్పెడువేళ
లాలితాకృతి మహాలక్ష్మియనగ
దర్పణంబును కేలదాల్చిచూచెడువేళ
దివ్యసరస్వతీదేవియనగ
లలితామృతోల్లసత్కలశదాల్చినవేళ
కపటనారాయణీకాంతయనగ
గుందబృందంబులను దండగూర్చువేళ
మరుశరంబుల మెరుగారవరలఁజేయు
నలరతీదేవియోయన నలరుచుండె
నమలసద్గుణనికురంబ యచ్యుతాంబ
వ. అట్టిదంపతులకు తనయుండు,

సీ. సత్యకీర్తులహరిశ్చంద్రుండు చంద్రుండు
సాటిముమ్మాటికీ మేటికనుచు
మహిమహూపములకు మారుండు మారుండు
దొరమెరయంగ నీ దొరకటంచు
ధర్మవాగ్గరిమ మాంధాతయుధాతయు
సరిమరియుద్ధరాజానికనుచు
పరిశుద్ధిరుచిచిత్రభానుండుభానుండు
నెనగనుగొనగ నీ ఘనునకనుచు
నిఖిలవిబుధేశు లెవనివర్ణింతు రెప్పు
డతడు కుందేందు శరచంద నాబ్జధవళ
కుందమందారగౌరారవిందకీర్తి
రాజు శ్రీపూసపాటినారాయణు ఁడు.

సీ. ఇంద్రసూనునిభంగి నింపొందె నెవ్వాఁడు
దాక్షిణ్యగుణశక్తి దానరక్తి
కృష్ణనందనురీతి కృతిగాంచె నెవ్వాఁడు
యోగశక్తివిలాస భోగరక్తి
సోమసన్నిభరీతి సొంపొందె నెవ్వాఁడు
ధనగరిష్ఠతయశో ధనప్రతిష్ఠ
హంసభాసురరీతి నలరారె నెవ్వాఁడు
శ్రీనివాసతవిభాశ్రీసరసత
నతని శ్రీపూసపాటినారాయణేంద్రు
సరసనిస్తంద్రు గుణసాంద్రు దరమె బొగడ
ఫణిపతికినైన భాషాధిపతికినైన
పశుపతికినైన మరియు వాక్పతికినైన.

వ. మఱియు,

సీ. ప్రబలవత్తతమః పాటనపాండిత్య
మెనయు నీతని సుదర్శనవిభూతి
క్షమపుణ్యజనవర్ధనము జేయు నీతని
స్తవనీయ సద్గుణధర్మపటిమ
ప్రత్యర్థి మానవ స్వస్థిత్రిపదలీల
నలరారు నీతనియాదరంబు
ఘనధరాసురదానగరిమచాతుర్యము
జెందు నీతని సదానందకాఖ్య
గాన నీనామ మన్వర్థకంబటంచు
సరసులు నుతింతు రెవ్వని సభలయందు
నతడువాసిష్ఠగోత్ర వంశాంబురాశి
చంద్రుడైనట్టి నారాయణేంద్రు డలరు.

వ. ఇతని పత్నియగు చంద్రమాంబను వర్ణింపదరంబె.

గీ. ధరధనంజయగోత్రుడై దనరుచున్న
రమ్యజంపెనవంశాంబురాసిరాజు
భూరిసత్కీర్తిజితరాజు భోగరాజు
తేజరిలుచుండ రఘునాధరాజు భువిని.

గీ. అతనిసతి సర్వమంగళ యన్నపూర్ణ
కోమలాకారవల్లి సతీమతల్లి
గవులకునుదల్లి యాశ్రితకల్పవల్లి
విమల సద్గుణనికురంబ వెంకయాంబ.

క. ఆరాజరాజవదన, శ్రీరాజితగర్భకలశ సింధువరేణ్యా
శ్రీరామయగుచు వెలసెను, శ్రీరాజిత చంద్రమాంబ శ్రీపతిబింబా.

వ. మఱియును,

సీ. చంచలత్వముమాని సంచరించునులక్ష్మి
బహుళభాషిణిగాక ప్రబలుభాష

సామ్రాజ్యహీనత జనకున్న సావిత్రి
ఘనపాంసులాకార గానివసుధ
న్యూనవంశోద్భవ గానియరుంధతి
యర్ధాంగయునుగాని యన్నపూర్ణ
దనుజపుత్రికగాక దనరుశచీదేవి
యినునకు నెగ్గుసేయనిసుకన్య
యనగ రంజిలె ధీరయు నతిమితోక్తి
సతతసంపత్తి సత్పుణ్యసత్కృతిసువంశ
రమ్యతరగాత్రి సత్పుత్రి రమణరక్తి
సకలగుణమణి నికురంబ చంద్రమాంబ.

క. శ్రీనారాయణులనగ భ, వానీశంకరులనంగ వాణీవాణీ
జానులనంగను ఛాయా, భానులనన్ జగములోన బ్రబలిరివారల్.

వ. అమ్మహాదంపతులకు వేంకటపతిరాజు రఘునాథరాజు నరసభూపాల రాజు నచ్యుతరామరాజు విజయరామరాజు సూర్యనారాయణరాజు నా నార్వురుగుమారులు రూపజితమారు లుద్భవించి రందు వేంకటపతిరాజు గుణగరిమంబెట్టిదనిన,

సీ. కల్పకంబును బ్రమానుగాగ జేయు గొరంత
చింతామణిని రాయి జేయురవ్వ
సౌరభేయిని పశుజాతిగ జేసిన రట్టు
బలిని రక్కసు జేసి నిలుపువెలితి
తరణిజు గౌరవ దాసు జేసిన తప్పు
శ్రీదుబింగాక్షు జేయునోత
కమలారిని క్షీణగాత్రు జేసిన సేగి
శిబిని మాంసదుగాగ జేసినసడి
మలపుకొనజూచిగాబోలు జలజభవుడు
దనర నీదాతను సృజియించె ననుచు

4

బుధులు వినుతిచేయంగ నిత్యంబు వెలయుచుండు
భువిని వేంకటపతిరాజు భోగరాజు.

వ. మఱియును,

సీ. ధారాధరంబోట ధరణిసీకర హేతి
బరజీవనదరీతి బరిఢవిల్లె
సుగుణధర్మ-బోటసొంపొందునీ పాణి
ప్రత్యర్థికాండసంపదల నీనె
కమలాంచితంబోట గనగ నీకనుదోయి
సంశ్రితాళికిరససంపదలిడె
వాణీలలితమాట పరలు నీవదనంబు
సర్వవిద్యావిలాసత జెలంగె
ననుచువర్ణింతు రెవ్వనినఖిలబుధులు
మంజులాలాప నవసుధామధుర ఫణితి
నతడు విద్యలభోజు డత్యమల తేజు
డలరు వేంకటపతిరాజు లలితమూర్తి.

సీ. రాకాసమయచంద్ర పాకారికుంభీంద్ర
కాకోదరమహేంద్ర కాంతరుచులు
హారాళికాదంబ గౌరాంబుజకదంబ
తారానిచయశంబ ధవళఘృణులు
తాలాంకశరబృంద బాలాబ్జధరకుంద
కైలాససితకంద కాంతితతులు
క్షోణీరథతురంగ వాణీసుధాగాంగ
వేణీధరోత్తుంగ విశదవిభులు
నగుచు నెవ్వని కీర్తులు జగతిబరగు
నతడు శ్రీపూసపాటివంశాబ్ధిరాజు

రసికజనరాజు వితరణ రాజరాజు
బోలుచు వేంకటపతిరాజు భోగరాజు.

గీ. ఇమ్మహారాజురాజాస్య యెన్నదరమె
నవ్యపెనుమత్సకులజగన్నాథరాజు
తనయవినయవిరాజితధన్యమాన్య
సుగుణలక్ష్మీనరసమాంబశుభకదంబ.

సీ. వాణితో లలితశర్వాణితో హారిశుక
వాణితో చ్యవనాలివేణితోడ
సీతతో దేవేంద్రమాతతో కోసల
జాతతో నీలసంభూతతోడ
శాంతతో విలసితానంతతో కుంభజు
కాంతతో శశికుందదంతతోడ
ఛాయతో రుచిదాన సూయతో మన్మథ
జాయతో నలహేమకాయతోడ
సాటి యీబోటియని బుధకోటి పొగడ
సత్యశౌచపతివ్రతాకృత్యసంత
తాన్నదాన మృదూక్తి ప్రసన్నమధుర
సుగుణలక్ష్మీనరసమాంబ శుభకదంబ.

వ. ఇట్టి దంపతుల కుమారుండు,

సీ. మేనకళంకంబు బూనకుండినరాజు
ఖరకరంబులమాని బరగుహేళి
సశరీరుడై మించు సారసాంబకధారి
విరటుగొల్వని లసద్విజయశాలి
కవచంబువీడని కర్ణప్రియఖ్యాతి
పశుపాలకుడుగాక బరగుశౌరి

పాలవృత్తిఁ బీడిన బలరాముఁ డేవుండు
　　　　　　　మహినిత్యుఁడై యున్న మాధవుండు
ననుచు శూరులు వర్ణింప నలరుచుండె
సకలదిగ్దేశనృపసభాస్థలములందు
దివ్యసద్యోగనిర్జితదేవరాజు
నతవిబుధరాజు శ్రీజగన్నాథరాజు.

వ. వేంకటపతిరాజునిసోదరుండగు రఘునాథరాజున్న గుణమాన్యత్వం
బెన్నదరంబె.

సీ. కంజాక్షుఁ డీమేటి గాబోలు గాకున్న
　　　　　　　పురుషోత్తమఖ్యాతి బొందగలఁడె
గంజాస్త్రుఁ డీమేటి గాబోలు గాకున్న
　　　　　　　మహిజగన్మోహన మహిమగలదె
గంజాప్తుఁ డీమేటి గాబోలు గాకున్న
　　　　　　　సకలలోకప్రభాసరణిగలదె
కంజారి యీమేటి గాబోలు గాకున్న
　　　　　　　నిఖిలకళావాప్తి నేర్పుగలదె
దేవుఁ డాతఁడు భూధవదేవుఁ డితఁడు
భానుఁ డాతఁడు శుచిచిత్రభానుఁ డితఁడు
రాజితముజూడ రఘునాథరాజితండు
...　　...　　...　　...

వ. ఈరాజచూడామణి కుమారులు,

గీ. రామలక్ష్మణు లనగను రహిఁ జెలంగి
కృష్ణబలరాము లనగను కీర్తిమించి
పెద్దనారాయణేశుండు పృథుయశుండు
చిన్ననారాయణేశుండు జెలగిరవని.

వ. ఈ రాజ చూడామణి యనుజుండు.

సీ. కాలకాలోత్తాలఫాలకీలిప్రభల
మేను సోకనినాటిసూనశరుడు
వీరభద్రునిపాదవిక్షేపఘాతంబు
బోరదాకనినాటి నీరజారి
కలిబలోన్నతి ఘోరకాంతారవీధిని
నెలత వీడనినాటి నిషధరాజు
దండిచండిమమూని మండలాదుతునుబూని
విరటుగొల్వనినాటి విజయమూర్తి
వీర్యశృంగారసద్రూపవిజయగతుల
ననుచు నెవ్వని వర్ణింతు రఖిలవిబుధు
లతడు బాగడొందు సత్సభావితతులందు
లీలవలరాజు నరసభూపాలరాజు.

సీ. శ్రీదమై కువలయామోదమై పటుతమ
శ్ఛేదమై విన్నున జెలగునెద్ది
సూరమై బుధజనాధారమై కవివచో
గారమై జగతిలో మీరునెద్ది
దండిమై దీపితాజాండమై చండిమా
ఖండమై దీప్తితో గ్రాలునెద్ది
తోరమైనవసుధాసారమై శాస్త్రావ
తారమై భూమిలోదనరునెద్ది
సరసనీకీర్తి నీభుజశాఖ నీప్ర
తాపరూపంబు నీభాషితంబు గాని
గాదు వెన్నెలగాదు సత్కల్పశాఖ
కాదు రవిరుచిగాదు వాక్కులనజూడ.

వ. అని యిట్లు వినుతింపంబడు శ్రీనరసభూపాలరాజున కనుజుండు,

సీ. జడలలో మిన్నేరు శశిరేఖ గలిగిన
మేటి ముమ్మూర్తి కీలాటివాడె
కరమున శంఖచక్రంబులు గలిగిన
ఱేడు జూడంగ నీజోడువాడె
శతకోటి సురవధూజనకోటిగలిగిన
ధీరుడెన్నంగ నీతీరువాడె
కమ్మవిల్లును పద్మకాండముల్ గలిగిన
వన్నెకాడరయ నీచెన్నువాడె
యనుచు నెవ్వాని వర్ణింతు రఖిలబుధులు
సకలదిగ్దేశనృపసభాస్థలములందు
నతడు సత్కీర్తివిజితనీహారహార
రాజు విలసిల్లు నచ్యుతరామరాజు.

వ. తదనుజన్ముండు,

సీ. కలితకర్ణోల్లసద్గతిమించె నెవ్వాని
దర్పనదీప్తి సత్సర్పనాప్తి
కల్పశాఖాక్షేపగతిమించె నెవ్వాని
త్యాగశక్తి సుబాహుతాగరక్తి
సోమసన్నిభవృత్తి సొంపారె నెవ్వాని
దానశోభ విరాజదాననాభ
భూరిఘనాఘనంబును మించె నెవ్వాని
వాణి విశ్రాణనశ్రీణిదెలుప
నతడు సత్కీర్తివిజితభవాబ్జహీర
హీరడిండీరహారనీహారతార
తారకాకాశశారదనీరదుండు
విజయరామమహారాజవిభుడు దనరు.

వ. అతని సోదర్యుండు,

సీ. చంద్రుతో నలహాటశ్చంద్రుతో సాటిగా
కళలకు సత్యవాక్కళల కితడు
ధాతతో లలితమాంధాతతో సాటిగా
వాణికి సద్గుణశ్రేణి కితడు
రాముతో గిరిజాభిరాముతో సాటిగా
భక్తికి గురులపై శక్తి కితడు
కర్ణుతో శేషగోకర్ణుతో సాటిగా
యీవికి వాచాళికీవి కితడు
మారుతోడను ధరజాకుమారుతోడ
హేలచేతను విక్రమలీలచేత
సాటియని వర్ణనము జేయ సకలబుధులు
రహి దనరుచుండు సూర్యనారాయణుండు.

వ. వీరలలో కృతికర్తయగు శ్రీ నరసభూపాలరాజమౌళికాంతాలలామం
బు నభివర్ణించెద.

సీ. ఘనబుధావళిపాల గల్గు కల్పకవల్లి
కవిజనంబులకెల్ల గన్నతల్లి
భాసురసజ్జనబంధుచింతామణి
శ్రితజనపుంజసంజీవకరణి
కోవిదపాళికి గొంగుబంగరుమూట
బాలుపారుశుభముల పూలదోట
గురుపాంథజనముల వరతపఃఫలరాశి
సద్గుణమణులకు సలిలరాశి
కలితసాధ్వీశిరోమణి లలితసరణి
యనుచు లోకులు వినుతింప నలరుచుండె
సద్గుణకరంబ ముఖజితచంద్రబింబ
గురుశుభాలంబ వెంకటరమణమాంబ.

వ. మఱియు రెండవ పుండరీకాక్షిని వర్ణింప దరంబె.

సీ. మహానియ్యకాశీసమాఖ్యకొప్పునదొల్చి
పరమకల్యాణియై ప్రబలినసతి
కమలాభినవధామ కనుదోయి నిడి సిరుల్
ప్రబలజేయుచునున్న పద్మహస్త
శ్రీకారగరిమంబు చెవులందు వెలయించి
గాంధర్వ మిలనింపు కలితవాణి
యచలాభినుతరీతి నలకటిప్రకటించి
ధనధాన్యములనింపు ధన్యగోత్ర
యనుచు విబుధాళులెల్లప్పు డభినుతింప
వెలసె బాంధుజనంబులు బ్రసికొలువ
విబుధకల్పకవల్లి సాధ్వీమతల్లి
గొరలులక్ష్మీనరసమాంబ గుణకదంబ.

వ. ఇయ్యిద్దరుముద్దియలకుం భర్తయగు నరసభూపాలభూభర్తన వర్ణించెద.

సీ. కరిభంగకరితుంగహరిభంగరథగాంగ
శరభంగహేమాంగ సతులగేరి
సురకాండనరకాండ హరకాండశరకాండ
హరిపుండరీకాళి నాక్రమించి
యరవిందవరకుందహరిచందనరసైంద్ర
వాశ్మశరత్కాండవార మేలి
సురరాజకరిరాజగిరిరాజసురభూజ
హరిరాజసింధురాజాదినడచి
వెలసెనెవ్వనిసత్కీర్తివిశదమూర్తి
యతడు సంగీతసాహిత్యకృతిపురాణ

సరసవిద్యావిశారదశారదాన
రావతారంబు నరసధాత్రీవరుండు.

వ. మఱియును,

సీ. ఉద్యోగములు లేవె ప్రద్యోతదనవద్య
గద్యపద్యాంకముల్ గావుగాక
ధనసంఘములు లేవె ఘనధర్మదానాది
పావనక్రియల పాల్పడవుగాక
బలసంపదలు లేవె ఖలబాధితజనాలి
పాలనలీల కేర్పడవుగాక
సాహిత్యములు లేవె చారురసజ్ఞతా
సుజ్ఞానవిధులకు జోరవుగాక
వసుధలోపల నరపాలవరులు లేరె
లీలసీమాట్కిసరసులు లేరుగాక
యనుచు నెవ్వనివర్ణింతు రఖిలవిబుధు
లతడు శ్రీనరసభూపాలకుతలభర్త.

సీ. లాటీమరాటీపరాటీకుచోద్ఘటీ
పాటీరచర్చయై పరిఢవిల్లె
నంగీకళింగీలవంగీలసద్గోష్ఠి
సంగీతవాణియై చౌకళించె
కాశీసుకేశీకరూశీవళక్షోరు
కౌశేయవసనమై గ్రాలుచుండె
చోళీగళాళీసమాలీఢమల్లికా
పాళీకలాపమై ప్రబలుచుండె
ధరశరచ్చంద్రచంద్రికాధవళమగుచు
నెవనిసత్కీర్తిసన్మూర్తి భువిని నిండె

నతము నిశితాసికృత్తవీరారిభర్త
లీలవలరాజునరసభూపాలరాజు.

వ. ఇయ్యభినవమారకుమారులు,

సీ. దానశక్తిని కామధేనుకర్ణాదుల
సాటివారీపూసపాటివారు
మంత్రశక్తిని దేశమంత్రులలోకెల్ల
తేటువారీపూసపాటివారు
జ్ఞానశక్తిహిరణ్యసూనువిదేహుల
తోటివారీపూసపాటివారు
ధైర్యశక్తిని మేరుధరధరవరముల
సూటివారీపూసపాటివారు
వారిలోపల నరసభూవల్లభాత్మ
భవులు సద్ఖ్యాతినిర్జితభవులు ధరణి
ధవులు నారాయణేశుండు తదనుజుండు
గనగ వేంకటపతిరాజు దనరుభువిని.

షష్ఠ్యంతములు.

క. ఏత దృశపూతామిత, సీతామలసుగుణమణికి శ్రీమన్మణికిన్
సీతాపతిపదసేవా, చేతోగ్రామణికి బంధుచింతామణికిన్.

క. రాణీశుకవాణీ శ, ర్వాణీవరశరసుపర్వవారణగంగా
వేణీభ్రశ్రేణీరు, గ్వాణీపతిధరసురార్వ రమ్యయశునకున్.

క. శ్రీరమణీహారమణీ, వారమణీసారకలిత వక్షస్థలస
న్నారాయణచరితామృత, పారాయణభవ్యమతికి భాసురకృతికిన్.

క. పారావారాధిపగం, భీరులకుం దురితజాలభీరున కగరా
డ్ధీరునకు సర్వవిద్యా, సారునకు సమస్తవిభవసత్సారునకున్.

క. ధీరున కఖిలార్థిజనా, ధారునకు మనోజవేషధారునకు మహో
దారునకు రుసుకుమారా, కారున కఘదూరునకునుఘనసారునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయోనర్పంబూనిన నరసభూపాలరా
జియ్యంబను శృంగారరసప్రబంధంబునకు గథాక్రమంబెట్టిదనిన.

సీ. గురునిత్యకళ్యాణధరచారుభవనంబు
నవసుమనోబృందనందితంబు
గురుబుధకవిరాజనిరతనివాసంబు
సారామృతాశయసన్నుతంబు
సమలరంభాదికాంతావాసలలితంబు
సింధుజాతమహాశ్వబంధురంబు
సర్వజ్ఞశేఖరానీశభాసమానంబు
గజరాజశతకోటివిజయదంబు
నగుచు వెలసెనుసురపురి ననుకరించి
రత్నసాలశిఖాగ్రయంత్రావతరణ
గగనగంగాపయఃపూర్ణ కలితఖేయ
నిరతభరితంబు సాకేతపురవరంబు.

ఉ. సాలమనంతభూరిపదసంగతి గాంచె నటంచు ఖేయమున్
జాలి యనంతభూరిపదసంగతిగాంచెను దానిజూచి స్వ
చ్ఛాలలనంతభూరిపదసంగతి గాంచెను సత్యమేక దా
ప్రాలినసాటికిం బొరలు వారిచరిత్రములెంచిచూడగన్.

గీ. హరులు వేగతిరస్కృతహరులు తుంగ
వారణంబులు నగగర్వవారణములు
గోపురములు శిఖోల్లిఖద్గోపురములు
వరణముద్గతతారకావరణమంను.

గీ. నాల్గుమోముల వేదముల్ నాల్గుబల్కు
టదియు నొకచిత్రమేయని యచటివిప్ర
ముఖ్యులెల్ల చతుర్వేదములు బఠింతు
రెలమిసంహిత తప్పక లలితసదనిం.

ఉ. రాజకుమారు లగ్ర్యనుతిరాజకుమారులు భోగసత్కళా
రాజకుమారు లర్థనిధిరాజకుమారులు వీర్యపార్వతీ
రాజకుమారు లర్ధరుచిరాజకుమారులు రూపభార్గవీ
రాజకుమారు లాస్యజలరాజకుమారులు బొల్తు రప్పురిన్.

మ. ధనదుల్ పుణ్యజనేశ్వరుల్ నిధివరుల్ దైవజ్ఞధుర్యుల్ మహా
జనధర్ముల్మఱియక్షశిక్షకవరుల్ సర్వజ్ఞమిత్రు ల్లస
ద్ధనభర్త ల్గుహకాధినాథులన మోదంబుం సువైశ్యాగ్రణు
ల్మనియుల్ దత్పురిలో గుబేరులనగా శోభిల్లుటల్ చిత్రమే.

క. అద్రులు ధైర్యంబున బా, లార్కులు సత్కాంతిచేత నంచితముగ సా
భద్రులు బలసంపద చే, రుద్రులు సద్భూతినంత రూఢిగ శూద్రుల్.

సీ. ధర్మగుణాక్షేపతను గాంచి మించిన
శరవేగ మేపాటి సాటివచ్చు
బక్షపాతంబున బైపయిం దిరిగెడు
గరుడవేగం బెంత బురుడువచ్చు
శాఖిశాఖాభంగసంచారము నమించు
శ్వసనువేగం బెంత సవతువచ్చు
మందేహులను మాటిమాటికిం దోలెడు
సూర్యవేగం బెంత జోడువచ్చు
ననగ విలసిల్లు రత్నకాంచనవిటంక
కింకిణీమాలికాసముట్టంకితోడు
ఘణఘణారావరణితదిగ్గణమహీధ్ర
కందరంబులు తత్పురీస్యందనములు.

సీ. దానధారావృష్టి ధరణీతలము నింప
విపులకర్ణఖ్యాతి వెలయు టరుదె
లలితపద్మవిలాసకలన దేలుచునుండ
గమలాకరస్ఫూర్తి గాంచు టరుదె

నారదసముదగ్రగౌరవవృత్తి జెలంగ
బర్వతోన్నతకీర్తి బరగు టరుదె
కుంభసంభవరీతిగొమరారు చుండంగ
గ్రుపదవిచ్ఛేదత దోగు టరుదె
యనుచు వర్ణింపతగియుండు నప్పురమున
బుష్కరాపీతమంజులపుష్కరాప
గాలసత్పుష్కరాత్మసంకలితతర్ష
వారణములై నతత్పురీవారణములు.

సీ. నారికేళఫలసారు నారికేళఫలరీతి
సరసజన్మఫలాప్తి సంఘటించు
గమలాకరంబులు కమలాకరము లట్ల
బటుసారసములశోభల వహించు
రాజమార్గంబులు రాజమార్గంబుల
భంగి సద్రత్నసంపదల జెలగు
వాహినీవరములు వాహినీవరముల
గతి సింధుకాండసంగతిని మించు
రామలారామలాలితసీమలవలె
నిత్యసుమనఃప్రమోదత నెరయు మెరయు
నహహా తత్పురి వర్ణింప నలవియగునె
ధాతకైనను గోకర్ణనేతకైన.

శా. రంభే స్వాగత మాస్యతాం హరిణి భద్రంకచ్చి దూర్వస్యతో
శం భో తే స్థితిలోత్తమే సురవధూ స్సాఖ్యాని కిమ్మంచు వే
సంభాషింతురు సారభావ నిలసత్సౌధాగ్రభూదేవరా
డంభోజాక్షులు దేవభామినులతో హాళిం బురిన్ నిత్యముక్.

సీ. ధర్మద్దలదరినున్న చెండులిచ్చెదె శుభా
కరపద్మముల గొవదరముగాదు

కోరంటనిత్తువే సారంగలోచన
యివి కోటికోటుల కివ్వరాదు
రంభలదా చెడె రంభోరువతి నీకు
నవి నూరులకు నివ్వ నలవిగాదు
నీలాంబరం బడ్డు నిలిపెను డెల్పవే
విలువెంత దొరకొను వేలకొలది
యతివ నీసుమనంబు నెం దలరు చెపుము
సామి నెరజాణ వెఱుగవా సరసునందు
ననుచు నర్మోక్తులాడుదు రనుదినంబు
రసికజనపుష్పలావికారమణు లచట.

సీ. ధరములో నీలాంబుధరములో గానంగ
గుచకచరచన లీకొమ్మలకును
నదములో నవకోకనదములో జూడంగ
నాభీకరంబు లీనారులకును
గంబులో గడుమానికంబులో భావింప
గంధాధరంబు లీకామినులకు
గరములో శుభ్రాంశుకరములో మదినెంచ
నూరుహాసంబు లీయువిదలకును
ననుచు లోకులు వినుతింప నలరుచుందు
రప్పురంబున సరస విహారలలిత
సారసారసమార్గణోదారశాస్త్రి
వారపారగమతులైన వారసతులు.

సీ. అక్కులసత్తులి నలలాడుచున్నవి
బలుగుత్తులా యువి జలజపాణి
సరసుడవాదార నెరజాణ వేరుగ
గాదుకొంతుము రేఖగప్పుకొనిదో

గారికుంకుమములో గాంచినగనరాదె
నెరిరత్నసరులందు నిండియుండె
రత్నసరంబులరహిలోనగనరాద
బలరామభోగంబునెలవుజెపుము
సామిబంగారుదీగెలచాలులగడ
నిశలదోటలకూటున నెమ్మిజెలగు
ననుచు సరసోక్తులాడుదు రనుదినంబు
రసికవిటశాలిపాలికారమణు లచట.

సీ. కనక్రౌంచమును దూయగానేసిమించిన
వానివిక్రమ మెంత వన్నెకెక్కు
శంబరవధజేసి బానలగాంచిం చు
వీరుబలంబెంత వినుతిగాంచు
గొంకొకింతయులేక గోవత్సకూల్చిన
ఘనునిశౌర్యంబెంత ఘనతగాంచు
నలిబాలకునిద్రుంచి లజ్జింపకుండిన
మేటిసాహసమెంత పాటికెక్కు
ననుచుశివ్రుబట్టిసిరిపట్టి నదితిపట్టి
నంచుపట్టుల నిరసించి నాగసింహ
గండభేరుండశార్దూలఖడ్గశరభ
వారమర్దనపటు లందు వీరభటులు.

చ. పటుతరచంద్రకాంతమయభాసితకాంచనసౌధవీధి యు
త్కటముగ నంతరిక్షమును దాకగ భానుడు జూచి వేగదా
నిటునటు నోరసిల్లి చననింతకు ముగ్ధలు దక్షిణాయనం
బటువలె నుత్తరాయణ మటందురు సూర్యున కెంతవేలలో.

సీ. ఆచక్రవాలావనీచక్ర మంతయు
నేకచక్రంబుగా నేలుచాడు

బృందారకార్చిత మందారకనకార
వింద్రాదిసుమగంధ మందిరుండు
ప్రాజ్ఞానుమతిభాస దాక్షాలసద్వృత్తి
విజ్ఞానధావిత విబుధరిపుఁడు
కోటీరసాధ్వీశకోటీరమణివిభా
కోటీలసత్పాదగోజతలుఁడు
సకలగీర్వాణగీర్వాణ సార్వభౌమ
విహితసింహాసనార్ధసువిష్టరుండు
పరమపుణ్యుండు పోషితపండితుండు
పురికధీశుఁడు దశరథభూవరుండు.

క. తానా జననాథుఁడు సం, తానార్థము సకలమునివితానాంచితుఁడై
తానాగ్నినుపాసించెను, నానాహవిరాదిసాధనంబులు వెలయన్.

క. ఆసమయంబున సురముని, వాసవముఖులైనదేవవర్గంబులు ప
ద్మాసనుతో రావణ ఘో, రాసురకృతబాధ దెలుప నాతఁడు వేగన్.

క. వారలుదనుగొల్చుచు రా, వారిజభవు డపుడు గలశవారధికడకున్
జేరికరంబులుమోడ్చుచు, నారాయణుబొగడదొడగెనమ్రత వెలయన్.

సీ. కాంచనచేలాయ కమనీయశీలాయ
దేవారికాలాయ తే నమోస్తు
ఖండేందుమిత్రాయ కంజాతనేత్రాయ
దివ్యాభ్రగాత్రాయ తే నమోస్తు
ఖలవనదావాయ కౌస్తుభగ్రీవాయ
దేవాదిదేవాయ తే నమోస్తు
భాసితవేదాయ భక్తానుమోదాయ
తీర్థాంబుపాదాయ తే నమోస్తు
త్రిజగదవనోరుదీక్షాయ తే నమోస్తు
దీపితాజాండకాండాయ తే నమోస్తు

భానుభానునిభాభాయ తే నమోస్తు
మీనకేతనజనకాయ తే నమోస్తు.

క. అనుచును వనజభవాదులు
వినుతింపగ జిత్తగించి విష్ణుడు ఖగవా
హనుడగుచు మదనశతమో
హనుడగుచును జాపచయదహను డగుచువడిన్.

సీ. హారకిరీటకేయూరకుండలవిభా
శ్రేణితో ఘననీలవేణితోడ
శంఖచక్రగదాసిశార్ఙ్గచతుర్భుజ
శోభతో బాలసూర్యాభతోడ
కరుణారసావాసకంజాతసన్నేత్ర
యుగముతో చిరునవ్వు మొగముతోడ
శ్రీసతీకౌస్తుభశ్రీకనత్పీనవ
క్షంబుతో సత్కటాక్షంబుతోడ
డంబుతో మంజుపీతాంబరంబుతోడ
వరలుచును వచ్చి భారతీవరున కపుడు
హెచ్చి తనదివ్యదర్శనం బిచ్చె సామ
గానపరాయణుండు నారాయణుండు.

వ. ఇట్లు దర్శనంబిచ్చిన పుండరీకాక్షు నీక్షించి, చేతులు జోడించియు
న్న యన్నలినభవాదులం గని మీరలంద రిందువచ్చినకారణం బేమి
యని యడిగిన నిత్యామోదికి విధియిట్లనియె.

క. మదమోఘవరముచేతను,మదమత్తుండు రావణుండు మనుజుల సురలన్
సదమదము జేసె వానిం,గదనంబునగూల్చి సురల గావుము తండ్రీ.

వ. అనిన శ్రీహరి యిట్లనియె,

క. దశరథరాముడ నగుచును, దశకంఠుని గూల్చి దేవతతికబ్బినత
ద్దశ లెల్ల మాన్తుననియూ,నిశిచరహరు డరిగె వేగ నిజగృహమునకున్.

క. నరుడప్పు డమరులంగని, నరుడై వర్తించువిష్ణునకుమీరలు వా
నరులై దోడ్పడు డనికిన్, నరసురముఖ్యులందు జనిరి నాకంబునకున్.

వ. అనంతరంబ వా రట్లుగా వించి నిజనివాసంబులకుం జన నిచ్చుట,

క. పాయక మునివరసంఘం, బాయజ్ఞము సేయ ననలు డతిమోదమతిం
బాయసము దెచ్చియిచ్చెను, బాయ సమస్తాఘములు కృపాకలితుండై.

వ. ఇట్లిచ్చిన నమ్మహీమండలాఖండలుండు,

క. అర్థము గౌసల్యకు శే, షార్ధముగైకకు నొసంగ నంతట వారల్
స్వార్ధార్ధంబులచేత కృ, తార్థనుగా జేసిరప్పు డలర సుమిత్రన్.

వ. అనంతరం బాయజ్ఞంబు ప్రాజ్ఞులతో సాంతంబు జేసి కృతాభిషేకుండై నిజగృహంబునకుం జని యథోచితభోగంబు లనుభవింపుచుండ దత్పత్ను లంతర్వత్నులై రప్పుడు,

సీ. శ్రీపతివనయుండు జెలగుచుండుట జేసి
కౌను బీదతనంబు కడమ బాసె
ముమ్మూర్తులమగువేల్పు మొనయుట లోలోన
మేనికి నొకవింత మెఱుగు దోచె
వరదుఁడై తగుపరాత్పరుడు లోపలనుంట
కాంచి సంపూర్తిని గాంచివెలిగె
గర్భస్థనీలాంగ కాంతిరేఖాకృతి
ప్రతిబింబమన రోమరాజి మెరసె
వళులు నెరవాసె భూషణావళులు జారె
శ్రమజలంబులు జనియించె శ్రమము మించె
వితతద్రుహిణాండములు గుక్షి వెలుగుచున్న
వేల్పు గౌసల్యకడుపులో వృద్ధిబొంద.

వ. మఱియును.

సీ. హరిమధ్యసంగతి నలరుచుండెను నాడు
హరిమధ్యసంగతి నలరె నేడు

విష్ణుపదప్రౌఢి వెలయుచుండెను నాడు
విష్ణుపదప్రౌఢి వెలసె నేడు
వేదిగురుస్థితి వెలగుచుండెను నాడు
వేదిగురుస్థితి వెలగె నేడు
న్యగ్రోధపత్త్రాభ నలరియుండెను నాడు
న్యగ్రోధపత్త్రాభ నలరె నేడు
నహహా కొను విచిత్ర మేమనగవచ్చు
లేమికిలుముల నొకరీతి లీలదనరె
నవని నిటుగాదె పరమాత్మ నాత్మలోన
నిలుపుకొనువారివర్తన ల్దలచిచూడ.

వ. ఇట్లారాజరమణీమణులు, దౌహృదలక్షణంబుల వెలసి, ప్రసూతిమాసంబు రా నొప్పు లరుదెంచిన యిట్లనియె.

సీ. వల్లభాంగమునెలవంకలర్పించుట
వల్ల నీచిరునొప్పులల్లెనమ్మ
ధవునిచేతను మున్ను తాంబూలమునుగొని
నంతన నరుచియు నొందెనమ్మ
ధవునిచే రతికిప్రార్థన నొందినందుకే
వనితల బతిమాల వలసెనమ్మ
సామిని రతులబల్ శ్రమబుచ్చినందుకే
శ్రమజలంబులు మేన నమరెనమ్మ
వరుస దైవ మెట్టివనితలకైన దా
నట్టిఫారికిట్టు లాచరించు
దరుణికిఫలంబు దప్పదు వినుమమ్మ
యనుభవంబు నాకునాయె నమ్మ.

వ. అనిమఱియు నిట్లనియె.

సీ. కరకంజములు గడగడలాడెనోయమ్మ
శిరము జిరజిరమని దిరిగెనమ్మ
నయము కళుక్కని వడకాడెనోయమ్మ
కడుపులో వేదన గదిరెనమ్మ
యక్కరో పక్కలో నొక్కునెక్కెనమ్మ
జిక్కులబడిమేను స్రుక్కెనమ్మ
పదకోకనదములు గుదిగొనెనోయమ్మ
బెదరిబెదరిబుద్ధి జెదరెనమ్మ
యింక నేమిసేతు నేదైవములజూతు
నెవరి వేడుకొందు నేమనందు
భామలార దాదిలేమల జేరరే
తల్లులార సతీమతల్లులార.

వ. ఇట్లు వేదనబడునంత నొక్కచక్కెరబొమ్మ గ్రక్కునదెచ్చిన దధిక బళంబు కసికాట్లగా గొరుకుచు, చురుకుచుమక్కుచు బ్రక్కనొక్కులకు జిక్కునంత,

సీ. కరమొప్ప గ్రహపంచకంబు నుచ్చస్థమై
సొంపారగా జైత్రశుద్ధనవమి
నాడు బునర్వసు నక్షత్రమందున
లలిత కర్కాటకలగ్నమందు
గురుడు చంద్రునితోడ గూడియుండగ భాను
డును మేషరాశిని దనరుచుండ
ఘనకోసలాత్మజాగర్భసుధాబ్ధిలో
జనియించె శ్రీరామచంద్రమూర్తి
సకలదైతేయదయతమిస్రము నశింప
జారుపిబుధచకోరముల్ సంతసింప

నాశలను గీర్తిచంద్రిక లావరింప
సజ్జనానందపరితుష్టి సంభవింప.

వ. అట్టిసమయంబున శంఖచక్ర గదాధరుండును, శ్రీధరుండును, పీతకౌశేయవాసుండును, శ్రీనివాసుండును, వనమాలికావిరాజితుండును, జతుర్భుజవిభ్రాజితుండును, హారకేయూరకటకమకరకుండలకిరీటాది భూషణభూషితుండును, మధురసంభాషితుండును, నై నిఖిలాఘహాఘుకర్శనంబగు నిజదర్శనం బిచ్చి ప్రసన్నుండగు శ్రీవిష్ణుభట్టారకుం గాంచి కోసలరాజన్యతనయ వినయప్రాంజలియై యిట్లని స్తుతియించె.

సీ. బ్రహ్మమవైన నీపదము గానగలేదు
బ్రహ్మాండనాయక బ్రహ్మజనక
కౌస్తుభమణిహార కమలామనోహార
కర్బురజనకాల గానలోల
నీయంద యుదయించి నీయంద వసియించి
నీయంద నశియించు నిఖిలజగము
నీబొజ్జ బ్రహ్మాండనిలయమె కేశవ
నాకు బుట్టుట మాయనటనగాదె
బాలభావంబు జూపుభూపాలపాల
లాలనాలాపముల బాపజాల మడచి
వింతసంసారవార్ధి తరింతు మిపుడు
భక్తజనపోష బుధతోష పరమపురుష.

వ. అని యిట్లు వినుతించు కౌసల్యం గాంచి నిజభక్తమందారుండగు ముకుందదేవుం డోయవ్వా నీవుపూర్వభవంబున నదితివను దేవమాతవు దశరథభూపాలుండు కశ్యపుండను బ్రహ్మయు, మీరలిరువురు పెద్దకాలంబు న న్నుద్దేశించి తద్దయు తపం బుద్దవిడి గావించితిరి గావున మీకిద్దరికి జన్మించితినని యద్దేవీమణియందు పెద్దరికంబుజేసి, గ్రద్దన మాయగావించి శిశుత్వంబు నొందిన పెద్దలగుముద్దియ లరుదెంచి

యద్దేవునకు స్నానాదికృత్యంబు లాచరించిన ననంతరంబ క్రమక్రమం బున భరత లక్ష్మణ శత్రుఘ్ను లుదయించిన వసిష్ఠుం డారాజన్య కుమారులకు జాతకర్మాదిసంస్కారంబులు గావించె, నప్పుడారామ చంద్రు నుయ్యాల నునుచి నారీమణు లిట్లనిరి.

లాలపాట.

లాలిప్రభోద్దామ లాలిప్రకామ। లాలిస్ఫురన్నామ లాలీశ్యనామ
శ్రీలాలితాకార శృంగారపూర । వీరారిసంహార విద్యావిహారా
కారుణ్యసంచార కాలుష్యదూరా । సారాభసత్ఫాల సర్వానుకూల
నీరేజసన్నేత్ర నిగమాళిపాత్ర । ధారాధరోదార ధైర్యప్రచార॥

గీ. లాలి ద్విపదయు పద్యంబు జోలయనగ
నప్పగింతయు మేల్కొల్పు హారతియన
పల్లవియు కీర్తనయు దశరపద్యమనగ
వెలయ బాడిరి పదకొండువిధములలర.

వ. మఱియుకొందఱు వేఁటాంబ్రకు పాడిరప్పుడు,

క. జోజో మంగళనామా, జోజో రవికోటిధామ జోజో రామా
జోజో దైత్యవిరామా, జోజో రఘుసార్వభౌమ జోజో శ్యామా.

వ. అనంతరంబు,

సీ. పొత్తిళ్లలోపల బొదలుచుండెడువేళ
శరదభ్రగతపూర్ణ చంద్రులనగ
ప్రోకాళ్లదలలెత్తి ప్రాకుచుండెడివేళ
దివ్యపన్నగకులాధీశులనగ
మెలెమెల్లనింతింత మెలగుచుండెడివేళ
గోమరొప్పు నేనుగుగున్నలనగఁ
బాలురతోఁగూడి పరువులెత్తెడివేళ
కోడాడుసింగంపుకొదములనగ

వెలయుచుండూరు వీపుల వేణులమర
గనకనాసల వరమౌక్తికంబులొప్ప
జిన్నిలాగుల రశనలు జెన్నుమీఱ
మహితరుచిరాకుమాళులు మూరులనగ.

వ. తదనంతరంబ కౌసల్య రామునింజూచి యిట్లనియె.

సీ. దాయెదాయే నీకు జాయిబోయించెద
గాయజశతకోటికలితరూప
మంజులగతిరత్నమంజీరములు పాద
కంజంబులను ఘల్ఘుఘల్ఘు మనగ
మాణిక్యరశనతో రాణింపుచున్నట్టి
శ్రోణిపై కమనీయవేణి వెలయ
డంబునాసామౌక్తికంబు నటింపుచు
బింబాధరమున పెంపెల్లఁగూయ
బలుకుబలుకున నమృతంబు జిలుక జిలుక
బలుకుగతి ముద్దుబలుకులు గులుకుచుండ
కలికి మొలగంట లొలయుగా దిలకమమర
సరసగుణధామ రఘుకులసార్వభౌమ.

వ. తదనంతరంబ.

సీ. రాముతో సుగుణాభిరాముతో సౌమిత్రి
భరతుతో శత్రుఘ్ను డరసిగలయ
తీవితో బట్టుధట్టీలాగులందున
రశనల చకచకల్ రంగుమీఱ
మకరాలపతకముల్ ధగధగలాడంగ
సొగసైన హారముల్ సొంపుబెంప
శిరమున నవరత్నచిత్రితంబైనట్టి
గురుకిరీటంబులు గోమరుమిగుల

వేదములు నేర్చి మరి ధనుర్వేదములను
జదివి హయగజరథయానసరణిదేలి
రాకుమారులు వెలసి రస్తోకలీల
మారులనగను ధరజాకుమారులనగ.

వ. తదనంతరంబ.

సీ. రవి ధారుణీస్థలి రా గారణంబేమి
యని లోకు లాశ్చర్య మందుచుండ
ననలుండు నరరూపమును దాల్చి వచ్చిన
భంగి యేమని ద్వారపాలు రరయ
ముక్కంటి నరరూపమును దాల్చి వచ్చిన
హేతు వేమని పౌరులెల్లజూడ
నలువ దా మూకుమోములు వీడి వచ్చిన
బనియేమి యని రాజభటులు జూడ
దళితతరదీప్తితో శుచిత్వంబుతో జ
టాపటలితో బ్రభావ వార్ధ్యంబుతోడ
వచ్చె సాకేతపట్టణవరవసిష్ఠ
రాజవీధిని యలగాధిరాజసుతుడు.

వ. ఇట్లు వచ్చి దౌవారికులం గాంచి మారాక మీ రాకమలాప్తకుల తిలకున కెఱింగింపు డనిన వార లతిత్వరితగతిం జని పేరోలగంబున నున్న పఙ్క్తిశతాంగున కమ్మునిబృందారకురా కెఱింగించిన నతండు వశిష్టాది శిష్టజనవిశిష్టుండై సింహద్వారంబుదరి కెదురువచ్చి యజ్జటి లధూర్జటిం గాంచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి తోడ్కొని వచ్చి యత్యున్నతాసనంబున నుపవిష్టుం జేసి ముకుళీకృతకరయుగు లై యిట్లనియె.

సీ. నేడుగదా మాకు నిఖిలభోగంబులు
ప్రాపించె నీరాక దాపసేంద్ర

నేఁడుగదా మాకు నేత్రసాఫల్యంబు
వెలయించె నీరాక వేదమూర్తి
నేఁడుగదా తమోనివహంబు వాసె నీ
సందర్శనంబున జటిలచంద్ర
నేఁడుగదా భూతినిచయంబు నించె నీ
వరదయాగరిమసర్వజ్ఞమూర్తి
నేఁడుగా మాకు జతురాస్యనీనువాణి
వెలయశ్రుతిమఞ్జులత గూర్చె లలితసరణి
వేయునేటికి కళ్యాణవితతు లిపుడ
విబుధశరణసమగ్రమై వెలుఁగఁజేసె.

వ. అని కల్కి నమ్మహీకాంతునిగరంబుల గరంబులంగొని సింహాసనాసీనుంజేసి గాధేయుం డిట్లనియె.

సీ. చండసత్త్వంచరకాండతామిస్రమా
ర్తాండోదయంబు నీదర్శనంబు
ధీమచ్చకోరకస్తోమరాకాసుధా
ధామోదయంబు నీదర్శనంబు
సారనాకాధీశవారమయూరాళి
ధారాధరంబు నీదర్శనంబు
వందారుసేవకబృందార్ధిలోకమం
దారాగమంబు నీదర్శనంబు
ఘోరతరదుష్టపాతకకోటిరాహు
దానవసుదర్శనంబు నీదర్శనంబు
నిన్ను వర్ణింపదరమె వాణీశునకును
సకలగుణధామ రఘుకులసార్వభౌమ.

ఉ. నీభుజవీర్యలక్ష్మి ధరణీధరమానిన శేషకూర్మ మ
త్తేభకులాద్రిసంఘముల కెన్నఁగ విశ్రమవృత్తిగాదె నీ

శోభితదానవైభవము శూరుల కేనుగపాడిగాదె కో
పాభిభరంబు శత్రులకు నాయువునిండుటగాదె రాఘవా.

వ అని యిట్లు బల్కుచున్న మునీశ్వరునకు జనేశ్వరుం డిట్లనియె.

సీ. అలత్రిశంకుతోన్మౌను నభినవస్వర్గాఖ్య
నిలయంబునం దుంచు నిర్మలుడవు
నవపరమేష్ఠివి భువిలోన నీవంటి
వరమతి మావంటివారియిళ్ళ
కరుగుదెంచుట మంగళాస్పద మగుచుండు
గావున నీనియోగంబు ప్రేమ
వినగోరి కర్ణముల్ వేడుకబడుచుండు
వినుపింపు నిర్మలవేదమూర్తి
చనదనక నిచ్చెదను మునిసార్వభౌమ
యనగ నత డిట్టులనియె నోయవనినాథ
సవముసేయంగ రాక్షససమితి వచ్చి
విఘ్నమొనరింతు రంట బర్వవేళలందు.

వ. కావున,

క. రాకాసుల దునుమాగా, రాకాశశివదనుడైన రాముని ధరణీ
పాకారి బంపు నాతో, నీకాకుత్థ్సాఖ్యజగము నిండివెలుంగన్.

వ. అనిన విని యుల్లంబు ఝల్లని పల్లటిల్ల, సొమ్మసిల్లుచు మెల్లన దెల్విం
గాంచి భూవల్లభుండు మునివల్లభున కిట్లనియె.

క. బాలుడకృతాస్త్రుడెప్పుడు, నాలంబులదెరగు లెఱుగ డంపగజాలం
బాలింపుము దగనామన, వాలింపుము మౌనిచంద్రయధిగుణసాంద్రా.

క. నాగాశ్వరథచయంబుల, బాగుగ గొనివచ్చి దైత్యపజ్ఝ్కులనెల్లన్
వేగంబ చనిమెదను వడి, యోగాథేయా తపోభియోగాథేయా.

వ. అనిన విని మునిపల్లభుం డిట్లనియె.

క. కొంజక నాతో బంపుము, రంజనతో వజ్రపంజరమ్మై మాగాతుం
మంజులగతి నీసుతు నృప, కుంజర కళ్యాణములను గూర్చెద వెనుకన్.

క. మేధ్యార్క వంశభవుడ వ, యోధ్యాపురనాయకుండ పురుకీర్తివి హా
గాధ్యాత్మజుతో నిట్టుల, మిధ్యావాదంబు జేసి మే లొందెదవే.

వ. అని పల్కి యాజ్యాహుతిమండు జాతవేదు ననుకరింపుచు కోపోద్దీపి తుండగుచున్న మునీంద్రునిం గాంచి వసిష్ఠమునీంద్రుండు రహస్యంబున జనవల్లభున కిట్లనియె. నీత డిట్టివ్యాజంబున నీకు మేలుగూర్ప వచ్చె, గావున రాఘవు బంపుమనిన దశరథుండు రామసౌమిత్రుల బిలువనంపె నంత.

సీ. మంజులగతిరత్నమంజీరములుపాద
కంజ బులను ఘల్లుఘల్లుమనగ
బట్టుదట్టీలాగుపైనున్నకటిసూత్ర
కనకకాంతి జిగాజిగాలనంగ
మండితనవరత్నకుండలోపేతమా
గండదీప్తి ధగాధగాలనంగ
మోమునందుబులాకీము త్తియంబుగరంబు
మేలిడాలుతళాతళాలనంగ
శిరమునందు కిరీటంబు జెన్నుమిగుల
వేణికుచ్చులు బిరుదుల వెలయుచుండ
గాకపక్షవిలాసంబు గ్రందుకొనగ
రాము డరుదెంచె సహజాభిరాముడగుచు.

వ. ఇట్లువచ్చిన రామలక్ష్మణుల గాఢాలింగనంబుజేసి విశ్వామిత్రునకర్పించిన వారు తల్లులకంతయు నెఱింగించి యపుడు.

శా. క్రూరాభీలకృపాణులై ప్రవిలసద్గోధాంగుళీత్రాణులై
సారోద్రేకధురీణులై కవచయుక్ప్రంచచ్ఛిరస్త్రాణులై

స్ఫారాంసస్థితతూణులై దృఢకన చ్చాపోరుదోస్థానులై
జేర న్వచ్చినరామలక్ష్మణుల గాంచెన్ మౌని సంప్రీతితోన్.

వ. ఇట్లు వచ్చిన రామలక్ష్మణుల దశరథునందను మునీంద్రున కర్పించిన నమ్మునిచంద్రుండు వారలం దోడ్కొని భాగీరథీతీరంబున కరిగి యచ్చట,

గీ. బలయనంగను మరి యతిబల యనంగ
జెలగువిద్యల నమ్మౌనిశేఖరుండు
వెలయనిచ్చె సమంత్రకవిధులతోడ
రాఘవులకు శరామోఘలాఘవులకు.

వ. తదనంతరంబ,

ఉ. తాటక ఘోరఘోరదురితాటక యానజితోగ్రవేగవ ద్ఘోటక
సత్కపాలయుతకుండలనాటక నాంత్రమేఖలాకేటక
భూరిసారజితఖేటక శాణినికృత్తభూమిభృ త్కూటక
నేత్రకూపయుగఘోరలలాటిక గాంచి రయ్యెడన్.

వ. ఇట్లు గాంచి రామసౌమిత్రులు ధనువు లెక్కిడి గుణంబులు సారింపుచున్న నమ్మునివరుండు రాఘవులం జూచి వేగంబ దీని నేయు మేయు మనిన నామిత్రసులవర్ధనుండు విశ్వామిత్రుతో నిట్లనియె.

క. మునివర భామిని జంపుట, కనిశము మది బెగడు జేతులాడవు గానన్
ఘనకర్ణనాసికంబులు, దునిమి విడతుననినరాముతో మునియనియెన్.

గీ. కోటివిప్రహత్య లోటమి లేకుండ, జేసినట్టి దీని డాసి పట్టి
జంపువాని కెపుడు శతవాజిమేధస,త్ఫలము లొదవు రామభద్రవింటె.

వ. అనుసమయంబున రామునితో లక్ష్మణుం డిట్లనియె.

క. క్షోణీనాయక విను ముని, వాణులె శాస్త్రములు గొంకవలువదు బాణ
శ్రేణులచేతను విగత, ప్రాణనుగా జేయు దీని బాపంబనకన్.

వ. అనునట్టిసమయంబున నాయక్షి పర్వతపాషాణపాదపవర్షంబు గురియుచు విలయవలాహకంబువోలె, బరతెంచుచున్నం గాంచి లక్ష్మ

ఱుండు రెండర్ధచంద్రబాణంబులేసి తత్కర్ణనాసాచ్ఛేదంబు జేసిన రాఘవుండును రెండుమార్గణంబుల దద్బాహుయుగంబు దునిమి తోడన నొకదివ్యాస్త్రంబున వక్షంబు దూయనేయు నది విలయస్తనిత నిర్ఘోషపరుషంబుగా వాపోవుచు, నేలంగూలె నంత,

క. సుమనోవర్షము, గురిసెను సుమనోవర్గంబు మొరసె సుమనోభేరుల్
సుమనోనాయకు డప్పుడు, సుమనోవరుడై నమాంసోమునికనియెన్.

వ. మునీంద్రా రామచంద్రునకు సమస్తశస్త్రాస్త్రంబులొసంగుమని చని యె నంత మునివరుండును రామచంద్రునకు శస్త్రాస్త్రంబు లిచ్చి స్వాశ్రమంబునకుం జని మునులం గూర్చుకొని జన్నంబుసేయు నంత.

శా. మారీచుండు సుబాహుకున్ గడగుచున్ మానీంద్రసత్కోటిపై
మారీమూర్తులభంగి డాసి మిగులన్ మాంసాస్థులం రువ్వుచున్
దారామార్గమునందునుండి ఘనదైత్యానికిన్ యుక్తులై
భారక్ష్మాధరశృంగసంఘములచే బాధింపగా జొచ్చినన్.

క. ఆఋషిగణములు గట్టిన, చీరలు వీడంగ మేన చెమ్మట లొదవన్
శారీరకంప మడరగ, నారాముని శరణుజొచ్చి రతిభీషితులై.

వ. అప్పు డారాఘవుండు వారలం వెరవకుండుమని కోదండంబు సజ్యంబుచేసి వహ్నికాండంబు నారి నమర్చి,

క. సాహసమునబడవైచె సు, బాహుంజితమేఘవాహు బన్నగకులరా
డ్బాహున్ సంతతసమిను, త్సాహున్ బుధచంద్రరాహు క్ష్మాధరదేహున్.

వ. మఱియు నారఘుపుంగవుండు,

క. మేటిమారీచు నంబుధి, దాటి స్థలిబడగవైచె వైష్ణవచక్రో
ద్ధాటీశతకోటీశత, కోటీసారప్రచారఘోరేషుగతిన్.

క. మిత్రానందకరుండు సు, మిత్రానందనుడు వేగ మిగిలిన దేవా
మిత్రావళి దునుమాడెను, మిత్రాంశుశరాళిచే సమిద్ధబలుండై.

వ. ఇట్లు విజయంబు నొంది వెలుంగుచున్న మిత్రకులసంభవులం గాంచి సంతోషించి కృతావభృథుండై యమ్మరునాడు రాఘవులంగనుంగొని

గీ. జనకరాజర్షి జేసెడు జన్నమొకటి
మనము జూడంగవలయు నోమనుజనాథ!
మఱియు రఘురామ! ఖండేందుమౌళిచాప
మున్నదచ్చట జూడ సమున్నతముగ.

క. ఆధను వెక్కిడియెను ధర,ణీధవులకు దనసుగూతు నిచ్చెదనని యా
భూధవుడు ప్రతినసేయ న,రాధిపులరుదెంచి చూచి యలబలమొప్పన్.

క. కొందఱు గదలపజాలక, గొందఱు మరియెత్తలేక కొనయముకోటిం
జెందింపలేక నరపతి,నందనులటుజనిరి లజ్జనమ్రాననులై.

వ. కావున నీవు నమ్మహాధనువు జూడవలయు మనమచ్చటికి బోవలయు
రమ్మని రామలక్ష్మణులం దోడ్కొని కొంతదవ్వరుగ నక్కడ సకల
జంతుజాలశూన్యంబగు నొక్క పుణ్యాశ్రమంబు జూచి రామచంద్రుం
డమ్మునివర్యున కిట్లనియె.

సీ. మల్లికాజాతీమతల్లికామాలతీ
వల్లికామాధవీ వేల్లితంబు
సురసారఖర్జూరవరసాలమోచామ
ధురసాలకృతమాలవిరచితంబు
దాళీలసన్నారికేళీతమాలకం
కేళీబృహత్ఫలాకీలితంబు
సారామ్లపనసమందారామ్రతరుకోవి
దారానసాశ్వత్థపూరితంబు
బాలబదరతమాలతక్కోలబిల్వ
జంబుజంబీరవకుళకదంబనింబ
ఘనము నాశ్రమవనము పావనము సద్భ
వనమదెవ్వరిదో యిది మునివరేణ్య

వ. అనిన విని కౌశికుం డిట్లను వినుము రామచంద్రా నీవెఱుంగనది
యేమి యున్నది యైనను విన్నవించెద. గౌతముడను బ్రహ్మర్షి ధాత

కూతు రహల్యయనునది దనకు ధర్మపత్నియై యుండ నొయ్యన నీ యాశ్రమంబున దపంబుజేయు టెఱింగి మహేంద్రుండు నమ్మునివేష ధారియై యర్ధరాత్రంబున వచ్చి యయహ్యాపామణియందు దోషంబు నాపాదించిన నమ్మునీషి యావేషం గాంచి వృషుని నిర్వృషణునిగా శపియించి మఱియు నయహ్యాపామణిని బాషాణ మగుమని శాపం బిచ్చి తాపంబున దాపసోత్తముఁడు హిమవంతంబునకుం జనియె నా రీతి నానాతి రాతిరూపంబు దాల్చియున్నయది జూతుగాక యని యమ్ముని భూతేశు నంబుజనయను యున్నయెడ కన్నలినప్రసన్న నయనుం దోడ్కొని చని తత్పాదారవిందరజోబృందం బాసుందరి దాకంజేసిన,

శా. పాషాణంబు జలింపుచుం గఠినతాభావంబు జాలించి దా
యోపాహూకము దాల్చి నెమ్మనములో నొక్కింత లజ్జింపుచున్
భూపాశ్రేణి దెమల్చి వల్కలము గొప్పం జక్కగా దిద్దుచున్
యోషిద్రత్నము రాముతోడ వినయం బొప్పారగా నిట్లనున్.

సీ. దండంబు ధారుణీమండ లేశ్వరునకు
దండంబు భూతలాఖండలునకు
దండంబు చండకోదండపండితునకు
దండంబు గాండపిచండిలునకు
దండంబు పుండరీకాక్షమండితునకు
దండంబు వరవాహనాండజునకు
దండంబు పాండురకుండలిశాయికి
దండంబు మఃశిలసత్కుండలునకు
దండ ముద్దండకాండప్రకాండకునకు
ననుచు దండంబు లిడియెద ననఘ నీకు
గరుణ నను బ్రోవవచ్చితె పరమపురుష
ధన్యనైతిని వినుము నాతండ్రి తండ్రి.

వ. అని మఱియును,

శా. పారావారకృతావమాన కుపితప్రాగ్వేశ్మభూభారతీ
దారాందోర్ధ్వపునఃప్రయాతఖసరిత్తన్వీమణీబుద్ధికృ
త్సారాస్యాంబుజపూరితోద్యమి తభాస్వద్వార్ధినీరావళీ
స్ఫారద్రాఘువరూప రాఘవ నృపస్వామిన్ భజే హమ్మనున్.

శా. అంభోరాసినిమంధన ప్రబలదేవాధీశదైత్యావళీ
గంభీరాధికసింహనాదగళదాకాశస్ఫురత్కల్పిత
స్తంభానాకసముచ్ఛ్రితప్రచురమంథానాచలాధస్థలీ
సంభూతాతతకూర్మనాయక రఘుస్వామిన్ భజేహమ్మనున్.

మ. కనకాక్షాసురనాయకాగ్రణిభుజాగర్వాపనోదక్రియా
జనితామోదవసుంధరాబ్జనయనా చామీకరాకారమం
డనసౌధాయితవక్త్రపద్మభవదంష్ట్రాభూరిశోభాధికా
వనిదారాతతరూప రాఘవ సురస్వామి న్భజే హమ్మనున్.

శా. స్తంభప్రోద్భవనారసింహతనుజచ్ఛాయాధరస్ఫాటిక
స్తంభాళీపరిదృశ్యమానతదనంతాకారపీక్షాప్రతి
స్తంభోత్పన్ననృసింహబుద్ధిపరితస్సంక్రాంతనేత్రాంత వి
స్రంభారాతివిభేద మాధవ రఘుస్వామి న్భజే హమ్మనున్.

శా. త్రైలోక్యస్థవదాన్యమౌళిబలిదైత్యాధీశసత్కీర్తికా
లీలావత్యమరేశచంద్రమణిపాళీనిర్మితాపుష్కరో
త్తాలస్థూలవిభూషణాంచితమహాసౌధాయితాత్మప్రభా
జాలాధారత్రివిక్రమ క్రమ రఘుస్వామి న్భజే హమ్మనున్.

శా. సాగోదారకుఠారకృత్తధరణీశవ్రాతభాస్వచ్ఛిరో
వారప్రోల్లసదిష్టకారచితగీర్వాణాలయామోదగ్రశో
భారమ్యాధికసౌధసీమకృతసోపానాధ్వసంప్రేషిత
స్ఫారత్రైపితృకవర్గ భార్గవ రఘుస్వామి న్భజే హమ్మనున్.

శా. ధారుణ్యంతిమకాలభూతహరణద్రాఘిష్ఠవాంఛోల్లస
న్మారీమూర్తివిరాజమానవిచరన్మాద్యత్స్ఫురత్తాటకా
నారీపక్షవిభేదనోత్కటకళానైపుణ్యగణ్యాత్మదో
స్సారోదారకలంబసంచయ రఘుస్వామి న్నభేహమ్మనున్.

వ మఱియును,

క. నీదయ శాపము వాసెను, నీదయచే సకలపాప నిచయము వాసెన్
నీదర్శనంబు గలిగెను, శ్రీదయితాచిత్తలోల శ్రితజనపాలా.

క. దశకంఠామల గూల్పగ, దశరథ రాముడ వసంగ దనరితివి మహా
దశరూపధారి నిన్నున్, వశమగునే తెలసి పొగడ వరవర్ణినికిన్.

వ. అని విన్నవించి వలగొని శెలవుకొని పతినివాసంబున కరిగె ననంతరంబ
రామలక్ష్మణవిశ్వామిత్రులు కతిపయప్రయాణంబుల జనకపురంబున
కరిగి రాజవీధిం జనుచున్నసమయంబున దత్పురజనంబులు గాంచి
యిట్లనిరి.

సీ. కొమ్మరో యీబాలనెమ్మోముఁ జూచిగన్న
బటుమహారాజని బలుకజెల్లు
సుందరి యీమేటి మందయానముగన్న
సార్వభౌమవిలాససరణిదోచు
గజయాన వీనిభుజములసౌరెన్న
భోగిచూడామణి స్ఫూర్తిమెలయు
కుటిలకుంతలవీనికటిగౌరవముజూడ
భూచక్రకాంతవిభూతినెరపు
తరుణి యీతేనికన్న సౌందర్యమెన్న
శ్రీవరాకృతివైభవసిద్ధిజేయు
నింతియవ్వతెగనియనో యిమ్మహాత్ము
నేచెలియ వీని బెండ్లాడనోచినదియొ.

సీ. సంపూర్ణశశివిభాసదనంబు వదనంబు
శ్రీమదిందందిరశ్రేణి వేణి
ధరణీష్టకలితసౌందర్యరోధిశిరోధి
వరగంధఫలికళావాస నాస
కమలచారుప్రభాకరములు గరములు
నవజలావర్తసనాభి నాభి
పద్మరంజితకళాభరణముల్ చరణముల్
రాత్రినాయకుజవరాళ్లు గోళ్ళు
మవ్వ మిగులొత్త వెన్నెలనవ్వు నవ్వు
గాన యీరూపవంతుండు కంతుడో వ
సంతుడో లేక శ్రీరమాకాంతు డగునో
గాక యీరూపవైభవగరిమ గలదె.

సీ. వేషాంతరుండైన విష్ణుడే గాకున్న
మనుజుల కీలాటిమహిమ గలదె
రూపాంతరుండైన రుద్రుడే గాకున్న
నరమాత్రులకు నిట్టి గరిమ గలదె
స్థానాంతరుండైన భానుడే గాకున్న
జనులకు నీవిభాసరణి గలదె
కాయాంతరుండైన కాముడే గాకున్న
నితరుల కీశుభాకృతియు గలదె
భూమిగతుడైన చంద్రుడే బోటి యితడు
గాకయుండిన నీకళాఖ్యాతి గలదె
యహహా యీతని వర్ణింప నలవియగునె
భవునకైనను నాళీకభవునకైన.

ఉ. ఛత్రము లేల రావు గజసంఘము లేలొకొ రావు సింధు స
త్పత్రము లేల రావు రథపంక్తు లదేమొకొ రావు వీరలి

ధాత్రిని పాదచారులయి తద్దయు రా గతమేమొ జూడగా
జిత్రమటంచు జూచిరి విశిష్టజనంబులు నెమ్మి నవ్వుచున్.

క. వనితామణు లప్పుడు శ్రీ, వనితావల్లభుని వేగవర్ణించి కడుం
జనితాదరమున నీరా, జనతాంబూలాదిపూజ సల్పిరి భక్తిన్.

వ. అప్పుడు షడాస్యగజాస్యులకు దోడ్తోడ్తని చను సర్వేశ్వరుం బోలి
కొంతద వ్వరిగి యమ్మునివల్లభుండు,

చ. చనిచని కాంచె రాజసుత సంయుతు డామునిశేఖరుండు స
న్మునిజనహూయమానగురుమోదసమాగతఖేటమావల
ద్ఘనతరభీమ ధూమపటికంపితభానురథాగ్రఘోటమున్
జనకుని యజ్ఞవాటమును సామవిగాయన విప్రకూటమున్.

వ. ఇట్లు గాంచి దరియంజనిన జనకుండు యెదురుగా వచ్చి వారలం
బూజించి హరిహరులమాడ్కి వెలుంగు నీబాలు రెవ్వరనిన నతం
డిట్లనియె.

శా. ఆ రాత్రించరవైరివాసరధమార్గాంచత్ప్రభా భాసురుం
డారత్నాకరధారుణీవలయరక్షాదక్షదోర్విక్రముం
డారాజీవభవాదిలోకతతనీహారేందుతారావనీ
హారభ్రాజితకీర్తియుక్తా దశరథుం డేపారు భూపాలుడై.

క. ఆరాజకుమారులు సుకుమారులు బలశక్తిజితకుమారులు లీలా
మారులు సంతతసుగుణోదారులు ఖలరాత్రిచరవిదారులు వీరల్.

వ. మఱియు కొండఱు ముకుందాంశభవు లంచరని చెప్పి,

క. నీభవనంబున వెలిగెడి, యాభవుచాపంబు జూడ నతికుతుకముతో
బ్రాభవ మలరగ వచ్చిరి, వే భవనురుదర్శనంబు వెసజేయుటకై.

వ. అనిన నజ్జనకుం డిట్లనియె.

సీ. పద్మాంచిత్తుండన్న భంగి దెల్పకమున్న
వాలారుగన్నుల లీల దెల్పె

జక్రశోభితుడన్న నరణి దెల్పకమున్న
గటివిపులాభోగగరిమ దెల్పె
శేమరంజితుడన్న చెలువు దెల్పకమున్న
భుజములప్రథితోరుభూతి దెలిపె
రాజపూజితుడన్న రహిని దెల్పకమున్న
మోముసుందరకళామూర్తిదెలెపె
భానుకులశోభియనుచును బలుకకుండ
మున్నె దెల్పెను తనుకాంతివన్నె వీని
దర్శనంబయ్యె నా తొల్లితపము పండె
నవగుణాధేయ! గాధేయ! నతవిధేయ!

వ. అని విన్నవించి మఱియు నిట్లను పినాకధనువు నొక్కసమయంబున నాసుత నిత్యపూతయగు సీత గృహాంతరంబున నునిచె గాన దద్ధను వెక్కిడువారికి దారక నిచ్చెదనని ప్రతినజేసినవాడ దన్నిమిత్తంబుగా ననేకరాజకుమారు లరుదెంచి,

క. కొందఱు జూడంజాలక, కొందఱు గదలింపలేక కొందఱు గొనయం బందింపలేక భూభృన్నం, దను లటు జనిరి లజ్జనమ్రాననులై.

వ. కావున నిదియొకసంశయంబు బాధింపుచున్నయది యనిన నవ్వి యవ్విశ్వామిత్రుం డిట్లను, బాహుబలపండితుండగు చండకరకులమువాడనుండు నీసంశయంబు దీర్పు ధనువు జూపింపుమని నతంను బంచిన.

క. సల్లలితబలమదోద్ధత, మల్లురు పదివేలమంది మాహేశ్వరమా విల్లుగొనిరాగ గని ముని,వల్లభు డిట్లనియె సూర్యవంశ్యునితోడన్.

వ. రఘుకులసార్వభౌమా! రామా యీచాపంబు జూడుమనిన,

ఉ. కొంకక పంకజాభవటకోటిని వెన్కకు వీగగట్టి స
త్కంకణముల్ ప్రకోష్ఠమున గట్టిగ బెట్టి గచంబుదిద్ది వే
కింకిణికోటికోటిపరికీలితమై వెలుగొందుచున్న యా
శంకరుచాపమెత్తె గరిశాబక మిక్షువునెత్తుకై వడిన్.

వ. అప్పుడు,

సీ. చాపవంశము రఘుస్వామివంచ గకుత్థ్స
భూపవంశము గీర్తిఁ బొదలుచుండఁ
సుగుణంబుకోటిపైఁ సొంపొందఁగూర్చిన
సుగుణంబు కోటిపైఁ సొంపుగూర్చ
గాండాసనంబు నాకర్షింపరావంబు
గాండాసనంబెల్ల గలయఁబరచె
ధర్మవర్ధనవృత్తి దారసిల్లఁగ జాల
ధర్మవర్ధనమయ్యె ధరణిలోన
రామచంద్రుని బాహుసారమునఁ గెంపు
సాటిలేదని జగముల జాటిచెప్పు
భూరిభేరీవిరావంబుఁ బోల్కెఁ జాప
భగ్నని ర్గతసంరావపటిమ దోఁచె.

వ. ఇట్లు భగ్నంబైన చాపంబు బోలంగనుంగొని జనకవిశ్వామిత్రశతానందాదు లాశ్చర్యంబు జెందిరంత జనకమంత్రు లేగి దేవులకంతయు దెల్పి సీతాదేవిని భూమికానిచయంబుమాటున జతురంతయానంబున దోడ్కొనివచ్చి రప్పు డప్పంకజాక్షి యానంబుడిగ్గి రంగదభంగగంగాతరంగంబుల కెదురీదు సితాంగపోతంబురీతి దొంతరలగు సిగ్గునిగ్గుమొత్తంబుల నుత్తరింపుచు సురాసురకరాకర్షమాణమందరధరాధరమంథానసవ్యాపసవ్యభ్రమణజనితమహార్ణవమాలికలం గడచి వచ్చు శ్రీమహాలక్ష్మి ననుకరింపుచు శరదభ్రశుభ్రకాదంబినీసంఘాతంబులనడుమ వెలువడు శరచ్చంద్రరేఖాకారంబు ననుసరింపుచు క్రమక్రమంబున మందయానసుందర లలితపదారవిందయగుచు వచ్చుచున్న సీతం గాంచి రాజకుమారు లిట్లని వితర్కించిరప్పుడు,

సీ. శీతకరాంతరశ్రీమూర్తియే కాక
కువలయాహ్లాదంబు గూర్పగలదె

తారకాళీసమాహారశోభయెగాక
లాలితానంతైక లీలగలదె
రాజీవశోభాభిరామలక్ష్మియెగాక
సరసుల కుత్ప్రీతి సలుపగలదె
సౌదామినీలతాసంఘదీప్తియెగాక
ఘనమనోహరవృత్తి గాంచగలదె
నెమ్మి నీయింతి బంగారుబొమ్మగాక
యరయ మిక్కిలి వన్నెల నెరపగలదె
యహహ యీయింతిసొగసు మోహములదొంతి
గమనజితదంతి మరుని చెంగల్వబంతి.

చ. కృశగతి మాటిమాటికిని గీలితమానసి హా సపద్ధతిన్
శశిదశమాచరించి సతి సమ్ముఖమయ్యె దదంగనాళిత
ద్వశమతివృత్తి దన్నఖరవైఖరి గొల్వగవచ్చె తారకే
ట్కుశల మెఱుంగవచ్చు పృథుకుండనమౌక్తికమొప్ప ముక్కునన్.

మ. సతి లావణ్యసుధాబ్ధి గానియెడ జంచన్నేత్రమీనంబు లా
తతరంగత్కుచచక్రవాకములు నిత్యంబావళీవీచులు
ద్గతజంఘామకరంబులున్ బ్రపదభాగప్రౌఢకూర్మంబు లూ
ర్జితపాదస్తనఖాళిమౌక్తికమణుల్ జెన్నొందగా శక్యమే.

వ. అని వినుతించుసమయంబున జనకరాజతనయ రామచంద్రుని గళం
బున మంగళకుసుమదామంబు వైచి వరించి చనియె ననంతరం
బాజనవల్లభుడు విశ్వామిత్రశతానందులతో నిట్లనియె.

గీ. భానువంశ్యులతోడ సంబంధమంద
గంటి నిలలోన సత్కీర్తిమంటిగాన
రామునకు సీత లక్ష్మణరాజవరున
కూర్మిళాకన్య నిచ్చెద పేర్మితోడ.

గీ. మఱియు నా యనుజతనుజుల మాండవియన
లలితశ్రుతకీర్తి నాగను వెలయుచున్న
వారలను భరతశత్రుఘ్న శూరవరుల
కిచ్చెదనటంచు గడుప్రియ మెసగబలికె.

వ. అనంతరం బా దశరథుండు జనకమంత్రివరాహూతుండై జనకపురం
బున కరుదెంచి కుమారసహితుండై పెండ్లికి దరలివచ్చెనంత,

సీ. శారదోచ్ఛ్రితనవనీరదావళిభంగి
పటవితానవితానపటిమ దనర
గలితసంధ్యాకాలకర్బురాంబరమట్ల
జారుకుథాస్తీర్ణసభ జెలంగ
భువిపైకి వచ్చినదివిజకాంతలనంగ
వారవిలాసినీవార మొప్ప
ధరణిజూడగవచ్చు తారకావళిలీల
గరదీపికాసముత్కరము మెరయ
మఱి సురాసురమథితభాసురపయోధి
రావమనగను సద్వాద్యరవము లొలయ
బుడమిఱేడు యథావిధిపూర్వకముగ
వెలయ గళ్యాణవిధులు గావించెనపుడు.

సీ. రమ్యపయోరాశిరంగదుత్తుంగత
రంగముల్ బోలు తురంగచయము
బలిమిగా రెక్కలుగల నాటికొండల
తండముల్ బోలు వేదండతతులు
శారదసముదగ్రసారనీరదమున
బృందంబుబోలిన స్యందనములు
వెలివెల్లివిరిసిన బలుపాలవెల్లి నా
బొండుపట్టాంబరభటగణంబు

నడువ చుక్కలు భూమిపై గడలుకొనిన
భంగి కరదీపికాకదంబాబు జెలగ
మేటివారవిలాసినీకోటు లమర
దశరథుడు పెండ్లికవ్వేళ దరలివచ్చె.

శా. తారాజువ్వ లవాయిగొట్టములగాదల్ జిమ్ముబుడ్డుల్ గడున్
దారామార్గము వెంటనంటను శతఘ్నుల్ బల్లుపాకు ల్మహా
దారారావములం జెలంగగను విస్తారంబులై జక్రముల్
బారంబారనపారబాణముల శోభల్మీర నింపారగన్.

సీ. ఢక్కలు మురజులు ఢంకాలు కాహళు
ల్బూరలు చాల్ దండబూర లొలయ
డుడుములు డప్పులు దోరంబు రుంజలు
బాజాలొసనాయిాల బారులొలయ
తాషాలు మరపలు దగు రామడోళ్లును
ఢోళ్లును తమ్మటల్ గ్రేళ్లుదాట
భేరులగముల రబ్బిబాజలునుమడ్డు
డిండిమంబులచాలు గందుమిగుల
గంచుమద్దెళ్ళు మరి వీరకాహళులును
మొఱయ మందరమథితభాసురపయోధి
రావమును మించి మిక్కిలి కేవమొఱయ
దరలివచ్చెను పెండ్లికి ధరణివిభుడు.

వ. ఇట్లు వచ్చి వజ్రవైడూర్యగోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య సోపాన చిత్రితంబును, గాచఘటపటుముకుర ఘటపటలదీపమణిదీప శాతకుంభ స్తంభ విభ్రాజమానంబును, వసిష్ఠవామదేవ విశ్వామిత్ర శతానంద గౌతమాత్రి భరద్వాజకణ్వకశ్యప వాలఖిల్య సనకసనందన నారదపర్వతతుంబురుప్రముఖమహామునిమండలమండితంబును, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాదిసర్వజనవిరాజితంబును, భ

ష్పన్న దేశాధీశ్వరమహారాజకుమారశోభితంబును, చతుస్తంభవిరాజమానంబును నగు కళ్యాణమంటపంబున, రామలక్ష్మణభరతశత్రుఘ్నుల కృతమంగళ స్నానాలంకృతుల ధౌతపట్టాంబరశోభితుల మంగళపీఠికోపవిష్టులన్ జేసి వసిష్ఠాదిపురోహితులు యథావిధి కళ్యాణకృత్యంబులు సలుపుచున్న సమయంబున.

గీ. మహిత కాంచనకళ్యాణమంటపమున
రాముపదములు గడగి యారాజమౌళి
దక్షహారు డెద్దిశిరమున దాల్చినాడో
యట్టిపాదోదకము శిరసావహించె.

వ. మఱియును.

శా. శ్రీరామాయ పరాత్పరాయ కమలాశ్లిష్టాయ విశ్వాత్మనే
వీరాయ ప్రకటప్రతాపాయ నళినే విష్ణుస్వరూపాయ తే
ధారుణ్యాత్మభవాం మదగ్రతనయాం దాస్యామి యంచుఁబరమో
ధారాపూర్వముగాగనిచ్చె నపుడాధాత్రీశు డజ్ఞానకిన్.

వ. అప్పుడు,

క. మంగళసూత్రము గట్టెను, మంగళదేవతయనంగ మహిజెలగిన సీ
తాంగనకంఠంబున రఘు, పుంగవుడుప్పొంగి బంధుపుంజముపొగడన్.

గీ. మంగళం మంగళంబంచు మంగళాష్ట
కములు విబుధులు దీవింప గదలి పేర
టాండ్రు మంగళహారతు లలరనివ్వ
విప్రు లాశీర్వదింపుచు వెలసి రపుడ.

వ. ఇట్లు భరత లక్ష్మణ శత్రుఘ్నులకు మాండవ్యూర్మిళాశ్రుతకీర్తులను యథాక్రమంబుగా వివాహంబుచేసి రనంతరంబ వసిష్ఠ విశ్వామిత్రు లాశీర్వదించిరి.

శ్లో. భవతు శుభము భాభ్యాం భవ్యలక్ష్మీయుతాభ్యాం
కనకనవపటాభ్యాం కజ్జలాలంకృతిభ్యాం

పుష్పితతనునిశాభ్యాం పుష్పమాలాన్వితాభ్యాం
జగదవనజనిభ్యాం జానకీరాఘవాభ్యాం.
పరివృతవిబుధాభ్యాం భాస్వదేకాసనాభ్యాం
రహసిగుణమణిభ్యాం రాజదాలోకనాభ్యాం
రతిమదనసమాభ్యాం రమ్యభూషాంచితాభ్యాం
జగదవనజనిభ్యాం జానకీరాఘవాభ్యాం.

వ. అనంతరంబ జనకరాజర్షి యథోచితంబుగా సీతాకళ్యాణంబు జరపి వెండియు సకన్యావరులను దివ్యాంబరాభరణ దాసదాసీనివహాశ్వ రథ పదాతికనకమణికిరణంబు లరణంబులిచ్చి దశరథాదుల యథోచితంబుగా బహూకరించి వీడ్కొలిపిన వార లరుగుచుండ మార్గ మధ్యం బున,

సీ. ప్రళయకాలాభీలపావకసంభవ
జ్వాలికామాలికాభీల మగుచు
సంవర్తవర్తిత చండచండద్యుతి
కోటికోటిప్రభాఘోర మగుచు
త్రిపురసంహారణప్రకటితభూతేశ్వర
పరుషఫాలానలప్రచుర మగుచు
బలిబంధనోద్ధతప్రబలత్రివిక్రమ
విక్రమచక్రమావిద్ధ మగుచు
దనదు తేజంబుదీర్ణమై ధరణిమెఱయ
భుజశిలాస్తంభగుంభిత భూరిగుణవి
ఘాతసంజాత కిణగణజ్ఞాతభూమి
చక్రజయగామి భృగుకులస్వామి వచ్చె.

గీ. అపుడు దశరథుండు విపులభక్తిజెలంగ
నర్ఘ్యపాద్యసమితి నాదరింప

గొనగ భార్గవుండు జని కాంచెర ఘురాము
సకలసుగుణధాము సార్వభౌము.

వ. అపుడు,

క. రాము డెదు రేగి భార్గవ, రాముం బూజించి వినయరతి నిట్లనియెన్
నీమహిమ జెప్పశక్యమె, రామ! గుణధామ! దుష్టరాజవిరామా.

గీ. ముందు వేదత్రయంబు నెమ్మోమునందు
వెనుక కోదండకాండముల్ వెలయబూని
శాపగతినైన గాకున్న శరమునైన
పగతురనుగూల్చు నీశక్తి బొగడ దరమె.

వ. అనినవిని,

ఉ. ఈనయగౌరవుంబలుకు లీ నతులం గనుమాత్ర సద్దయం
బూనెడువాడుగాడు రఘుపుంగవ! ఘోరకుఠారకృత్తభూ
జానిశిరస్సమూహదివిజస్థలభూస్థలకల్పితోరుసా
పానపరంపరోర్ధ్వగతిపైతృకవర్గుడు భార్గవుం డిలన్.

క. బాణబాణాసనంబులు, పాణులగొను హైహయోరుబాహాళి పా
షాణస్థూలాశనియై, రాణించుకుఠార మిదె కరంబును మెరసెన్.

వ. అనిన రాఘవుం డిట్లనియె.

క. బ్రహ్మాండము వగులగనీ, బ్రహ్మాదులు దలలు క్రిందబడిపోవగనీ
బ్రహ్మాగ్రగణ్యరఘువులు, బ్రాహ్మణుపై శస్త్రమెత్తి భయముదరమా.

వ. అనిన విని భార్గవరాముం డిట్లనియె.

గీ. కౌశికవసిష్ఠ వైభాండకాదులట్లు
భవ్యగతి స్వస్తివాచకబ్రాహ్మణుండె
భార్గవుం డే కవింశతిప్రచురరాజ
వీరసారంగమృగయావిశారదుండు.

శా. వీరుద్రుండు కుమారుకంఠెను ప్రియుం బేపారగా బెంచి స
త్కారోద్ధారధనుఃకళాకౌశలున్ గావించి మన్నించెనో

యారాజీవకరోగ్రచాపలతికాహానిస్థితిన్ వింటి మ
ద్దోరాభీలకుఠారసారత వృథాస్థూలత్వ మందె న్భళీ.

వ. అనిన రాఘవుం డిట్లనియె.

క. నవబుద్ధిచేత నల శాం, భవచాపము నెక్కు బెట్టబడుమాత్రనె సం
భవమయ్యె నిట్టియది భా, ర్గవ! నీ యాశిషమునంచు గణుతింపమి చేన్.

వ. అనిన నాతం డిట్లనియె,

శా. సాహోదారకుఠారకృత్తధరణీశక్షోణిభృజ్జాతను
ర్వారస్రావితరక్తపూరతటినీహారప్రవాహాంతర
స్ఫూరత్పైతృకతర్పణాంచితప్రతిష్ఠాధాముఁడౌ రాముఁడౌ
వీరగ్రామణి నీ కగణ్యతరదోస్స్వైర్యస్థితిం జెందెనే.

వ. అని విశీర్ణంబై యున్న శివశరాసనంబు విరచుట బాతంబు గాదిది వై
ష్ణవచాపంబు, దీని నెక్కిడిన నీతో ద్వంద్వయుద్ధంబు చేసెదనని చా
పంబు సమర్పించిన,

ఉ. రాముఁడు దుష్టరాక్షసవిరాముడు బాహుబలాభిరాము డు
ద్దామమురారిచాపము నుదగ్రత నెక్కిడి దివ్యబాణమున్
భీమగతిన్ దెమల్చి యరిభీషణరీతి నమర్చి భార్గవ
స్వామి! యమోఘ మీశరము సయ్యనజూపుము దీనిలక్ష్యమున్.

క. కాదేని వేగ తావక, పాదంబుల నేయువాడ బటుగతినన నా
భూదేవు డిట్టులనియెఁ, శ్రీదయితాభద్రధామ శ్రీరఘురామా.

గీ. నీవు నారాయణుండవు నేను నీమహాంశ
భవుడను నీజయుం బడియునాదె
ధరణికశ్యపునకు దొల్లి దానమిడితి
రాత్రులం దుండవలువ దీ ధాత్రియందు.

వ. కావున మహేంద్రంబునకు బోవలయు పాదంబులు నేయక నాకలోక
సోపానంబు నేయు మనవుడు నతండట్లు గావించిన నాసమయంబున
భార్గవుండు వలగొని సెలవుగొనిచనియె ననంతరంబ రామలక్ష్మణా

దు లయోధ్యకుం జని పదమూఁడువత్సరంబులు సుఖంబుండిరని నారదుండు జెప్పిన విని వాల్మీకి యవలివృత్తాంతం బడుగుటయును,

క. రోషానవశంబరరిపు, వేషా సత్కాంతి పూష విద్వజ్జన సం
తోషా మృదుభాషాజిత, శేషా శ్రీనరసభూప శ్రితజనపోషా.

మాలినీ. అమలగుణసమాజా యాశ్రితాదిత్యభూజా
దమశమగుణ భాజా దానరాధా తనూజా
విమలసుకవిరాజా విశ్వవిద్యాతిభోజా
సుమహితరవితేజా సూరిసంతోషబీజా.

—: X ద్య. :—

ఇది శ్రీ మదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సరసకవితాసామ్రాజ్య సుకవిశేఖర. కౌండిన్యసగోత్రపవిత్ర సోమశేఖర ప్రణీతంబైన శ్రీనరసభూపాలరాజీయంబను శృంగారరస ప్రబంధంబు నందు ప్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీసీతా రామార్పణమస్తు శ్రీ శ్రీ శ్రీ.

# నరసభూపాలీయము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీ రాజితగుణశీలా,
రారాజత్కీర్తిజాల రవికులమూలా
శ్రీరమ్యపూష వాట్కుల,
నారాయణరాట్కుమార నరసనృపాలా.

వ అవధరింపుము నారదుండు వాల్మీకితో నిట్లనియె.

క. ఆతీరున మరిదశరథ, భూతలపతి వెలసె దనయభూషితు డగుచున్
మాతులకుల మునకరిగెను, భూతాఘుడు భరతుడనుజుతో గూడివడిన్.

వ. అనంతరంబ దశరథుండు రామునకు పట్టంబుగట్ట వసిష్ఠాదులతో నాలోచించి మహోత్సవంబు జేయింపుచుండ నంతయుంగాంచి,

ఉ. మందర తన్మహోత్సవము మానుగ గన్గొని కేకయావన
న్నందనజూచి పల్కెవిను నాథుడు రాముని పట్టభద్రు జే
యం దనబుద్ధిలోపలదలంచి బయల్పడకుండ డాచి నీ
నందనుబంపె గేకయపురాధిపునీటికి జారుఘోటికిన్.

క. దేవాసురయుద్ధంబున, దేవి నీకిచ్చినట్టి దివ్యవరంబుల్
బోవిడచి యూరకుంటివి, గావున వేడుకొను మిట్టి కార్యముకొఱకై.

క. దండకవనమున రాముని, దుండంబున నాలుగేడు లోకవరమున బల్
దండిని నీతనయుడు భూ, మండలమేలంగ నొకట మహిమదలిర్పన్.

వ. అని బోధించిన నెట్టకేలకు నంగీకరించి దానికి గనకనూపురం బొసంగి.

శా. పాపాలోచన నాలకింపుము గళాపాళిన్ విసర్జించి స
ద్వ్యాపారంబులు మాని హీనమగువల్వంగట్టి వేగం దురా

లాపశ్రేణి వచించి కేశములు దూలంబంచి మేన్కుంచి తా
గోపాగారము సొచ్చె నీరదలసద్గోపాలరేఖాకృతిన్.

వ. అంత నక్కడ దశరథుండు సమస్త మంగళోత్సవంబుల నియమించి యమ్మరునాడు ప్రాతఃకాలంబున శ్రీరామపట్టాభిషేక మహోత్సవంబని నిర్ణయించి యపరిమితానందకందళితహృదయారవిందుండై కైకేయీమందిరంబునకువచ్చి యచ్చట నద్దేవిం గానక సఖీజనంబుల నరసి కోపాగారంబున నున్న ప్రేయసిం గాంచి,

ఉ. బాహుల బట్టి యెత్తి కచభారము దువ్వుచు నంకపీఠిపై
మోహమెలర్ప జేర్చి మఱిమోమున మోము నమర్చి దేహసం
వాహన మాచరింపుచు సువర్ణకలాపము గూర్చుచున్ వరా
రోహను జూచి యిట్లనె నురోజయుగంబు నెదం దెమల్పుచున్.

క. బాలా నీకీసంగతి, యేలా నీ కెగ్గుజేసి వెలసినవారిం
దూలించెద సోలించెద, జాలింబడ నేల దెల్పు చంద్రనిభాస్యా.

వ. అనిన నరపతికి సతియిట్లనియె,

గీ. దేవ దేవాసురాజిలో నీవు నాకు
నిచ్చినట్టి వరంబులు నెమ్మినొసగ
వలయు సత్యంబుదప్పక లలితసరణి
సరసగుణధామ రఘుకులసార్వభౌమ.

వ. అవి యెట్టులంటె,

క. దండకవనమున రాఘవు, డుండం బదునాలుగేడు లోకవరమున బల్
దండిగ నాతనయుడు భూ, మండలపతియగుట నితరమద్వరగరిమన్.

వ. అనిన విని దశరథుండు మూర్ఛిల్లి కొండొకసేపునకు దెలసి సత్యపాశబద్ధుండుగావున చింతాక్రాంతుండై తొడపైనున్న ప్రేయసిండించి చింతిలుచుండ ప్రభాతంబగుటయును వసిష్ఠాదిమునులు సుమంత్రాది మంత్రులు రామసౌమిత్రులును వచ్చిరప్పుడు రామచంద్రుండు కైకేయింగాంచి యిట్లనియె,

క. జనకుఁడు నను దయతోడను, గనుఁగొనకుండుటకు నేమికారణమగునో
జననీ నీవైననుద, ద్ఘనకార్యపుసరణి దెల్పఁగదవే యనినన్.

వ. అనినఁ గైకేయి యిట్లనియె,

సీ. రాఘవ విను దేవరాక్షసాజిని భూమి
వసుడిచ్చె మును నాకు వరయుగంబు
నొకవరంబున నీవు నుద్దండదండక
నామాటవిని పదునాలుగేండ్లు
మునివేషివై యుంటయును శేషవరమున
భరతుండు రాజౌట ధరకు వేడ
దయజేసి యామాట నయమున నీతోడ
వచియించుటకు గొంకువడెనుగాని
వేరె మఱి కారణము లేదు వీరవర్య
యనిన నతఁడిట్టులనియె నోజనని భూమి
పాలనముకంటె దండకపాలనంబు
పొంక మదినాకు దీనికి గొంకనేల.

చ. జనకునియాజ్ఞ నింగితపుజాడను జేసిన నుత్తమాఖ్యుఁడౌ
తనరఁగ నాజ్ఞపద్ధతిని దాల్చినవాఁ డిల మధ్యమాఖ్యుఁడౌ
యనయతనాజ్ఞ సేయని దురాత్ముఁడు హీనసమాఖ్యుఁడౌనుగా
జనని వసింతు వేగజని చండనిశాటవి దండకాటవిన్.

వ. అనిపల్కి రాఘవుండు కౌసల్యాంతఃపురంబున కరిగి యద్దేవికంతయు
విన్నవించిన నక్కౌసల్య మూర్ఛిల్లి కొంతదడవునకు దెలసి రాము నిం
గౌఁగిలించుకొని యిట్లనియె,

గీ. తన తనూజునకును ధరణికోరుట యుక్త
మరయ నాతనూజు నడవికనుప
దగునె కైకకిట్లు ధవుఁడెంత తనకు వి
ధేయుఁడైన నట్టితెఱఁగు గలదె.

మ. శరరుహాచ్ఛక్రశంఖ పవిచాపముఖాఖిలరేఖికా విభా
కరము సమస్తలోకబుధకాండము నీశ్వరదేవతాళి శం
కరమగు నీకరంబునను గంకణమట్టి వసిష్ఠమౌని ధీ
వరుడు బలాశకందములవర్గము ద్రవ్యమటంచు గట్టెనే.

సీ. నగరమాంచితుడన్న మిగుల నమ్మితిగాని
ద్వ్యర్థి దీనికటంచు దలపనైతి
గుభరసేవ్యుండన్న గోరలుచుండితి గాని
పర్యాయమనుచు నేర్పరచనైతి
సాలోచితుండన్న సంతసించితి గాని
యిది వికల్పంబని యెఱుగనైతి
ఘనపుండరీకేతుడన జెలంగితి గాని
యిది బహుళంబని యెంచనైతి
నేడుగా బోధపడె దీని నిజము నాకు
నేమిసేయుదు రాజా నే నేమనందు
కైక దారుణబుద్ధిలో కైకగాన
నింతపనిబుట్టె నాతండ్రి చింతలేల.

సీ. విడువరా నాతండ్రి విపినసంగతి దీక్ష
జెడుగురాకాసుల్వశింతు రచట
వదలనే నాతల్లి వనవాసగతిదీక్ష
గుర్వాజ్ఞ మీరుట గుణముగాదు
పులులురా నాతండ్రి బలువాలుమెకములు
గలసిమెలసి చరించు గానలోన
పులులుగాసీ తల్లి బలుమెకంబులు గాని
రామునోటను బొంకురాదు వినుము
జనకు నానతి దాటగా జనునెయంటి
జననిమాటలు దాటగా జనదుజూడ

ద్వితీయాశ్వాసము.

గాన నాతండ్రి వనవాసగతిని వినుము
వద్దురా చక్కనయ్యా నాముద్దులయ్యా.

సీ. అద్రిసేవలు జేయనబ్బిన సంతాన
మద్రిసేవలకు బాలయ్యె నేడు
నర్కవంశంబులో నలరిన సంతాన
మర్కవంశములబాలయ్యె నేడు
నలరుసత్తరుల సేవలగన్న సంతాన
మలర సత్తరులపాలయ్యె నేడు
అలసవనంబుచే నలరిన సంతాన
మలసవనంబుపాలయ్యె నేడు
అహహ హతవిధిఘటన కేమనగవచ్చు
నెవరివేడుదు నింక నే నేమిసేతు
నెటుల నీబారిగడచు నే నెందుజొత్తు
ననుచు వలవంత బలుచింతగొనియె గాంత.

వ. అని చింతించు దల్లిని సతీమతల్లిని కొన్ని రహస్యతత్త్వోపదేశాను లోనరించి బోధించి పదునాలుగు వత్సరంబులు పదునాలుగునిమిషంబులభంగి బుచ్చివచ్చెదనని చెప్పి సీతామందిరంబునకుం జని యంతయుం దెల్పి నీవు గురుశుశ్రూషావరతంత్రబుద్ధి నుండు మేను శీఘ్రంబ వత్తుననిన నమ్మానిని యిట్లనియె,

గీ. నిన్ను బాసి యొక్క నిమిషంబు నెచ్చట
నిలుచుదాన గాను నీలవర్ణ
జనకరాజు ధర్మచారిణిగా నన్ను
నప్పగించలేదె నధిప నీకు.

వ. అనిన రామచంద్రుం డిట్లనియె,

సీ. సౌవర్ణమణిమయ సౌధవీథులుగావు
ఘనతరపాషాణగండశిలలు

బహురత్నకుట్టిమప్రాంగణంబులుగావు
దుష్టశాఖిస్థలదుర్గమములు
గురుహంసతూలికావరతల్పములుగావు
శర్కరాస్తీర్ణభూసంచయములు
తారుణ్యతరమహోదారస్థలులుగావు
విషమకంటకలతావీరుధములు
వనములెక్కడ గామినీజనములెక్క
డహహ రాజెల్ల దబల మారాకువలకు
వనిత జూడుము బహునాల్గువత్సరములు
నిమిషములమాడ్కి వసిబుచ్చి నేన వత్తు.

వ. అనిన విని జనకతనయ వినయంబున రామునితో నిట్లనియె,

సీ. వనితకు బ్రియునితో వనవాసమయినను
స్వర్గలోకముకన్న సౌఖ్యకరము
నాతికి నాథుతో నగవాసమైనను
బ్రహ్మలోకముకన్న పరమసుఖము
వెలదికి మగనితో విపినవాసం బయిన
కైలాసమునకంటె ఘనశుభంబు
తన్వికి ధవునితో దవువాసమైనను
వైకుంఠమునకంటె వరతరంబు
భీరువున కెందు సఖునితో బీదరికము
గలదె నినుబాసి నిల్వగగలనె దలప
గాన బ్రొమొక్కెద నాసామి కరుణ జూడు
మహిమ దోడ్కొని చనుము నామనవి వినుము.

ఉ. దండకమైననేమి మరి దారుణసత్వము లున్ననేమి నీ
చండభుజోరువజ్రములజాటున నుండిన నేమిశంక మా

ర్తాండకులప్రదీప నను దద్దయు తోడ్కొని యేగు మట్టుగా
కుండిన మేనిపొత్తు దగనొల్లను బ్రాణము ప్రాణవల్లభా.

గీ. అనిన రాముడు సీత రా నవధరించి
చాపుగతిని సుమిత్రాంబుజాక్షి నిలయ
మునకు దగనేగి తత్పాదములకు సెరగి
యింతయును దెల్పి యనుజుతో నిట్టులనియె.

గీ. అనుజ గురువుల నెల్లప్పు డరసికొనుము
దాసదాసీజనంబుల వాసిగనుము
ధరణి వంశ్యచరిత్రంబు దలచికొనుము
బోయివచ్చెద నే వనభూమి కిపుడు.

వ. అనిన విని లక్ష్మణుం డిట్లనియె,

ఉ. తల్లులమాటకేల విను తండ్రి విడంబనమేల పద్మినీ
వల్లభవంశరాజ పరివర్తనమేటికి నాకు జానకీ
వల్లభ! నిన్ను గొల్చి వనవాటికి వచ్చెద నట్లు గానిచో
దెల్లము జెప్పవేని పనిదీరును సిద్ధముసుమ్ము రాఘవా.

వ. అనిన విని సౌమిత్రి నిశ్చయం బెఱింగి తనతోడ రా నంగీకరించె నట్టి
సమయంబున సుమిత్ర లక్ష్మణున కిట్లనియె.

ఉ. భూరిగుణాఢ్యు రాము గురుభూపతిగాగ దలంపుమాత్మలో
శ్రీరమణీలలామయగు సీతను మాతనుగా దలంపుమీ
సారతరంబరణ్యమును సద్వస్థలిగాగను మెల్లభంగులన్
దారకబుద్ధిమీరక వనస్థలికిం జనురాము గొల్వగన్

వ. అని గూఢంబుగా దెల్పిన ననంతరంబ సీత కౌసల్యకు మ్రొక్కి చిన్న
బోయినవదనంబుతో విన్ననై యున్న కోడలింగాంచి యద్దేవి
యిట్లనియె,

సీ. నలునితో రిపుదవానలునితో దమయంతి
గానలకేగదే మానితముగ

జిష్ణుతో సుగుణరోచిష్ణుతో బాలోమి
ఘోరాటవులలోన గుందలేదె
చ్యాద్రుతో సఽహరిశ్చంద్రుతోడను జంద్ర
మతి జెప్పనీరని వెతలపడదె
చ్యవనుతో గలుషాగపవనుతో సంయాతి
నందన యడవిలో గుందలేదె
వారలందఱు దరువాత చారుసరణి
వితతసామ్రాజ్యపూజ్యసంతతులుగనరె
వారివలె నీవు వరునితో వనములోని
కష్టములకోర్చి సంపదల్ గాంచుమమ్మ.

సీ. అనిపల్కి శ్రీరాము నంబుదశ్యాముని
ఘనగుణధాముసద్విశ్రుతనాము
గని యిట్టులనియె శ్రీకాంతుండు శౌరియు
హరిమూర్తి శంకరు డబ్జభవుడు
దినకరు డిందుండు దేవతాగణములు
నినుబ్రోతు రిప్పుడు నీరజాక్ష
యని దీవనల నిచ్చెనప్పుడు రాముండు
వెలయగాంతానుజుల్ వెంటగొలువ
వచ్చిగురుపాదములకును వందనంబు
జేసి కైకయొసంగిన డాసినార
చీరలను గట్టి యనుజుండు సీతగొలువ
రథము నెక్కె సుమంత్ర సారథ్యమమర.

గీ. నిలుః లుమటంచు ధారుణీనేత బలుక
వలద వలదని జానకీవరుడు బలుక
రథముదోలె సుమంత్రుడు రయము మీఱ
క్షోణిపతి స్యందనముజాడ జూచుచుండ.

వ. అప్పుడు,

సీ. అవనీశుఁ డెంత కామాంధబాధుఁ డంచు
వెడలు కన్నీరుతో వెక్కువారు
కైక యెంతటి శిలాకఠినపాపినియంచు
దోరంపువగతోడ దూరువారు
మందర దానెంత మదదురాత్మ యటంచు
నధికచింతాక్రాంతు లైనవారు
విధి యెంతదుర్మార్గ విధిదలంచెనటంచు
వేఁడినిట్టూర్పులు విడచువారు
గురువులకు సేవ సేయక కుందువారు
బాలురకు బాలుపోయక ప్రాలువారు
సకలక్రియలం దసహ్యతసలుపువారు
నైరి సాకేతపురవాసులైన జనులు.

మ. బలిమిన్ వెంబడిపోయి రాప్తజనులు ప్రౌఢుల్ వసిష్ఠాది స
త్కులజుల్ బ్రాహ్మణరాజవంశభవులున్ గోమట్లు శూద్రాదులున్
వెలమల్ బోయలు మంత్రులంత్యకులజుల్ విద్వాంసులున్ లోనుగా
నల సాకేతపురంబునన్గలుగువా రాబాలగోపాలమున్.

వ. ఆసమయంబున దశరథుండు సింహద్వారంబు గడసి రామరథంబు దృష్టిగోచరంబగునంతకు నిలువంబడి కౌసల్యాంతఃపురంబున కరిగె నంతనిక్కడ రామచంద్రుండు గంగాతీరమున కరిగి యచ్చట జడలు ధరియించి గుహునిగాంచి యారాత్రి నెల్లజనంబుల వంచించి యర్ధరాత్రంబున వెలువడి సీతాలక్ష్మణసమేతుండై చని భరద్వాజుం గాంచి నమస్కరించి యమ్మునివాఁడు గంగావతరణంబు జేసి,

చ. అటుజని కాంచె రాముఁడు ప్రియానుజులం గొని చిత్రకూటము
త్కటమణిచిత్రకూటమును గాయకకిన్నరకామినీలస

చ్చటుల విచిత్రకూటము నిషాదనిరంతరబద్ధనీరభృ
త్తటతరుచిత్రకూటమును దర్శనమోదిత చిత్రకూటముః.

వ. ఇట్లుగాంచి,

సీ. శ్రీరామచంద్రుఁ డాచిత్రకూటమునందు
నటజంబు వేగంబ ఘటనపరచి
యందుండె దన్నుఁ బ్రియానుజుల్ గొలువంగ
బొందుగాఁగ మునీంద్రపూజ్యుఁడగుచు
నక్కడ దశరథావనినాయకుండును
హా రామ గుణధామ యనుచు మౌని
శాపంబుదెల్పుచు జనె నాకమునకు హా
యనుచు కౌసల్యాదు లలమటింప
నపుడు గురువు మహీశుని విపులమైన
తనువు తైలకటాహంబున నునిచి భరతు
బిలువబంచిన ననుజుతోఁగలసివచ్చి
తల్లిగనుగొని యిట్లనె నుల్లమదర.

చ. నరవరుఁడేడి తల్లి చనెనాకము హా గతమేమొ నందనుం
డరుగుటదండకాటవికి! నాసుతుఁడెవ్వఁడో! రాముఁ డాతఁడే
వెరవుగనేగె నే వరమువేడఁగ! దీనబనేమి! నీకు! నీ
ధరణియొసంగఁజేయుటమె దథ్యము కీడుజనించె రాక్షసీ.

వ. అని తల్లిని ధిక్కరించి యక్కడ నిలువక కౌసల్యాంతఃపురంబున కరిగి యేడ్చుచు నద్దేవిపాదంబుల కెరగిన కౌసల్య లేవనెత్తి కౌఁగిటఁజేర్చి కన్నీరునింపుచున్న భరతుఁడిట్లనియె.

సీ. తల్లి యీపాపంబు దగనెఱింగితినేని
కాశిలో గోహత్య జేసినట్లు
మాత యీదోషంబు మదినెఱింగితినేని
చండాలితోఁగూడి పండినట్లు

జనని యీదురితంపుపని యెఱింగితి నేని
చెడుసురాపానంబు జేసినట్లు
అంబ యీఘనకలుషం బెఱింగితి నేని
సత్యభూసురహత్య జంపినట్లు
దేవి యీపాపగతి నాకు దెలసె నేని
తలగ కెంతయు గుర్వాజ్ఞ దప్పినట్లు
వేయు నేటికి నామాట వినగదమ్మ
గట్టిగా నీదుపదములు బట్టిచెపుదు.

వ. అనిన గౌసల్య యిట్లనియె,

క. అన్నా నీ వీపురిలో, నున్నను నిటువంటి వంత యొదవునె దలపన్
మున్నేమి జేసియుంటినొ, నిన్నేమనుదాన గైక నేమనుదానన్.

వ. అనంతరంబ భరతశత్రుఘ్నులు తైలద్రోణియందున్న జనకునింగాంచి విలపించిన వసిష్ఠుండూరార్చి దశరథునకు నూర్ధ్వలోకక్రియలు జేయించి యమ్మరునాడు సభామధ్యంబున భరతునిం జూచి పట్టాభిషిక్తుండవు గమ్మనిన నతండిట్లనియె.

క. నామనమును నాశీలము, నోమునివర నీ వెఱుంగవో నిట్లంటే
వేమరు గైకసుతుండని రామునితమ్ముఁడని దెలపరాదే మదిలోన్.

క. రేపే జని రఘురాముని, శ్రీపాదముబట్టి భక్తిచే దెచ్చెదనే
నాపగిదిగాక తక్కిన, నాపరమేశ్వరునిగొల్చి యచ్చటనుందున్.

సీ. అని నిశ్చయింపుచు నమ్మరునాడు దా
జననీవసిష్ఠాదిసహితుడగుచు
శృంగిబేరముజేరి శీఘ్రంబ సఖుగుహు
సంగతిచే మించి గంగదాటి
దగభరద్వాజుని దర్శించికడువేగ
మున జిత్రకూటాగమునకు నేగి
బలుదూరముగ సేన నిలిపి తమ్మునితోడ
జనుదేర సౌమిత్రి గనుచు బలికె

ధరణినాయక మనమీద దాడిసేయ
భరతుడరుదెంచె సేనతో భరముగాగ
గటకమున నీవుశాంత మంతటికిదెచ్చె
అనుడు రాముడు సౌమిత్రి కనియె నవ్వి.

క. తమ్ముడ నీకంటెను వినయమ్మున నాయందు భక్తినమరినవాడా
లమ్మునకు రాడు వచ్చుట, నెమ్మదిగొనిపోవ మనల నిటకరుదెంచెన్.

మ. అనుచుండన్ భరతుండు దూరముగ సేనావాసముంజేసి దా
ననుజన్మాదును పాదచారులగుచున్ హర్షాశ్రువుల్ గ్రమ్మగా
దనువుల్ గంటకవిక్షతిన్ బొరయ బాదంబుల్ శిలల్ దాకగా
జని రవ్వేళను మేనెఱుంగక రఘుక్ష్మాపాలు దర్శింపుచున్.

క. భరతుండంజలి శిరమున, ధరియింపుచు రామపాదతామరసంబుల్
గురుపాదతలమునంటుచు, ధరసాగిలి మ్రొక్కె వినయతాత్పర్యములన్.

ఉ. మ్రొక్కిన వత్సలెమ్మనుచు మోదముతో రఘురామదేవుడున్
గ్రక్కున బాహుమూలములు గైకొని కౌగిటజేర్చి కూర్మి పెం
పెక్కగ నంకపీఠమున నెక్కుడుప్రేమవలిర్ప నుంచి బల్
మక్కువవానితమ్ము నటుమన్ననజేసె విభుండు గొబ్బునన్.

గీ. అపుడు భరతుండు జనకజ కమితభక్తి
యమర బ్రణమిల్లె నాసాధ్వి యభినుతించె
బిదప లక్ష్మణు గౌగిట బొదలజేసె
వేగ శత్రుఘ్నునకు యథావిధులు సలిపె.

వ. అనంతరంబ వసిష్ఠాదులు తల్లులు మంత్రులును రా నారాజపరమేశ్వరుండు వసిష్ఠాదులకు దల్లులకుం బ్రణామంబు చేసి, మంత్రుల సేమంబరసి కూర్చుండ నియోగించి తాను నుపవిష్టుండై జనకుని సేమంబడిగిన వసిష్ఠుండు మీరరణ్యవాసంబునకు వేంచేసిన సప్తాహంబులకు ననశనవ్రతుండై రామస్మరణంబుజేయుచు దివంబున కరిగెననిన విని రాఘవుండు మూర్ఛిల్లి వసిష్ఠప్రయత్నంబున గొంతదడవునకుం దెలిసి యిట్లని విలపింపం దొడంగె.

ఉ. హా యను గాంతపూర్వకకుబంత విరాజితహస్తిహస్తబా
హా యను ధారుణీతలవిరాజితనూతనవారివాహవా
హా యను దేవతావరవరాసనసుస్థితియోగ్యదివ్యదే
హా యను నెట్టులోర్తు నహాహా యను సూర్యకులోద్భవా యనుఁ.

వ. మఱియును,

ఉ. నాకముమీఁద దాడిజను నాకపవైరుల ద్రుంచ నేగితో
గాక శనైశ్చరాది ఖగకాండము సుస్థితినుంచ నేగితో
లేక వినాయకాదులకు లీల వివాహము సేయ నేగితో
వీకదివంబు సొచ్చుటకు వే గతమేమొ మహాత్మ దెల్పవే.

వ. అని యిట్లువిలపించిన రవికులతిలకు మునివరుం డూరార్చె నంత రాఘవుండు చండకరకులమండనునకు నూర్ధ్వక్రియాకాండం బొనరించి యమ్మరునాఁడు వెండియు సభామధ్యంబున నప్పుండరీకాక్షునితో భరతుండు చేతులుజోడించి యిట్లనియె.

క. మతిదప్పి దుష్టసతిసం, గతిమించినవానిమాట ఘనమని నీపి
స్థితినడుపుటధర్మంబే, తతసద్గుణధామ రామదైత్యవిరామా.

సీ. పర్జన్యుఁడా మేఘపంక్తికధీశుండు
క్ష్మీతిపాజ్ఞనవియు వర్షించుగాక
చంద్రుఁడా దేవతాసమితికన్నము బెట్టి
నృపయజ్ఞ తతిదృప్తినెరపుగాక
సూర్యుఁడా పటుతమస్స్ఫూర్తి నివారించు
రాజప్రతాపాభిరాజిగాక
యురగమా భూమిని భరియింపఁగానోపు
భూరిమహారాజభుజమ్మెగాక
గాన యిట్టిమహారాజకార్యగరిమ
నేను భరియింపదగుదునే నీవెగాక
జెలఁగ సాకేతపురికి వేంచేయుమయ్య
దశరథప్రథమపుత్ర సీతాకళత్ర.

వ. అనినవిని రామచంద్రుం డిట్లనియె.

చ. వరమును దల్లి వేడెనట వల్లభు డావరదానసత్క్రియా
పరుడట తండ్రి దాని పరిపాలకుడా రఘురాజవీరశే
ఖరుడట తత్కాలంబునకు గర్త మహాత్ముడు పద్మనాభుడో
హరుడట తప్పిపోవునట హా పరికింపగ నెట్టివిచిత్రమో.

వ. అనిన విని భరతుం డిట్లనియె.

క. అటుగాకున్నను నేనీ, పటుపదపద్మములు గొలిచి వచ్చెద సేవా
ఘటనమతి గాకతక్కిన, దటుకున ప్రాయోపవేశతతమతినగుదున్.

వ. అనుచు దర్భలు పరచుకొని పూర్వాభిముఖుండై కూర్చున్నవినయ
భరితు భరతుని గాంచి రఘువరుడు గురువరు గనుసన్న జేసిన నతండు
భరతునకు నిజంబెఱింగించి రామునితో నిట్లను నితనికి మీ పాదుక
లిచ్చిన రాజ్యంబు సేయుననిన నతం డట్లసేయ, నా భరతుండు రాఘ
వుండు చతుర్దశవత్సరానంతరంబున రాకుండిన వహ్నిప్రవేశంబు
సేయువాడై నిశ్చయించుకొని మరలి సమస్తపరివారసమేతుండై
భరద్వాజుం దర్శించి నందిగ్రామంబు జేరి జటావల్కలధరుండై యుండె
ననిన విని యవలికథ నడుగుటయును,

క. ప్రేమాతతభామామణి, కామా వరభోగధామ గంభీరగుణ
స్తోమా ఖిలభీమా శుభ,సీమా సత్కీర్తిసోమ శిష్టలలామ.

భుజంగవిలసితం. వినయవిశారద నీరదవిశ్రుతశాశ్వతకీర్తిధరా
వినుతజనావన సంతతపావన విష్ణువిభావన పాపహరా
ఘనసుగుణాకర వక్త్రసుధాకర కాంతివిభాకర ధైర్యధరా
మనసిజసుందర భోగపురందర మంగళమందిర చాపకరా.

—: గద్య. :—

ఇది శ్రీ మదుమామహేశ్వరవర ప్రసాదలబ్ధ సరసకవితాసామ్రాజ్య
సుకవిశేఖర కౌండిన్యసగోత్రపవిత్ర సోమశేఖర ప్రణీతంబైన
శ్రీనరసభూపాలరాజీయంబను శృంగారరస ప్రబంధంబు
నందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.
శ్రీసీతారామార్పణమస్తు శ్రీ శ్రీ శ్రీ.

# నరసభూపాలీయము.

## తృతీయాశ్వాసము.



శ్రీరాజితగుణభాజా
నారాయణరాట్తనూజ వరరవితేజా
సూరిజనకల్పభూజా
వీరా శ్రీనరసరాజ విద్యలభోజా.

వ. అవధరింపుము,

గీ. అంత రాముండు చిత్రకూటాద్రివిడచి
వెలదిసౌమిత్రియును వెనువెంట రాగ
నత్రియాశ్రమమునకేగి యతనిపాద
ములకుం దండంబువెట్ట నమ్మునివరుండు.

క. ఆశీర్వచనము జేయుచు, దాశరథుల గొన్ని నెలలు దగనిల్పుచు కం
దాశనదృప్తుల జేయుచు, గోశవువరమహిమలెల్ల గీర్తించి వడిన్.

వ. అప్పుడు,

క. మాయనిమడుగులు, మేనన్ బాయనిదివ్యాంగరాగభంగియు నెందున్
జేయనిసొమ్ములు వడినన,సూయ దగన్ జనకరాజసూతికి నొసగెన్.

వ. అనంతరంబ సీతారామలక్ష్మణులు వారివలన నామంత్రణంబుగొని
చనిచని,

సీ. తాలతమాలతక్కోలకాలస్క
జాలసాలరసాలకిలితంబు
మాతులుంగలవంగకేతకీభల్లాత
చూతభూజావాసశోభితంబు
పనసాసనాశ్వత్థతినిశార్జునకపిత్థ
విద్ధకర్లీజపావిష్కృతంబు

ఘోంటాకురంటకఘంటామ్లకకదంబ
ఝింటీకటుంభరాచిత్రితంబు
కుందకురువిందమందారకోవిదార
జంబుజంబీరనింబకదంబవకుళ
వల్లికారణ్యమల్లికావేల్లితంబు
దండకవనంబు గాంచి యాదండ కరిగి.

క. బాణాసన బాణాంచ, త్తూణాలసమానసుభుజతూణాంచితుఁడై
క్షోణీపతి తదరణ్య,క్షోణీస్థలి నరిగె మిగుల శూరత వెలయన్.

చ. అట చని కాంచె రాముఁ డిభు డద్రిశరీరసనాథు దేవతా
కటలవిరోధు భూరివపాటితకర్ణదిశేభనాథు వి
స్ఫుటమునిమార్గరోధు ఘనశూలవిలగ్నలులాయకుంజరో
త్కటమృగనాథు నిష్కరుణ ఖండితసాధు విరాధు నయ్యెడన్.

వ. అట్టిసమయంబున,

గీ. వాయువేగంబుతో దైత్యనాయకుండు
వడి జగన్మాత సీత వేనోడిసిపట్టి
చంకనిడి పోయె నావంత శంక లేక
నదియు గనుగొని సౌమిత్రి కనియె విభుడు.

క. రాజ్యంబు గోలుపోవుట, పూజ్యుండగు తండ్రి జనుట భూరివనాంత
ప్రవ్రాజ్యాచరణత సీతా, త్యాజ్యతయుం గలిగె గంటె దైవము కతనన్.

గీ. అనిన సౌమిత్రి రాముతో ననియె దేవ
నీవు నిటుబల్క ధర్మమే నేను వీని
ఘోరబాణాళి నిల బడగూల్తు ననుచు
జటులశరములు వానివక్షమున జొనిపె.

ఉ. తోడనె రాఘవుండు పదితూపుల వానిశిరంబు నేయగా
వాడును సీత డించి రఘువర్యుల మూపునదాల్చి బోవ వెం

టాడుచు సీత రా గని మహాత్ముఁడు లక్ష్మణుతోడ నిట్లనెన్
వీ డిటఁబోవుత్రోవ యటవి న్మనమార్గము నొక్కటే సుమీ.

క. కావున గించిత్కాలము, గావుము దగ వెనుక వీని ఖండింతమన
న్నావుడు లక్ష్మణు డట్టుల, గావింపగ వాడు సనియె గాంతారమునన్.

ఉ. రాముడు లక్ష్మణుండు నట రాక్షసు ఘోరభుజాయుగంబు ను
ద్దామసితాసులం దునిమి ధారుణిమీదికి దాట వాడు సం
గ్రామవిశారదుండు వడి గ్రమ్మఱ రా రఘురామదేవుడున్
భీమశరాహతిం దునిమె బృథ్వీపయింబడ వానిమూర్ధమున్.

వ. ఇట్లు దునుమఁబడి దివ్యరూపధరుండై వచ్చి రామునకు దండప్రణామంబుజేసి యిట్లనియె.

సీ. దానవకాలాయ మానవలీలాయ
జానకీలోలాయ తే నమోస్తు
ఇందీవరాభాయ కందర్పశోభాయ
దివ్యాబ్జనాభాయ తే నమోస్తు
రాజీవనేత్రాయ రమణీయగాత్రాయ
ధీరతాగోత్రాయ తే నమోస్తు
కాంచనచేలాయ కారుణ్యశీలాయ
దీనార్థిపాలాయ తే నమోస్తు
మాధవాయ మహాత్మనే శ్రీధరాయ
లక్ష్మణాయ సదాశ్రితశ్రీశివాయ
విబుధవినుతాయ రామాయ వినుతయశసె
భానుకులజాయ తుభ్యం నమోనమోస్తు.

వ. అని యిట్లు వినుతించువానిం జూచి రాఘవుం డిట్లనియె.

ఉ. మంజులమూర్తితో రుచిరమాలికతో శుభలక్షణంబుతో
రంజిలునీవు ఘోరమగు రాక్షసరూప మిదేలవచ్చె నీ

సంజననాదికృత్యముల సర్వము దెల్పుమటన్నవాడు వే
ల్రాంజలిజేసి వల్కె ఘనభాసితుతో దన పూర్వవృత్తముల్.

వ. దేవా నీ వెఱుంగనిది యేమున్నది యైనను విన్నవించెద నేను దుంబు రుడను గంధర్వుండ నొక్కమునిశాపంబున నిట్లైతి నిప్పుడు దేవర కటాక్షంబున శాపవిముక్తుండనైతి కృతార్థుండనైతి మీరలు శరభం గాశ్రమంబునకు జనుచురుగాకయని పల్కి వందనం బాచరించి దివం బునకరిగె. రాఘవుండు సీతందోడ్కొని శరభంగాశ్రమంబునకుం జని,

క. శరభంగున కటరచితా, శరభంగుడు రాఘవుండు సయ్యన నొసగెన్.
సురలోకము విద్వద్భా, సురలోకము సంతసింప శోభితమతియై.

వ. అనంతరంబ సుతీక్ష్ణాద్యనేకతాపసావాసంబుల గొన్ని సంవత్సరంబు లుండి మునీంద్రుల కభయంబు లిచ్చుచు నగస్త్యాశ్రమంబున కరుగు చు, సీతతో నిట్లనియె సకలంకశరత్సమయసంపూర్ణపూర్ణిమా విభావరీవిరాజితరాజవదనా మదనారామసీమరారాజత్కుందర దనా సుగుణసదనా గనుగొంటె గోదావరతీరదరీదృశ్యమాన దశ యోజనాయామ శుంభత్సంరంభ పరిపక్వఫలసహస్రభారావనమ్రం బులై భవల్లసమానగంభీరవిలసదూరుస్తంభసంరంభశోభా తిరస్కృ తాత్మప్రభాజాలంబులై వినమితశిరస్సంచయంబులై నవిం బోలె నమ్రఫలసంచయంబులై శోభిల్లు శాతకుంభసంభావితరంభాస్తం భంబులును రంభాభిరామగిరి మల్లికామతల్లి కావల్లికాడోలి కాపాలి కా కేళికాసముచ్చయమకరాంక బిరుదాంకగేయగాయన కిన్నరీజనానూన గానతానప్రదానేచ్ఛాభాసితకీచకవేణువితానసంతానంబులును సం తానసంతానాభిరామపరిణతఫలవినమితశాఖాశిఖావభాసిత చూత భూజాతజాతసంస్థితశుకపికాదిపతంగతుంగారావవిరాజితస్థలంబులును స్థలజలజాతనిష్యందమకరందబిందుసందోహసమాకర్షణసమాయాతవి లసదిందిందిరబృందగానానందరసాకర్షణ త్యాజితస్వప్రియావమానజ నితమానేర్ష్యాసంచయ భిల్లపల్లవ పాణిస్వయంగ్రహణానందితశబర

జాలంబులును యేడాకులనటుల బొరలురిలిపసుకపురంపుదిన్నె లద్దం
బైన దొలంగి మలంగి చనునివ్వటులు మవ్వంపుబువ్వగమి దవ్వద
వ్వన గురియజాల్కొను తేనెవానలచిరికాలువలుగలసి మెలసిదిరుగ
బాయమరందపుటేరులును మొయపుబాయల చెయవులబొంచిమించి నీరు
డాగగమకించు నేనుంగుల బీనుంగులగా కరకుటమ్ముల నిమ్ముగానేసి
డాసి తత్కుంభికుంభ నిర్గతముక్తాఫలంబుల నేరి కుబేరాక్షిలీలావిలా
సంబులం దేలిమించు చంచుముద్దియుల వద్దికలతద్దయుం జెలగు
పక్కణకదంబంబులును కదంబశాఖాక్షతసద్యోభిన్నమృగనాభికా
ఘుమఘుమాయమానపరిమళవాహాగంధవాహకుమారవాసిత మణీ
సుందర కందరమందిర నిష్పదరవిందశరక్రీడానందితబృందారకబృంద
సుందరీకాయజాయమానశ్రమజలబిందుజాలకంబులును, జానకామో
దితద్రాక్షాలతానికాయకాయమానఘనాంతరంబుల నివ్వటిలు
జవ్వాదిపిల్లుల మొల్లమగువాసనలు వెల్లివిరియ నుల్లసిల్లు భుజం
గగజగామినీశృంగారసంగీతాకర్ణనపరవశసారంగసారంగనయనావిరా
జితవనంబులును వనాశయవిభాసితహంసకారండవచక్రవాకబకక్రౌం
చసారసాది పక్షిపక్షమారుతకంపితసౌగంధికఫుల్లహల్లక శతపత్రసహ
స్రపత్రపుండరీకషండమండితకువలయానీకకోకనద తేజోవిరాజితగహ
నంబులును, వెలయు మలయునిత్తాపసాశ్రమంబున మఱియు గిరి
మూషికాపోతజాతంబుల ప్రీతి వాటించు కాననమార్జాలజాలంబులు
ను, మార్జాలజాలబాలకంబులతో మైత్రి నెరపుపక్కణకుక్కురసంచ
యంబులును, కుక్కురపాకానీకంబులతో చెలిమిసేయు వృకనికరంబు
లును, వృకనికరపృథుకసంఘంబుల బోషించు చిత్రకాయంబులును,
చిత్రకాయడింబకంబులకు బాలిచ్చు శార్దూలికాకదంబంబులును,
శార్దూలికాబాలికావారంబుల బోషించు మహోత్కంఠకంఠీరవంబు
లును, కంఠీరవకంఠాశ్లేషోత్కంఠచండగండభేరుండంబులును, గండభే
రుండంబులతో నిండువేడుక గలసియుండు మహోత్కృష్టాష్టాపదంబు

లునుం గలిగి జలగునని పల్కి రాఘవుండు ప్రియానుజులు గొలువ నగస్త్యాశ్రమంబునకున్ జని యమ్మునివరునకు నమస్కరించి యత్తాపసోత్తమువలన బలనిషూవనచాపంబుగొని తదనుమతి గౌతమీతటంబున నొక్కపర్ణశాల రచియించి యందు సీతాలక్ష్మణసమేతుండై వసియించి పితృసఖుండగు జటాయువుం గాంచి సుఖంబుండునంత సమరనాటకప్రస్తావనయగు శూర్పణఖ రాముం గాంచి యంతర్గతంబున నిట్లువితర్కించె నప్పుడు,

సీ. ఔరౌర యీభవ్యయానము గనుగొన్న
　　సార్వభౌమవిలాససరణి దోచు
భళిభళి యీ రేని బాహురీతి గనంగ
　　చక్రవర్తియటన్నజాడ దోచు
సద్దిర యీమేటియాననరుచి జూడ
　　బలుమహారాజని బలుకజెల్లు
బాపురే యీదివ్యభవ్యమధ్యము జూడ
　　వీరకంఠీరవవిధము దోచు

సతతమును సర్వమంగళాశ్రితశరీరు
డగుటచే రాజశేఖరు డనగనొప్పు
నహహా యీతనిమునియన నలవియగునె
సాంద్రతరకీర్తి రాజదేవేంద్రమూర్తి.

సీ. ఫాలాంతరమునందు గ్రాలునేత్రముఁ డాచి
　　వచ్చియున్నట్టి సర్వజ్ఞమూర్తి
శంఖచక్రము లొక్కచక్కి వైచి మునీంద్ర
　　వృత్తి జెందిన పురుషోత్తముండు
ఖరకరంబులు మాటి ధరణీస్థలంబుపై
　　నొప్పారుచున్న దేవోత్తముండు

చెఱకువిల్లును పుష్పశరములు విడనాడి
యడవివర్తించు పద్మాంబకుండు
ననగ జెలువారుచుండు శివాన్వితుండు
చక్రరేఖాకరుండును చారుదీప్తి
మూలకందంబు మఱి జగన్మోహనుండు
వీని వర్ణింపదరమె వాగ్జానికైన.

వ. అని మనంబునం దలపోయుచు డాయంజని యిట్లనియె.

ఉ. ఎవ్వరు మీరు మీరుమరుహాస కళాభల జంద్రసూర్యులం
దివ్వనరాజిరాజిలుట కెయ్యదిహేతువొమానివాసమున్
దవ్వకలంకలంక ఘనదానవరాడనుజన్మ నేను మీ
మువ్వము గాంచగాంచగను మారుమునిర్దయనేచె నుగ్రతన్.

వ. అనినవిని రామచంద్రుం డిట్లనియె.

గీ. రాచవారము దశరథరాజనంద
నులము గుర్వాజ్ఞ చే వనస్థలమునందు
వాసమొనరింపగా నిటువచ్చినార
మబల మము రామలక్ష్మణులండ్రు జనులు.

వ. మఱియు నిశాంతామణి జనకరాజనందన మత్ప్రాణవల్లభ యనిన
నారాక్షసి యిట్లనియె. నీకు వలసివచ్చితి నాచరిత్రంబు వినుము.

సీ. సుందరవరమేరుమందరమాణిక్య
కందరంబులదాల్చి గలయనేర్తు
క్షీరపారావారసారసైకతముల
జేర్చి మారక్రీడ దార్పనేర్తు
నందనాంచితరసస్యందనోంచితహారి
చందనచ్ఛాయనిన్ జెందనేర్తు
మంత్రతంత్రోపేతయంత్రగాత్రంబుల
పాత్రంబులిలమెచ్చ బాడనేర్తు

కామనిభ కామరూపత గలసి మెలసి
నేడు చౌసీతిబంధముల్ గూడనేర్తు
గాన నన్నేలుకొను మల్లచాన విడుము
రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర.

వ. అనిన రామచంద్రుండిట్లనియె.

గీ. నలినలోచన విను నాకు నాతిగలదు
సవతితోఁపోరశక్యమే జగతిలోన
నగుట నోకాంత దగు లక్ష్మణాభిధేయ
సరసు జెందుము నీకోర్కె సఫలమగును.

వ. అనినవిని యారక్కసి సౌమిత్రి డాయాజని దన్ను వరింపుమనిన నతం
డిట్లనియె.

క. భాసురుడగు రఘురాముని, దాసుడ న న్నీవుగోరి తగిలితివేనిన్
దాసివయి యుండవలయును, హాసిగరఘురాము నీవువరియింపుదగన్.

వ. అనిపల్కి పంపిన నది రాముకడకుంబోయి యిమ్మానుషిగలుగ నీ
వింతదడవు జేసితివి గావున దీనిం బ్రింగెదనని సీతాసమీపంబునకరుగ
రామచంద్రుండు చేవడ్డగించి లక్ష్మణుచేదత్కర్ణనాసాచ్ఛేదంబు జేయిం
చె నదియేడ్చుచు జనస్థానంబుననున్న ఖరునిపాలికింబోయియిట్లనియె.

ఉ. రాముడు లక్ష్మణుం డనగరాజకుమారులుః వచ్చి రాక్షస
స్తోమము ద్రుంపగా మునులతోడ బ్రతిజ్ఞయొనర్చి ముందుగా
భీమబలున్ విరాధు నని బీటణగించిరి బాణశక్తిచే
నేమియెఱుంగవీవు మరియేనటుబో నిటుజేసిరుగ్రతన్

వ. అనిన విన కోపించి,

క. దనుజులు పదునలుగురవడి, బనుపగ వారరిగి రాముబటుశరహతిచే
తను గూల నదియు విని వే,గను బైనంబగుచు దనుజకాండముతోడన్.

సీ. ఖరుడంత వెడలె మఃష్కరుడు భీకరుడు దు
ష్కరుడు తోశ్శిరుడు దుర్ధరుడు గడగి

దూషణుండరిగె దుర్భాషణుండరికోటి
భీషణుం డురుగదా భూషణుండు
త్రిశిరుండు జను ఘన్నగశిరుండు నుతమా
ధవశిరుఁడు పావకాశిశిరుడరిగె
భటులుగ్రసమరలంపటులు గీర్వాణ సం
కటులు దోఃపటులు దుర్ఘటులుజనిరి
భూరిభేరులు ఢంకాలు వీరకాహ
ళాహుడక్కలు ఢక్కలు లంపటముగ
డప్పులును వీరకాహళుల్ తప్పెటలను
మొరసె బ్రహ్మాండ మవియంగ పరియలగుచు.

సీ. మేటిరెక్కలుగల నాటిపర్వతముల
భంగిని నడచుమాతంగములును
మందరమంథాన మథితపాథోరాసి
భంగముల్ బోలు తురంగములును
కల్పాంతదుర్దాంత కలితకాదంబినీ
బృందముల్ బోలిన స్యందనములు
సంవర్తవర్తిత సమవర్తికింకర
వారముల్ మీరిన వీరభటులు
వజ్రనిభమార్గణుండు దుర్వారతేజు
డురుమహాబలు డుగ్రమహోగ్రుడైన
రాముమీదికి నడచె సంగ్రామభీమ
ఖరవిరావంబు లడరంగ ఖలునిబలము.

పంచచామరము. ధగాల్ధగాల్ధగాలటంచు దారుణాసులొప్పగా
భగాల్భగాల్భగాలటంచు బ్రాససమితిదాకగా
జిగాల్జిగాల్జిగాలటంచు జిత్రశక్తులాడగా
నిగాల్నిగాల్నిగాలటంచు నిండ కాండకాండముల్.

వ. ఇట్లు వచ్చు రాక్షససేనం గాంచి రాఘవుండు లక్ష్మణునకిట్లను నమ్ము
క్కడిరక్కసి మనమీదికి దనవారిం దోడ్కొనివచ్చుచున్నయది నీవు
సీతందోడ్కొని గుహాంతరంబున కరుగుమనిన నతడట్లజేసె, నిటరా
క్షసులు శరాసారఘోరంబుగా జుట్టుముట్టిన, నా రాఘవుండు ధ
నుఃకళాపాండిత్యంబు జూపెనప్పుడు,

సీ. అధిగతచక్రవాళావృత్తపోషిత
హంసావళీపున రాగమములు
దారితసముదగ్రదైత్యాంగనిష్క్రాంత
పాటితాఖిలకులపర్వతములు
ఖచితామరద్విషత్ఖండనాసతోర్ధ్వ
గమనభావితదేవసముదయములు
పరిచ్ఛిన్నరాక్షసోభయభంగకలుషిత
చరమపూర్వదిగంతసాగరములు
చటులసంవర్తసంభూత సప్తవాత
ఘాతజీమూతసంఘాతజాతవిషమ
ఘాతనిర్ఘాతతులితంబు లాతతములు
ఘోరరఘురామమార్గణకోటు లడరె.

సీ. ఒకచెంత కల్పాంతవికటఘోరకృతాంత
దండశౌండప్రభాఖండ మగుచు
నొకచాయ లయపురాంతకపాలపావక
జ్వాలికామాలికాభీల మగుచు
నొకతేప లయచకచ్చకితత్రివిక్రమ
చక్రవిక్రమకళావక్ర మగుచు
నొకదండ కల్పదీపకచండమార్తాండ
మండలాంచద్దీప్తికాండ మగుచు

వరలె బురుషోత్తముడు దండధరుడు చటుల
బలుడు రవితేజుడగు భానుకులుని బాహు
దండమండిత దివ్యకోదండముక్త
రూక్షదంభోళిగంభీరరోషవితతి.

వ. అప్పుడు పాశుపత, నారాయణ, బ్రహ్మాస్త్రాదులు ప్రయోగించి సర్వ బలంబులంగూల్చి,

క. ఖరునిన్ మార్గణతులితన, ఖరునిన్ గళరావదిఙ్ముఖరునిఁ ఖలిశే
ఖరుని సమున్నతివిజితశి, ఖరునిం బడవైచెచండకాండాహతిచే.

క. దూషణుచసత్యమాయా, భాషణు భుజసారదీప్తిపరిపంథినదీ
శోషణు మునిభీషణు నల, దూషణు బడవైచెసార దోస్సారముచే.

వ. ఇట్లు త్రిశిరస్కాదులంగూల్చి శాంతినొంది రాఘవుండు పర్ణశాలకు నరుదెంచి సీతాలక్ష్మణసమేతుండై, సుఖంబుండెనంత హతశేషుడగు రక్కసుండొక్కడు రావణునకింతయు విన్నవించిన రావణుండు మారీచుపాలికింబోయి సీతాపహరణార్థంబు సహాయుండవు గమ్మనిన నతండిట్లనియె.

సీ. తాటకాదానవీహాటకాచలమేఘ
ఘోటకాయుధితోరు ఘోరశరుడు
వేదండదైత్యారికోదండనిష్ణుభు
జాదండమండితచండబలుడు
గాధిజాధ్వరసన్నిరోధిజాల్మనుదద్వి
రోధిజాలాగధారాధరుండు
భీషణాకృతిఖరదూషణప్రాలేయ
శోషణామరపదభూషణుండు

భార్గవాగ్రహపాథోధిబాడబంబు
వటువిరాధాబ్ధికుంభజబాడబుండు
విబుధగీర్వాణమునిగణవితతభక్త
పోషణుండెన్న రఘువంశభూషణుండు.

వ. మఱియు మేము విశ్వామిత్రుజన్నంబు జెరుపనరుగుసమయంబున,

మ. మదనాగాయుతసత్త్వనన్ను నొకభీమప్రౌఢబాణంబు భీః
ప్రదమై దాకి తృణంబుదూల్చె కజగత్త్రాణుండనా మించి యీా
యుదధిప్రాంతమునందు వైచిచనె దా నుద్వృత్తితో రాముబా
ల్యదశోపక్రమవిక్రమంబిదియు నోలంకేశ! యూహింపుమా.

క. ఏతత్ప్రాకృశ గురుబలుశకు, సీతాపతితోడ వైరశీలము విడుమో
దైతేయజలధిచంద్రమ, సీతోడ నసత్యభాష నే నుడివెదనే.

వ. అనిన విని రావణుండు లంకాపురంబునకువచ్చె, నాసమయంబున శూ
ర్పణఖ వివాదంబుతో రావణసమీపంబునకుం బోయి యంతయుం
దెల్పి త్రైలోక్యసుందరియగుసీతను నీకుగా గొనితేరనరిగిన నిట్లు
జేసెనని మఱియును,

సీ. యామినీభామినీటీకామినీమణులెన్న
సీమంతినీపాదసితనఖములు
యిందిరాసుందరీమందిరంబులు జూడ
జందిరాననవిభాస్వత్పదములు
గంభీరజంభారికుంభీంద్రఘనతర
కుంభంబు లాచానగుసకుచములు
నాళామృణాలాభిలీలాకరములౌ ప్ర
వాళారుణాధరివరభుజములు
అహహా యీాయింతిసొగసు మోహములదొంతి
కాముపట్టపుదంతి చెంగల్వబంతి
లలితవాసంతిచెలువు మేలగువలంతి
మరునిదీముశకుంతి భూవరుపడంతి.

సీ. అన్నులతలమిన్న గన్నులగనుగొన్న
కమలానుగుణకళాకాంతిదార్చు

ఒప్పులకుప్పబల్కొ ప్పొకప్పగసంగ
కాళీవిలాస వైఖరి దనర్చు
బిబ్బోకవతిగజ్జిగుబ్బలు గనుగొన్న
శ్రీఫలాకారసంసిద్ధి జేయు
నీరజదళనేత్రయారుతీరుగనంగ
ఛాయాభినవరేఖసౌరుమీరు
గాన యామంజువాణి యాకమలనయను
రాణియో వాణియో భూతరాజపద్మ
పాణియో భాస్కరాంబుద వేణి యగునో
గాక నితరుల కీరూపగరిమ గలదె.

వ. మఱియును,

సీ. కర్ణముల్ శ్రీకళాగరిమ మించిదనర్చె
గన్నులు పద్మాభికలనగాంచె
నాసిక కాంచననవవిభూతి జెలంగె
లపనంబు పద్మారిలక్ష్మిగాంచె
గంధరంబబ్జాభగౌరవస్థితిమీరె
పాలిండ్లు భూధరప్రభ వహించె
నారు హీరారాజిచారులీల వహించె
గటి ధరాచక్రరాట్పటిమ దనరె
నాభి నవనిధిలక్షణోన్నతి జెలంగె
మధ్యమొక్కటి దురదృష్టమహిమ దాల్చె
తాను ముష్టికి లోనయ్యె హీనవృత్తి
వసుధ నిటుగాదె స్థితిలేనివారి బ్రతుకు.

క. క్షోణీధర వీణాధర, శోణాధరలకును నిట్టి సొబగులుగలవే
క్షోణీశ్రోణీవాణీ, శ్రేణులకేనగావుజుమ్మ చిలుకలబలుకుల్.

గీ. బోటిగాదిది రతనాలపేటిగాని, చానగాదిది గొజ్జంగిసోనగాని
యింతిగాదిది మల్లెలబంతిగాని, కొమ్మగాదిది బంగారుబొమ్మగాని.
క. ఫుల్లాంబుజాక్షికాయము, వల్లియె పాదములు పల్లవంబులె గాకన్
మొల్లముగ నఖరకోరక, ముల్లలితములగుచు నెట్లుబుట్టునుదలపన్.
చ. స్థలజలజప్రభావిభవధాళధళీసుషమాప్రభేదముల్
ధళధళతాగ్రకోకనదతాళతళీకలితానువాదముల్
చలదళపల్లవోల్లలితచారుచకీరుచిరప్రమోదముల్
సలలితకాంతిపూరనవసారససారసనేత్రపాదముల్.
ఉ. తామరసాయుధప్రమదదంతికరంబులో గాక మన్మథా
రామసరస్తంభస్థలవిరాజితరంభలో లేక యిందిరా
సామజగామినీతనయ సత్కరభంబులో బోకలాలస
త్కామ సభాస్థలిం జెలగుగంబములోకనకాంగియూరువుల్.
గీ. పద్మబాణవైరిపద మింతిచనుదోయి, పద్మనాభుపదము పడతికొను
పద్మసూతిపదము భామినినెమ్మోము, పద్మపాణిపదము భామదృక్కు.
సీ. కలికిసుధాసారకాసారమే కాక
గన్నుదామరదోయి గలుగనేల
తరుణి మారుసిభద్రవంతావళమెగాక
గురుకుచకుంభముల్ గొరలనేల
చిగురాకుబోడి మేల్మొగలిపొట్టయె గాక
మేన సుగంధంబు బూననేల
కమలాయతాక్షి బంగారుబొమ్మయె గాక
పసిమిమేల్వన్నెలు పొసగనేల
యింతి మరుచేతిపువ్వులబంతి గాక
యారుతుమ్మెదబారు దా జేరనేల
నారయువచిత్రనవమృగాకర్షణాజ
శబరమాయాకురంగి యూసలలితాంగి.

గీ. కలికిగన్నులు శ్రుతిపారగములు నారు
శాస్త్రధారాగ్రరుచిరంబు సఖియ మేను
కలితజ్యోతిర్విలాసంబు కాంతతనువు
విద్యలమయంబు నమె యవిద్యగాని.

క. శ్రీలా కర్ణంబులు మఱి, రాలా పల్వరుస బొంగరాలా కుచముల్
మీలా గన్నులు మదనుని, వాలా నూగారు రాముపనితామణికిన్.

సీ. అని యిట్లుదెల్పగా నారాఘవుని దేవి
గొనిరాగ నూహించి వనమునందు
మారీచుగాంచి యమ్మాయావితో గూడి
తేరెక్కి గౌతమీతీరమందు
కింజల్కరంజితపుంజాంబుమాటున
నిలచి యమ్మారీచు నీచుబంబ
రంగుగ నతడు దా బంగరులేడియై
తిరుగ జానకీ దృష్టిపథము
నందు నిలచినజూచి యాసుందరియును
వేగబడుచుండ నటియించు బాగుమీర
మురియుముద్దులు జూపుచు దిరుగుచుండె
నదమలంబైన శృంగారసరణి మెరయ.

క. శంబరరుహాలోచన యా, శంబరమును జూచి దాని శాంబరికనువై
శంబరజప్రియకులుడగు, శంబరరిపువేషి రాముచ క్రుని కనియెన్.

సీ. వనమృగంబుల జూడ వాంఛించివచ్చిన
పార్వతీపతిచేతిపైడిలేడి
విశ్వంభరనుజూడ వేడ్కతోవచ్చిన
ముక్కంటితలపువ్వుముద్దులేడి
వీరభద్రుని ఘాటి వెరచి కాననమున
పెంపరిజారుజన్నంపులేడి

శిక్షకునోకమూలజిమ్మి వేబరు వెత్తు
గాలి హారువపు బంగారు లేడి
కావలయు నీమృగం బటుగాక యిట్టి
కాంతిలావణ్య శృంగారగరిమగలదె
గాన నాకిది గొనితెమ్ము మానవేంద్ర
రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర.

వ. మఱియును,

సీ. కన్ను లిందీవరగణతళ త్తళలీను
మొగము జంద్రికచకచ్చకలనాను
శృంగముల్ హరినీలశృంగారముల మీఱు
తనువు కాంచనధగద్ధగల దూరు
ఖురములు విపులార్ఘ్యమరకతప్రభ లొల్కు
గర్ణముల్ శశిరత్నకలన జిల్కు
బిందువుల్ నవవజ్రబృందాభలను గ్రక్కు
గర్భంబు శశికాంత కళల నొక్కు
నహహా యీ లేడి సొంపు మోహముల బెంపు
ముద్దులుగఱింపు మిక్కిలి ముదమునింపు
వేడుకఘటింపు కోరిక ల్విస్తరింపు
హరికులాధీశ దీని నా కలవరింపు.

వ. అనినవిని రామచంద్రుండు వల్లెయని దానిం బట్ట నుద్యోగించి ధను ర్బాణధరుండై చన లక్ష్మణుం డిట్లనియె.

క. మారీచుమాయసుమ్మీ, యోరాఘవ యిదియుగాక యుర్వీస్థలిలో నీరీతిమృగము గలదే, ధారాధరనీలధామ దైత్యవిరామా.

గీ. అనిన రాము డిట్టులనియెను సౌమిత్రి, దైత్యుడైనవేగ దారుణాస్త్ర నిహతుజేతుగాక నిజముగ లేడైన, బట్టిదెత్తు లేదె గొట్టిదెత్తు.

క. సీతారక్షణతత్పర, చేతోగతినుండు మిచట శీఘ్రము వత్తున్ వాతాయువు గొనితెత్తున్, భ్రాతా యనిపల్కి లేడిపజ్జన్ జనియెన్

క. తొరుచువడి పల్లంబుల, బొరుచు దరుమండ చండపరిసరసరణిన్
జేరుచు ఘనకుంజంబుల, దూరుచు రఘువీరు డరిగె దూరాటవికిన్.

క. పట్టంగ చేతికలవడి, నట్టుల గనిపించి దూరమరుగుచు మరి ని
ట్టట్టుల గికురించిన బడ, గొట్టెన్ రఘువీరుడంత ఘోరాస్త్రహతిన్.

క. వాలమ్ము దూశిపోయిన, హా లక్ష్మణయనుచు రాఘవాలాపముతో
గూలెడిరక్కసు గనుగొని, జాలింబడి రాఘవుండు సయ్యనమరలెన్.

క. ఆరాక్షసుపలుకులు విని, ధారుణిసుత మనములోన దల్లడబడుచుం
డోరమగుభీతి లక్ష్మణు, జేరంజని యిట్టులనియె జడిముడిపడుచున్.

క. ఓ లక్ష్మణ మీయన్న యె, హా లక్ష్మణ యనుచుబలికె నాలించితివే
జాలిబడి ఘోరరాక్షస, జాలముపాలయ్యె గావ సమయము నీకున్.

వ. అనినవిని సౌమిత్రి యిట్లనియె.

క. హేమాద్రి దిరుగబడినను, భూమిస్థలి సుతలమునకు బోయిన తారా
స్తోమములు నేలద్రెళ్ళిన, రామున కగ్గలిలేదు రమణీవినవే.

వ. అనినవిని సీత కోపించి యిట్లనియె.

ఉ. తమ్ముడొకండు ఘోరదురితమ్మున తల్లినిబన్ని రాజ్యభా
రమ్మొనరించి లోకవిదితమ్ముగ నిల్వెడలించినట్టి స
త్రమ్మునరుంచె నీవు సహితమ్ముగ తోడనివచ్చి శేషమా
కొమ్మకుగా జరించెదవు కుత్సిత సీత యసాధ్యయేరికిన్.

ఉ. అనవిని రాఘవానుజుడు హా శివయంచువచించి కర్ణముల్
ఘనముగగప్పికొంచు గరకంజపుటంబుల బల్కె నీవునా
జననివటంచు రాఘవుడు సద్గురుడంచు దలంచుచుండగా
ననుచితబుద్ధి పుట్టె నిది హానికి నీకని పల్కి దీనుడై.

క. రాముడువోయిన త్రోవను, సౌమిత్రియు బోయెనిదియసమయంబనిపూ
ర్వామరవర్యుడు వసితో, వేషమ మాయావిలాసవిభవ మెఱపన్.

సీ. కరమున రుద్రాక్షకటకముల్ చెవులను
మండితరుద్రాక్షకుండలములు

శిరమున భద్రాక్షవరకిరీటంబెడ
భూరి భద్రాక్షాళిహారసమితి
గటుకృష్ణమృగచర్మ పటమును బ్రేళ్ళను
దర్భపవిత్రసంతతులు హస్త
మున తీర్థకుండికయును గక్షమున బూల
సజ్జ సాలిగ్రామచయమును మెరయ
బేటికయు పంచగడ్డముల్ బెరగిచెలగి
జేత దండంబు గొని శివశివయటంచు
సౌమ్యగతివచ్చె నొక మునిస్వామియగుచు
రావణుండు సమిజ్జితె రావణుండు.

వ. ఇట్లు జని సీతంగాంచి యిట్లనియె.

క. ఎవ్వరిదానవు నీవే, రెవ్వతె దలిదండ్రు లెవ్వ రెవ్వడు నాథుం
డివ్వనభూమిని నుండుట, నెవ్విధియో నాకు దెల్పుమిందునిభాస్యా.

వ. అనిన జానకి యిట్లనియె.

సీ. సంయమీశ్వర నాకు జనకుండు జనకుండు
దగయాగధాత్రిము తల్లితల్లి
రహిరామధారుణీరమణుండు రమణుండు
మఱియాజిరాచందమామ మామ
కలితసాకేతంబు కాపురంబు పురంబు
వంశంబునకు విభావరుడు వరుడు
ఘనమూర్తియగుశక్తి ముని గురుండు గురుండు
భావింప సౌమిత్రి దేవదేవ
మాసవిస్తార మిట్టిది మానివర్య
యొక్కకారణవశత నిందుండవలసె
వల్లభుడు వచ్చి పూజించు నుల్లమలర
నమితసద్గుణగణ్యా యో యతివరేణ్యా.

వ. అనిన విని రావణుండు తరుణీ నీ వృత్తాంతంబు దెల్పితి నా వృత్తాంతంబు వినుము,

శా. లంకాధీశుడ భూరివింశతిభుజాలంకార శోభుండ ని
శ్శంకాకర్షితదేవకాంతుడమరుర్ఝుంకార హేమాంగుడన్
గంకాహారితశాత్రవుండ జలముక్కుంభానభోగుండ నో
పంకేజానన రావణాఖ్యుడ జగత్ప్రఖ్యాతచారిత్రుడన్.

వ. అనినవిని జానకీదేవి నివ్వెరబడుచుండ రావణుండు నిజాకృతిం బ్రకటించిన జూచి మూర్ఛిల్లియున్న నద్దేవిం గడ్డతోడన్, బెకలించి రథంబుపై బెట్టికొనిపోవుచున్న సమయంబున జానకి మేల్గాంచి,

క. రామామణి మొరలిడె హా,రామా గుణధామ సకలరాజలలామా
భీమా స్త్రీసీమ జగదభి,రామా నను గావు రిపువిరామాయనుచున్.

వ. మఱియును,

ఉ. ఓసురలార యక్షుపడరో మునినాయకులార వేగరా
రో సుగుణాఢ్యులార గనరో వనదేవతలారటన్న సీ
తాసతిదీనభాషలను దా విని యడ్డమువచ్చె వేగ
దివ్యాసినఖుండు భూరిబలవాయుజటాయురుదీర్ణకోపుడై.

క. అక్షోణిర్జరరక్షా, పీక్షాదీక్షాసనాథవృత్తిని జంఝా
పక్షానిలవిక్షోభిత, వృక్షోత్కరుడగుచు పక్షివీరుడు పల్కెన్.

శా. ఔరా రాక్షస పాపకర్మరఘురామాసన్నిధిన్ వేగ నీ
నీరేజాననగొంచుబోవదగునే నేనుండగా జెల్లునే
ఘోరాకారనఖప్రహారముల నీ గుండెల్ వగుల్జేతునం
చూ రాత్రించరుడన్నె హేమమకుటాంచద్రత్నము ల్డూలగన్.

వ. ఇట్లు విక్రమించిన నద్దశకంధరుండు కోపోద్దీపితుండై చంద్రహాసంబంకించి యప్పక్షిరాజు పక్షంబులు ద్రుంచిన నది నేలన్ బ్రాలుటయు సీత దుఃఖాక్రాంతయై రామదర్శనపర్యంతం బిప్పక్షిరాజు బ్రాణంబులు ధరియించుగాక యనియె నారావణుండును దత్కాంతాసహి

తంబగు రథంబు దానె వహించి నిశ్శంక లంక కరిగి ప్రమదావనాంత
రంబున శింశుపావృక్షమూలంబున జానకిం డించి రాక్షసస్త్రీల
గావలిపెట్టి పురంబున కరిగె నంత నిక్కడ,

గీ. దీనుఁడగుచును మరి కళాహీనుడగుచు
జిన్నబోయిన మొగముతో జెన్నుదరిగి
బెదరి బెదరుచు దనకును నెదురుగాగ
వచ్చు సౌమిత్రిగని రఘువరుఁడు వలికె.

గీ. అకట సౌమిత్రి జానకి నడవిపాలు
జేసి నీవిట్లు విడచి రాఁజెల్లునయ్య
యనిన రఘురామునకు దెల్పె వినయవృత్తి
ధరణిజాత దురాలాపసరణి నతఁడు.

వ. ఇట్లిద్దరు మరలి వచ్చి సీతారహితం బగు పర్ణశాలం గాంచి యం
దంద వెదకి తమ్మునితో రఘువీరుం డిట్లనియె.

గీ. ఏమిసేయుదు ననుజ ని న్నేమనందు
జానలేదాయె నీపర్ణశాలయందు
వనజభవుఁడిట్లు మనకును వ్రాసె ముందె
యనుచు జతికిలబడి రాము డార్తిజెందె.

గీ. హా లలనయంచు ఖండేందుఫాలయంచు
హా రుచిరశీలయంచు శ్రీహరియటంచు
గళవళించు నభంబును గౌగిలించు
నీరజేక్షణయంచు గన్నీరు నించు.

వ. ఇట్లు విలపించుచు మూర్ఛాక్రాంతుండైన సౌమిత్రి తొడలపై నిడు
కొని కొంతతడవునకు మేల్కాంచి వనంబున న్వెదకుచు, కుంజపుం
జంబు లరయుచు నిట్లనియె.

క. ఏమూర్ఖుండేమార్గము, నేమాట్కిని బల్మిగొంచు నేగెడితరి నీ
వేమంటివో నాముద్దుల, చామా నేనేమిసేతు నడినెటుసైతున్.

సీ. ఓరాజసముఖి నీరాజసంబెల్ల
హారాక్షసాళికాలయ్యె నయయొ
కోకిలవాణి నీ సౌకుమార్యంబెల్ల
నల్లరాకాసిపాలయ్యె నయయొ
బాల బాలాత్రేయఫాలనీసొగసుదై
తేయసంచయముపాలాయె నయయొ
యోశరజాక్షినీభాసుర రూపము
య్యాసురసమితిపాలాయె నయయొ
చాన మంజులసుగుణసంతాన నీదు
ఛాయ దానవచయముపాలాయె నయయొ
యేమిసేయుదు నింక నే నెందు జొత్తు
భామ రామాభిరామ సద్ధామ శేమ.

చ. అలుకజనించునట్టిసమయంబున నా భుజమందు నేనె వే
సిలిపి నఖక్షతంబిదియె నీ వొనరించితివంచు దెల్పెదన్
జెలులకటన్న భీతిపడి శీఘ్రమునన్ బ్రతిమాలునట్టి నీ
పలుకుల నాలకించుటకు బ్రాప్తముజెల్లెనె జానకీసతీ.

వ. అని వనిలోనికరిగి,

సీ. మాపాటలాధర కేపాటువాటిల్లె
నోపాటలీ నీవు నుడువగదవె
సీతాపభూటి తా నేతావుఁజెందెనో
చూతాగమా నీవు జూపగదవె
భూదారికారత్న మేదారిజనియెనో
గోదావరీ దెల్ప గూడదటవె
యాచారుముఖి గాన నేచాయపోయెనో
మోచాద్రి నీవైనజూచి చెపుము

సిద్ధులార మనోహరబద్ధులార
యక్షులార మయూరాదిపక్షులార
నదములార కనత్కోకనదములార
చన గానరె మీర లిక్కానలోన.

వ. అని మఱియును,

సీ. కుసుమకందుకనవ్యకుచములు కందునో
యంచు బిగ్గన గౌఁగిలించ వెరతు
మృదుశిరీషామలవదనారవిందంబు
వాడునోయనుచు ముద్దాడ వెరతు
నరుణపల్లవకోమలాధరాధరసుధ
చిందునోయని పంటనంద వెరతు
బాలసరంబులబోలు బాహులతలు
గారునోయని గోరజీర వెరతు
లలితలవలీదళద్యుతి వెలయుచున్న
చెక్కులను నొవ్వునోయని నొక్క వెరతు
నట్టిసుకుమారి గతినసురారిపాల
బడియె నే నేమిచేతు నేపగిదిసైతు.

వ. అని చింతాక్రాంతుండగు సీతాకాంతుని గని సౌమిత్రి యిట్లను రామ మనమివ్వనంబున నారామన్వేదకుదము రమ్మనిన విని వనిద్రి మ్మరుచు నమ్మనుజసింహులు నొక్కచో నేలంగూలియున్న గళ ద్రుధిరసాంద్రు బక్షీంద్రుంగాంచి రక్కసుండని కోదండం బధిజ్యంబు చేసిన నప్పక్షి రేఁడు గ్రక్కున నారాచముక్కల దొరకిట్లను నోచక్క నయ్యలారా! రావణుండను రక్కసుండు నీచక్కెరబొమ్మ నొక్కడు గని చన నక్కటాయని యడ్డపడి సన్నద్ధుండనై యుద్ధంబుసేయ రథ్యంబులుగూలె రథంబువిరిగెనని కోపించి నేను వృద్ధునగుట జంద్ర హాసవిద్ధుంజేసి దానె రథంబు వహించి నీకంజాక్షిం దోడ్కొని నిశ్శం

కలంకకరిగె, నిన్నుంగాంచితి నింక బ్రాణంబులు విడుతునని యప్పక్షి రాజు తత్క్షణంబున నసుమోక్షణంబు జెందిన నయ్యిందీవరశ్యాముం డమందదుఃఖసందోహుండై యతనికి నూర్ధ్వక్రియలు గావించి యోజనాయత బాహుబాధురుండగు కబంధునిభుజంబులు దునిమి యతని కతులపదంబొసంగి శబరిని గారవించి పంపాసరంబుగాంచి రాముడు లక్ష్మణునితో నిట్లనియె.

ఉ. అల్లదె సీతమోము కమలాకరమందున జూడు తమ్ముడా
వల్లభ చంద్రబింబమది వచ్చెయమైనను గన్ను లేమియా
ఫుల్లసరోజయుగ్మమది భూవర యైతె కచంబుమించునే
నల్లలితాత్మకై వలముసారసరాముడు దీనచిత్తుడై.

వ. అని మఱియును విరహాక్రాంతుడై మేనెఱుంగక యిట్లనియె.

ఉ. కాననమందు నుండుటకు గారణమేమొ, గురుండు బంగగా
డా, నెటుబంపె గైకవరదానగతి, న్నెవరిందువచ్చిరో
జానకి నీవు నే ననగజేంద్రనిభాననయేది,బోయె న
ద్దానవభర్తచేత చెరతమ్ముడ హాయికనేమి సేయుదున్.

వ. అని పలికింపుచు మఱియు,

సీ. చక్రవాకబకకోటచక్రతిత్తిరిఖేట
నక్రాదినీరాట నందితంబు
శతపత్రకల్హారశత పత్రరథవార
సితకత్రసంచార చిత్రితంబు
కమలచారు శ్వేతకమలకైరవజాత
విమలవాస్సంఘాతవిస్తృతంబు
సాలామ్రమల్లీరసాలామ్లజంబీర
వేలాదుచిస్ఫార వేల్లితంబు
పుష్పసారపయఃపూరపూరితంబు
రాజహంసాదికవిరాజి రాజితంబు

చారుతరభృంగసంగీత సంగతంబు
భాసురంబు జెలంగు బంపాసరంబు.

వ. ఇట్లుగాంచి యందు కృతస్నానులై ఋష్యమూకప్రాంతంబునకు జనం జన సుగ్రీవుండు వారలంగాంచి పవననందనున కిట్లనియె నావచ్చు వీరవరులంజూచితే వీరలు వాలివారలని శంకించెద నీవేగి యరసైన గరసంజ్ఞ చేయుమని పంపిన నతండు వర్ణియైవచ్చి యారాఘవులకు గాంచి యిట్లనియె.

సీ. జడఖురత్వంబులు విడనాడి పుడమిపై
జరియించు చంద్రభాస్కరులనంగ
బవిరథాంగంబులు దివినుంచివిహరించు
విలసదింద్రోపేంద్ర విబుధులనగ
బదరీవనముబాసి పొదలుచుండిననర
నారాయణాభిఖ్య వీరులనగ
గాననంబున వేడుకకు సంచరించగా
జతగూడుకంతువసంతు లనగ
వరలుచున్నారు జూడ నేవసుమతీశ
నందనులో మీారలివ్వనమందు దిరుగ
గారణంబేమొ మునివేషకలితులగుట
కేమిహేతువో దెలుపుడీ సాములార.

వ. అనిపుటియును,

సీ. కరతలచక్రరేఖాలక్షణముగన్న
భూవల్లభుండన బుద్ధిపోచు
రాజీవపాణిరారాజకృత్యతులుగన్న
రాజశేఖరుడన్న నెంచిహించు
బ్రకటితాంగప్రభాభాసురస్థితిగన్న
నధికదేవోత్తము డనగజెల్లు

ఘనకళాచాతురీగరిమ గనుంగొన
 వినుత లోకేశ్వరు డనఁగనొప్పు
నహహా నిను గని మునియన నలవియగునె
నవ్యగుణమణి వలలోకనాయకుఁడవు
శ్రీలలితమూర్తి యార్యాభిసేవితాత్మ
నిరతరుచివాస లలితవాణీవిలాస.

సీ. ఘనమూర్తి నీవాలుగన్నులు గనుగొన్న
 మాత్స్యాధికాకృతి మహిమ దనరు
భాసురనీలసత్పాదాగ్రరుచిగన్న
 కూర్మనాథాకృతి బేర్మి నెరపు
దనుమహత్వవిలాసతను మదిగనుగొన్న
 భూదారవరబుద్ధి పొలుపు గరపు
మహానియ్యతరతనుమధ్యంబు గనుగొన్న
 నరసింహవైఖరి గరిమ నెరపు
మందయానవిలాసంబు చందమరయ
గలితవామనమహిమంబు గానబడును
శ్రోణిగతిగన్న భృగువరస్ఫూర్తి దనరు
నట్లుగాన మహీపతి వగుట నిజము.

వ. అని యిట్లుబలుకుచున్న గపటభిక్షుం గాంచి రాఘవుండు లక్ష్మణుని తో నిట్లనియె.

ఉ. సామములోని ఖండములు చాపయజుశ్రుతిలోని యంశముల్
శ్రీమదథర్వభాగములు సిద్ధఋగుజ్జ్వలవాక్యముల్ ఫణి
స్వామికణాదగౌతమవచఃపతిపాకము లెన్నిచూడ మే
లీమహనీయుభాషణము లీతఁగంటిమి బాసె గ్లేశముల్.

వ. అని మఱియు నతని నుద్దేశించి యిట్లనియె.

క. నరమూర్తివో హరిమూర్తివో, మఱిసురవరమూర్తివాదో మామకదుఃఖో
త్కరఘోరశరధితరణా, స్ఫురదురుతరమూర్తివో విశుద్ధచరిత్రా.

వ. కాన నీకుల గోత్రంబులు దెలుపుమనిన నతం డిట్లనియె.

క. దినకరతనయునిసచివుఁడ, ననిలతనూజుండ హనుమదాఖ్యుఁడ గపటం
బున భైక్షుకవేషము, దాల్చినవాఁడను దూతకార్యసిద్ధికి గాఁగన్.

క. మిత్రతనూజుఁడు మీతో, మైత్రి నపేక్షించి మీఁదుమున మఱయుంగా
ధాత్రీశ బనిచె నన్నీ,గోత్రంబుననుండి యిటకు గురుతరబుద్ధిన్.

వ. అని పలికి యుష్మద్వృత్తాంతంబు విననగోరెద ననిన రాముని కను
సన్న లక్ష్మణుం డిట్లనియె.

ఉ. రాజిలుచుండు బంక్తిరథరాజు సురక్షిత దేవదేవతా
రాజు యశఃప్రకాశజితరాజు మహాబలధూతధారుణీ
రాజు విరాజమానరుచిరాజిపరాజిత బాలపద్మినీ
రాజు విలాససాంగరతిరాజు ధరాతలి గోసలంబునన్.

గీ. అతని కగ్రసుతుండు నా కగ్రజుండు
రాము డుచిత సుగుణాభిరాము డతఁడు
నన్ను లక్ష్మణుఁడండ్రు దన్నారిసీత
మేము ముగ్గుర మివ్వనసీమమునకు.

క. గుర్వాజ్ఞన్ వచ్చితిమి సు, పర్వారిదురాత్ముఁడేమ బాసినయెడదా
నుర్వీజగొంచు జన నీ, పర్వతములదరులదరుల బఱిలిన వెనుకన్.

వ. మఱియు నందందవెదకుచు గబంధుని యోజనాయామబాహు పాశం
బుల జిక్కువడి తద్భుజంబుల న్నఱకుమ నతండు గంధర్వుండై దివం
బున కరుగుచు మీరలు సుగ్రీవునిగాంచిన సీతావృత్తాంతంబు విశద
మగునని దివంబునకుం జనియె. గావున నిటకరుదెంచితి మన నట్లైన
నా భుజంబులమీఁద గూర్చుండిన మిమ్ముల నాసుగ్రీవుని గూర్తునని
హనుమంతుండు రామలక్ష్మణుల నిజభుజంబులపై నిడుకొని సుగ్రీవు
పాలికిం గొనిపోయి తద్వృత్తాంతంబంతయు నతనికి విన్నవించిన
నతండు బ్రహృష్టహృదయుండై రాఘవున కిట్లనియె, దేవా నీసఖ్యం
బుగోరెదనని నతం డా గాకయుని,,

క. ధన్యులు రవిసుతరాఘవు, లన్యోన్యము గౌగిలించి రాప్తతతో సౌ
జన్యంబు మెరయ ఘణిరా, జన్యోపమబాహువులునుజాచుచు బ్రీతిన్.

వ. ఇట్లు గౌగిలించుసమయంబున బావని బవనసఖుం బ్రజ్వలింపం జేసిన రామ సుగ్రీవులు వహ్నిసాక్షికంబుగా సఖ్యంబుజేసిన సుగ్రీవుం డిట్లను నోరఘుమణీ! మీావనవాసంబునకు గారణంబేమి యని యడిగిన నతండు సర్వంబు నెఱింగించి నీ వీఋష్యమూకంబున నుండుటకు గతంబేమియని యడిగిన నతండిట్లనియె.

క. వాలి మహాభుజవిక్రమ, శాలి మదగ్రజుడు ప్లవగచరరాజ్యము దా
బాలించుచుండె నే నా, వాలివచస్సరణిచే బ్రవర్తిలుచుంటిన్.

వ. అట్లుండ,

క. మాయావి యనెడురాక్షస, నాయకుడరుదెంచి పిలచె నవభోగేంద్రున్
శ్రీయుతు వృక్షచరేంద్రు భు,జాయుతబలసాంద్రు నిశనియాలంబునకై.

ఉ. ఆరవ మాలకించి ప్రబలాగ్రణి వాలి సురారిమీాదికిం
బారగ నేనుగూడ జవ బ్రల్లదుడై సురవైరి భీతివి
స్తారముచే మహేంద్రగుహాసయ్యవజొచ్చిన వాలి నన్ను ద
ద్వారమునందు నుండుమని తాను నుతద్గుహజొచ్చె నుగ్రుడై.

ఉ. మాసముదాశరాక నసమానబలంబున బోరొనర్చి య
వ్వాసవవైరి నంచుబడవైచిన రక్తఝరంబు బర్వ నే
వాసవసూతి నొచ్చెనని వాతకుశైలము నడ్డబెట్టుచున్
వాసము జేర మంత్రు లట వానరరాజ్యప్రసక్తు జేసినన్.

వ. ఉండుతరి,

గీ. అంత గొంతకాల మరుగంగ నవ్వాలి
వాతరాయి పాద ఘాతమునను
దూలదన్ని పురికి దోతెంచి ననుగాంచి
వెళ్ళదోలె నాదు వెలదిగొంచు.

వ. మఱియు నిచ్చటనుండుటకు గారణంబెఱింగించెద జిత్తగింపుము.

క. దుందుభి గళరవజితసుర, దుందుభినాముని యుద్ధదోహలమగిసం
క్రందననందను బిలచేఁ, మందరసముదగ్ర ఘోరమహిషాకృతియై.

గీ. శక్రనందనుండు సయ్యన బరతెంచి
ఘోరదైత్యు నేల గూలదన్ని
శిరము ద్రుంచి యొక్కచే ఋష్యమూకాద్రి
పైకివిసరె బాహుబల మెలర్ప.

గీ. అట్టితల మతంగునాశ్రమంబున బడ
గాంచి మౌని కోపకలితు డగుచు
మొనసి వాలి ఋష్యమూకంబుద్రొక్కిన
జచ్చుగాక యనుచు శాప మొసగె.

వ. తన్నిమిత్తంబున నిర్భయముండవగుచునిట నుంటివనినమఱియు నిట్లనియెను.

సీ. భోగిభోగాయతభూరిభుజోత్క్షిప్త
వరవసుధాభృద్ధవాలి వాలి
విపులవాసుకి గుణావేష్టితత్స్మాధర
వైశాఖమధితార్ణ వాలి వాలి
గత్ప్రావటస్థలగడుకుఠీరితపంక్తి
వదనప్రముఖదానవాలి వాలి
చారువిక్రమకళాజవనిర్ధళీకృత
తాళగోత్రాసంభవాలి వాలి
యట్టివాలియెదుట నెట్టివీరవరేణ్యు
లైన నిల్వజాల రైనగోత్ర!
యేమిచెపుదు వాని భీమపరాక్రమ
ధామచరితములను రామచంద్ర.

వ. అనినవిని రాఘవుం డిట్లనియె.

ఉ. వాలియె కాని వానిగని వర్తిలుచుండిన ఘోరవజ్రదో
శ్శాలియె కాని తన్నునవిశంబు భజించుటదోడువచ్చుద

చూఁపాలియెకాని వచ్చినను శూరతచే బడగొట్టి వేగ త
త్పాలితరాజ్య మిచ్చెదను భానుజ నీకిది నమ్ము నెమ్మితోన్.

వ. అనినవిని సుగ్రీవుం డిట్లను దేవ మఱియు నొకవిశేషంబు దెల్పెద నవధరింపుము.

క. గిరిశిఖరస్థలములఁగలు, గురుమంత్రులతోడ నేను గూర్చుండ నిశా
చరనీతసీత క్రోశ, త్కురరిగతిన్ విపులశోకకుంఠితయగుచున్.

గీ. రామరామ వేగ రావేయటంచు
హాలక్ష్మణా యటంచు లాలితాంగి
తొడవులెల్ల మూట గడునొప్పబంధించి
వడి మదగ్రసీమ వైచి చనియె.

వ. కావున వానిం జూపెద జూడుమని తెచ్చియిచ్చిన జూచి రాఘవుండు మూర్ఛ జెంది కొంతదడవునకు మేల్కాంచి లక్ష్మణునకు జూపి య య్యుత్తరీయశేషంబు వక్షంబున నిల్పుకొని యిట్లనియె.

సీ. పాలయల్కజనియించి తలగిపోయెడువేళ
నలరుబోడికి దల్ప మగుదుగాదె
కమలపాణికి మేన శ్రమజలంబులనార్ప
నమలమౌ వీవన నగుదుగాదె
సీతకు నపరవిద్యోతకాంతియొనర్ప
నాతపవారణం బగుదుగాదె
జలజాక్షికుచకుంభములకు నెల్లప్పుడిం
పలరద్విధాకృతివగుదుగాదె
యట్టినీ వెట్లు బాసితి వబల నిపుడు
వరలుదయ నను గనుగొనవచ్చినావె
చిత్రకాంచననవశతపత్రపత్రి
చంచదంచలవరచేల సాధుశీల.

వ. అని విలపించుచున్న రాఘవు నూఱార్చి సుగ్రీవుండిట్లనియె.

క. లోకేశ వినుము నీసతి, జేకొనివచ్చెదను నేను శీఘ్రము దివిష
ల్లోకముననున్న గుండలి, లోకంబుననున్న, లంకలోపలనున్నన్.

వ. అనినవిని సంతసించి రాఘవుండు, నీకుం బగతుండగు వాలింగూల్చెద
నన్న రాఘవా! వాలి మహాబలశాలి, యతండు విసరినదుందుభికంకా
లకూటం బచటనున్నది దానిం దూలించితివేని వాలింజంపెదవని నమ్మె
దననిన రామచంద్రుండు దానింబాదాంగుష్ఠంబున దశయోజనంబు
లుదూలించిన సంతసించి మఱియు నాసుగ్రీవుండు సప్తసాలంబుల
నిష్పత్రంబులుగా నతేంయూచుననిన రాముండొక్కబాణంబు చాపంబు
న సంధించి విడచిన నది తాళభేదనంబుచేసి తత్సమీపశైలంబు భేదిం
చి రసాతలంబునకరిగి మరలివచ్చి తూణీరంబు జొచ్చినంజూచి సుగ్రీ
వుండు చేతులు జోడించి రామునకిట్లనియె.

సీ. మహిమాప్తికాపేక్షమనుద్రవ్వవారికి
తోరంపు పెన్నిధి దొరకినట్లు
గజదింథవాపేక్ష గానకేగినవాని
కలకల్పదర్శనం బబ్బినట్లు
జలనిమీనులబట్ట సమకట్టువానికి
కృథుమణిరాశి లాభించినట్లు
వితతతృష్ణకు నీరు వెదకెడువానికి
గంగాపయస్సిద్ధి గాంచినట్లు
నెఱయ సంసార వారిధి జొఱఁగగోరు
నాకు నిప్పుడు సనకసనందనాదు
లందజాలని నీసేవపొందు దొరకె
వాలిపగయేల సంసారజాల మేల.

ఉ. ఆయతబాహు పార నిను నజ్ఞత బల్కినతప్పు గావు నీ
మాయను దాటలేక నను మన్ననసేయుము సేవకుండ నా

ధ్యేయగుణమూర్తివీవు రఘురామ యెఱింగితి నోజగత్త్రయీ
నాయక దివ్యసాయక వినాయకవాహన మోక్షదాయకా.

వ. అని పల్కుచున్నసమయమున రామచంద్రుం డతనిచేతను వైష్ణవమాయ గావించి దరహాసభాసురముఖుండై భానుజ! నీవాక్యంబులు నిక్కంబులై నను మిత్రుండవగుట నీకు నే యు ప్రతిజ్ఞాభాషణంబులు మిథ్యావిశేషంబులు గాకుండ మన మవ్వాలిమీదికి నరుగుదము రమ్మనుమని కరంబుగొని లక్ష్మణాంజనేయాదిసమేతంబుగా గిష్కింధాబహిఃప్రదేశంబునకరిగి యచ్చట నొక్కమంజరీరజఃపింజరీభూతవంజులనికుంజంబుమాటున నాదర నిలిపి యంశుమాలితనూజు వాలి బిలువబంచిన నతం డరిగి సింహనాదంబు జేసిన బురందరనందనుండు మందిరంబు వెలువడివచ్చి సుగ్రీవుదాకిన నిద్దరకుద్దవిడి మహాయుద్ధం బయ్యె నాసమయంబున రాఘవుం డాకారవిశేషంబుల నేకాకృతియగు వారలలో వాలిం బోలుపజాలక యూరకున్న సుగ్రీవుండు పలాయితుండయ్యె వాలియు గిష్కింధాపురంబున కరిగె నాసమయంబున సుగ్రీవుండు రాముసన్నిధికిం బరతెంచి కర్ణనాసాపుటంబుల స్ఫుటంబుగా జారురక్తంబు దుడుచుకొనుచు రామునితో నిట్లనియె.

క. మిత్రకులతిలక నేనీ, మిత్రత నెరనమ్మి వాలిమీది కరిగితిన్
శత్రుత గలిగిననీవే. పత్రిం బడగొట్టరాదె భాసురవృత్తిన్.

వ. అనిన రామచంద్రుం డిట్లనియె.

క. నేత్రంబులు శ్రోత్రంబులు, గాత్రంబులు గళము లేకగతినుండుట నే
పత్రిన్ విడువకనుంటిని, మిత్రఘ్నత వచ్చుననుచు మిత్రతనూజా.

వ. అనిపలికి సుగ్రీవు నాలింగనంబుచేసికొని లక్ష్మణా యీతనికొక యొఱుక గలుగజేయుమనిన లక్ష్మణుండు సుగ్రీవుగ్రీవాస్థలి గజపుష్పమాలవైచిన నతండు వాలిని మరల నాహ్వానంబు చేసిన నదివిని యతండు,

ఉ. చిత్తము బాహువిక్రమవిశిష్టనితాంతమదాంధగంధసు
ర్వృత్తము గాన శంకిలక వీరవరేణ్యుడు వాలి బోవగా
దత్తరపాటుతోడ వడిదారతనుమ్యతితార గీశవీ
రోత్తము నడ్డపెట్టి మధురోక్తుల నిట్లనిపల్కె భీతయై.

గీ. ఇపుడ సంగరవిజితుడై యిపుడ తిరిగి
వచ్చెసుగ్రీవు డింతటివాడె దేవ
చండకాండసమిత్కళాపండితుం డొ
కండు దండిసహాయుడై యుండబోలు.

వ. అదియునుంగాక,

క. రాజకుమారులు రుచిబల, రాజకుమారులు విలాససంజనకములా
రాజకుమారులు నలినీ, రాజకుమారునకు దోడురా వింటిసుమీ.

వ. కావున సుగ్రీవుమీది కిప్పుడు జనవలువదనిన వాలి యిట్లనియె బరా
హూతుండై వీరుండూరకుండుట దీరుగాదు తోడువచ్చినవారూరక
నాపైకిరారు వచ్చిరేని సుగ్రీవుని మార్గంబులన్ జనుదురుగాక
నీవింటనుండు మని తారను వీడ్కొని వచ్చి సుగ్రీవునితో నప్పుడు,

క. బాహాబాహి దలాతలి, నాహవమొనరించి రవ్వ డర్కతనూజుల్
సాహసమడరంగ నమి, ద్ద్రోహులై విక్రమోరుదోస్సారములన్.

వ. అపుడు రాఘవుం డమోఘబాణంబున వాలివక్షంబు గాడనేసిన,

గీ. అంత మూలఘాతమయిన మహోత్తాల
తాలతరువులీల నేలవ్రాలె
వాలి శూలిఫాలకీలిచే గూలిన
త్రిపురగోపురంబు తెరగు దోప.

వ. అంత కొంతదడవునకు వాలి విసంజ్ఞుండై యుండి కొండొకసేపునకు
దెలసి యెదుట శరశరాసనధరుండై సంచరించుచున్న రాఘవుంగాంచి
తా దాని జేసినతుండుగావున రఘువరుండుగా నెఱింగి యిట్లనియె.

క. నే నేమికీడు జేసితి, దా నేమి నుటించె మేలు తపనజు ధరయన్
భూసుత రఘుకులకీర్తిని, జేయునను గళముసుగూర్చె తినకులతిలకా.

క. దొంగపని చేసినాడవు, సంగరమున నెదుటబడిన జంచద్బలదో
స్సంగతిజూతు నికెందుకు, భంగపడితి తారమాట పాటింపమిచే.

క. మృగయారతి నేసితివన, నగచరమాంసం బభక్ష్య మటుగాకను నీ
సుగుణములు సీతతోడగ్, మగుడెం గాబోలు జూడ మానవనాథా!

వ. అనిన విని దాశరథి యిట్లనియె.

క. తేజమున ఖలులద్రుంచుట, రాజితగతి సాధుజనుల రక్షించుట, ఘో
రాజిని రిపులజయించుట, రాజుల కిదిపాడి తరుచరాగ్రణి వింటే.

క. సోదరి గోడలు గూతురు, సోదరుసతి తుల్యు లందు సోదరపత్నిం
గాదనక కూడినాడవు, మీదెఱుగక యిట్టిపాప మొందుదు గలదే.

వ. కావున నిను గూల్పవలసె ననిన విని వాలి యిట్లనియె.

క. గురునాజ్ఞబూని మునివై, ధరణి విసర్జించి కాన దగిలిననీకున్
నరనాథ ధర్మమెక్కడ, భరతుడు శిక్షింప ధర్మపదమగు సుమ్మీ.

వ. అనిన విని లక్ష్మణాగ్రజుండు భరతుననుమతి నిట్లు సేయవలసె ననిన విని వాలి నవ్వి సుగ్రీవుసహాయాపేక్ష నిట్లు జేసితివిగాని ననుం బంపితేని,

ఉ. దేవవిరోధికామినులు దీనతతో గనుగొంచునుండగా
రావణుతోడ ఘోరమగు రాక్షసవర్గముతోడ దత్త్రికూ
టావనిభృద్వరాధిశిఖరాగ్రముతో ఘనలంకదెచ్చి నే
ఝ్మావర! నీదుపాదయుగసారససన్నిధి గట్టిపెట్టనే.

వ. అని మఱియు నొక్కింత నిరీక్షించి యిట్లనియె.

గీ. అబ్జలోచన! ప్రాణప్రయాణసమయ
మందు నెవ్వనినామము డెందమందు
దలచి మర్త్యుండు గాంచును దత్పదంబు
నట్టినీమ్రోల తదవస్థ నందగంటి.

క. నాపుణ్య మేమిచెప్పుదు, నోపుణ్యజనారి ! వారిజోద్భవముఖ్యుల్
బ్రాపింపలేని యుష్మ, చ్ఛ్రీపాదరజంబుగాంచి చెలగితినెమ్మిన్.

వ. అని పల్కి మఱియు నిట్లనియె నో రాఘవా! మత్తుల్యబలుం డంగదుండు యుష్మత్కార్యసహాయుండుగావున వానిం గటాక్షింపుమని సుగ్రీవుం బిలచి సుగ్రీవ! దశగ్రీవువధార్థంబు నడుచు రాముని కార్యం బే మరకు మని చెప్పి మహేంద్రుండిచ్చిన గనకకుసుమమాలిక దమ్మున కొసంగి, రామునిం గాంచి రఘువీర! నీపాదపద్మం బురంబున నుంచి ప్రాణంబుద్ధరింపుమనవుడు రామచంద్రుండట్లు చేయు రాముని మోము నిరీక్షింపుచు బ్రాణంబులు విడచె నంత నవ్వాలివాలుగంటులు విలపింప రాఘవుం డూరార్చి వాలి కూర్ధ్వలోకక్రియలు జేయించె సుగ్రీవుని గిష్కింధారాజ్యమునకు లక్ష్మణునిచే నభిషిక్తుం జేయించె లక్ష్మణసహితుండై ప్రవర్షణగిరిగుహాంతరంబున నుండునట్టి సమయంబున,

సీ. వనదాళిసిర్మ్ముక్త వనదారితాతిధా
    వనదావమోవితవనమృగంబు
జలమానసముద్భాతి కలమాదివరసస్య
    వలమానధారణీవిలసితంబు
జాచలాతతిభాసదంచలాలోకన
    చంచలాంతరఫణిప్రాంచితంబు
బుష్కరాంతరలసత్పుష్కరాద్రివిముక్త
    పుష్కరాతతసరిత్పుష్కరంబు
గరము వర్షితకరము శ్రీకరముముదిత
నరము బ్రవహితఘురముభాస్వరమువారిద
భరము వర్ధితశరము దంపతిమనోజ్ఞ
కరము విలసిల్లె నట వార్షికావసరము.

వ. అట్టిసమయంబున దశరథుపట్టి లచ్చిపట్టి ధట్టించి వైచుగట్టి తూపులకు బిట్టుమూర్ఛిల్లుచు నెట్టన దెలివిగాంచి సీతావిరహజాతానలంబున

వీతాంతరధైర్యుండై మందవాతాదిమాసభటధూతాశయుండై ది
నంబులు గడపుచుండునంత,

సీ. శరజాతిపరిహీనశరజాతనవసిత
శరజాతపాండురశరధరంబు
కమలాతినిర్మలకమలాభిభూషిత
కమలాకరప్రభాసుమహితంబు
హావజాలనృపమహాహావజాలసుమశరా
హావజాలముఖ్యకాలాహ్వయంబు
కువలయప్రియకారి కువలయప్రియకారి
కువలయప్రియకారి గురుతరంబు
డంబుప్రకటితసితపులినంబు రాజ
హంసపునరాగమంబు సీహారసముద
యంబులీననదీప్రవాహంబు రుచిర
దంబు రాజిల్లె భువి శారదాగమంబు.

సీ. అత్తరిరఘువీరు డనుజాతో నిట్లను
జూచితే లక్ష్మణ సూర్యసుతుడు
మనల భోగాంధుడై మరచెను నీవేగి
భయపెట్టి తోడ్కొని రయముమీర
రమ్మని పంపిన రామానుజుండేగి
కిష్కింధవాకిట గెరలినవ్వు
ప్రోయింప వానరముఖ్యులు భీతిల్లి
పరవంగదధ్వని నరసి పవన
సూతితారాంగదులు గడుభీతిజెంది
రవిసుతున కంతదెల్ప నారవిసుతుండు
శాంతుగాజేసిమీరు విశాంతమునకు
దనర లక్ష్మణు దోడితెమ్మనుచు బనుప,

క. వారలు జని లక్ష్మణుపద, సారసములకెరగి భక్తి సలుపు చువినయో
దారమతి నతని రాజా, గారమునకు దెచ్చిరపుడు ఘనమతిమెరయన్.
వ. ఇట్లతని తోడితెచ్చి,
క. రవిసుతునకు నెఱిగించిన, నవితకొడుకు రాఘవానుజన్మునిపదగో
భవములకు మ్రొక్కి రాఘవు,డవిపుతు గౌగిటను జేర్చె నానందముతోన్.
వ. ఇట్లున్న సమయంబున లక్ష్మణుండు రాఘవునాజ్ఞ దెలిపిన దక్షణంబ,
క. పావని మొదలగు మంత్రుల, తో వానరవీరవరులతో వరభేరీ
రావములతో రథంబుల,తో వాలవ్యజనయుగముతో గొడుగులతోన్.
క. కూడుకొని వెడలి వేగము, వాడిమయూఖములుగల్గు వానికుమారుం
డీడితబలుడగు రఘుకుల, చూడామణి గాంచి భక్తిసాంపలరారన్.
వ. ఇట్లువచ్చి సాష్టాంగదండప్రణామం బాచరించిన,
క. హరికులభూషణు డప్పుడు, హరినందను గౌగిలించె నానందమునన్
దరచక్రచాపరేఖా, కరములుదరములును జాచి కారుణ్యమునన్.
వ. ఇట్లుగారవించిన సంతుష్టస్వాంతుండై సుగ్రీవుండు రామచంద్రునితో
నిట్లనియె.
క. నానాస్థలములనుండియు, వానరభటసేనలెల్ల వచ్చెనుగాగన్
జానకివెదకగబంపుము, భానుకులకలాప త్రుటితపశుపతిచాపా.
వ. అనిపలికి రాఘవానుమతి సుగ్రీవుండు సీతాన్వేషణార్థంబుగా వానర
వీరవరులన్ నలుదిక్కులకు బంపనియమించి వారిలో దక్షిణదిశకు
నంగదాంజనేయ నలనీలజాంబవదాదుల బంపునపుడు రఘువీరుండు
హనుమంతునిచేతికి నిజకరాంగుళియ్యకంబొసంగి నీ వీకార్యంబునకు
నిదానభూతుండవనిపలికి బంపె నంత వారును గతిపయప్రయాణంబు
లునడచి స్వయంప్రభగుహా గతాగతంబు లొనరించి విహీనధైర్యులై
ప్రాణంబుల నాసవిడచి యిట్లని వచించిరప్పుడు,
సీ. అహాహా ! తాను జటాయు వధికపుణ్యుడు రామ
కార్యార్థమై దశకంఠుతోడ

సంగరంబొనరించి సయ్యనస్త్రాణముల్
విడచి వే రఘురామవిభునిపట్టి
మోక్షసంగతుడయ్యె మొనయుచు మనమంద
రము మిన్నకయ ప్రాణరహితవృత్తి
జెందవలసెను సూర్యనందనుం డుగ్రోరు
దండుడనంగ దత్కాలమందు
వారిభక్షింపవచ్చి సంపాతియనెడు
పక్షిరాజు జటాయువువార్తవినుచు
సంతసింపుచు దగవారిచెంతకరిగి
పలికె మీరెవ్వరయ్య కృపాళులార.

వ. మదనుజుండగు జటాయువు మీరెట్లెఱింగితి రన, వారలు తద్వృత్తాం తంబంతయుదెల్పినన్విని మీకు సీతావృత్తాంతంబుదెల్పెద నేను పక్ష హీనుండనుగావున నన్ను సముద్రోదకంబుల స్నానంబుజేయింపుడనిన వార లట్లుసేయుడు సంజాతపక్షుండై యప్పక్షిరాజాంతరిక్షంబునకెగసి వీక్షించి మరలవచ్చి సీత లంకలో రావణోద్యానవనంబున శింశుపా వృక్షమూలంబుననున్నయది కావున సముద్రలంఘన సమర్థుండు చూచి రావలయునని చెప్పి, నేనును రావణవధార్థంబు గడంగవలయునుగాని ముదిసినవాడనని చెప్పి చనియె నంత వాలిసుతుండు సముద్రలంఘనా ర్థమై నిజబలంబు లెక్కింగింపుడనిన వానరులు దమతమ కొలందులెక్కిం గించి రట్టిసమయంబున జితాక్రాంతుండగు వాలిసుతునకు జాంబ వంతుం డిట్లను నీకు సముద్రంబుదాటెడి వీరోత్తముజూపింతునని యాజ్ఞ నేయున కిట్లనియె.నీపూరక వినుచుండుట ధర్మంబె జగత్ప్రాణ నందన సముద్రంబుదాటి సీతం గాంచివచ్చి మాకు బ్రాణదానంబు జేయుమనవుడు హనుమంతుం డుత్సహించె ననిన విని వామలూరుభ వుండు నారదుని నవలికథ యడుగుటయును,

చ. నవనవలాలసత్ప్రతిభ నానటదీశజటాతటీలుఠ
ద్దివిజతరంగిణీజనిత తీవ్రతరోరుతరంగసంగతి
ప్రవిమలనీరఫేనఘన భాసురకాంతిమలిమ్లుచోజ్జ్వల
చ్ఛవిలసమానకీర్తిఘన సారపురాతనరాజసన్నిభా.

గీ. దానవిజితాంగభూపాల గానలోల
కనకమయచేల సజ్జనవినుతలీల
యమలగుణజాల నిరతదయాలవాల
నరసభూపాల ఖలకాల సరసలీల.

—: గద్య :—

ఇది శ్రీ మదుమామహేశ్వరవర ప్రసాదలబ్ధ సరసకవితాసామ్రాజ్య
సుకవిశేఖర కౌండిన్యసగోత్రపవిత్ర సోమశేఖర ప్రణీతంబైన
శ్రీనరసభూపాలరాజీయంబను శృంగారరస ప్రబంధంబు
నందు తృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీసీతారామార్పణమస్తు శ్రీ శ్రీ శ్రీ.

# నరసభూపాలీయము.

## చతుర్థాశ్వాసము.



శ్రీరమ్యహారహీర ప
టీరశరచ్చంద్రకిరణడిండీరశర
న్నీరదసురహరిపారద
నారదసత్కీర్తిజాల నరసనృపాల.

వ. అవధరింపుము హిమశైలాత్మజాధవునకు నారదుం డిట్లనియె నట్లయ్యాంజనేయుండు సముద్రంబుదాట నుద్యోగించి యంగదాదుల కిట్లనియె.

క. శతయోజనాయతంబగు, తతనక్రాలయము వార్ధిదాటెద రఘుభూపతిచాపముక్తబాణా, కృతినంచు వచించి మఱియు గీశులకనియెన్.

క. భూకన్య జూచివత్తున్, లేకున్నను లంకద్రవక్కలించి చిటుతెత్తున్
గాకున్న రావణాసురు, దోఃసంబాధించితెత్తు దోఃస్సారమునన్.

వ. అనిపలికి గగనంబునకెగసి పోవుసమయంబున,

సీ. విపులఝంఝూమారుతావవేగవిక్షేపిత
గురుతరమార్తాండ ఘోటకములు
సంవర్తవర్ధితజలదసంభవమేఘ
నిర్ఘోషశతకోటి నిస్వనములు
గురుదరీఘటితభాంకరణరావజాయు
భేరీకృతానేక భూరిగిరులు
పథికానుగతబంధుబంధుర పశ్చిమ
భాగానుయాతోరు పాదపములు
జవసముద్ధూతసురయానసముదయములు
చలితమూలమహాన్వయక్ష్మాధరములు.

పవనతనుజాత తనుజాత పవనతతులు
వీచె ఖచరత్పయోనిధి వీచులగుచు.

సీ. ఆసమయంబున నమరసం ప్రేషిత
సురసాభిధానయా సుదతియోర్తు
వచ్చియడ్డముసొచ్చి వాయుజుతోఁబల్కె
నాకొంటి మన్ముఖమందు నీవు
జొరుమటుగాకున్న బరగ మ్రింగెదనిన్ను
ననినబావనియిట్టు లనియె మాత
రాముకార్యముదీర్చి వేమరువచ్చెద
నన నట్లు గాదన నైతె మ్రింగు
మనుచు దశయోజనాయతమయినతనువు
దాల్ప వింశతియోజనాయతవదనము
దెరువ నది వాయుసుతుఁడు దద్ద్విగుణితాంగు
డైననదిజూపె దత్త్రిగుణాస్యమపుడు.

వ. ఇట్లు దెరచిన పాతాళసన్నిభంబగు దాని వదనంబుగాంచి యంగుష్ఠ
మాత్రుండగుచు నందుఁబ్రవేశించి మరలవచ్చి మాత నీముఖంబు
జొచ్చి వచ్చితిననిన నది యాశీర్వదించుచు దేవతలకంతయుదెల్పె నా
సమయంబున బావని సముద్ర ప్రేషితుండగు మైనాకు మన్నించి ఛా
యాగ్రహంబును వధించి పరతీరంబు జేరె నాసమయంబున సాయం
కాల మపేక్షింపుచుండునంత,

శా. కాలశ్రీధరముక్తధామనిధి చక్రంబేగి పశ్చాన్నదీ
పాలాకారసరస్త్వసంభ్రమకరప్రాఙ్మూర్ధముం ద్వాప ద
న్మాలోర్ధ్వోక్షిపదప్రపూరమన మిన్నంబ్రాకెరాగంబు ద
న్మాళిప్రోద్ధృతమౌక్తికంబులన గానందోఁచె దారావళుల్.

శా. వీథుల్ దీర్చి పతంగముల్ జనె నభోవీధింబ్రవాళచ్ఛవిన్
బాథోజప్రియబింబ మేగెనుగకుప్పుత్తిక్రప్రభల్ జారె గో

నాధాశ్మాళి గదుష్ణము మ్యో మృగతృష్ణావీచులారెఁగస
త్పాథఃప్రోద్భవషండములు మొగిడె శోభల్ మీఱెఁగల్వల్ గడున్.

సీ. లోలాభిసారికాశ్లేషాలసు లేశాశ్మ
మాలారచితదివ్యమందిరములు
శ్రీలాభివంచక జాలాత్మ తస్కర
కాలాయసానేక కవచతతులు
జాలావళీవృద్ధ జాలార్తిమత్పాథ
శీలాపటుప్రవాత శృంఖళములు
నీలాంబరేందిరాబాలావళీక్లిప్త
కాలాగరుజధూమకందళములు
గాక కలకంఠసితికంఠకంఠనీల
కంఠవైకుంఠ హరినీలఖంజరీట
జంబుజాంబవదంజనాచలమిళింద
బంధురంబైన తిమిరముల్ బరిఢవిల్లె.

వ. తదనంతరంబ,

సీ. కనదంధకారాంధకాసురు మర్థింప
వచ్చిన పార్వతీరమణుఁ డనఁగ
బృధుతమఃకాళిందిఁ బెకలింపఁ గక్కున
మొనసిన బలరాము మూర్తి యనఁగ
ఘనతిమిరస్వర్ణకశిపుని ఖండింప
దివిరివచ్చు నృసింహదేవుఁ డనఁగ
వడిగ జీకటి ప్రమాను బవద్రోయుగా దివి
చెంతలవచ్చు చౌదంతి యనఁగ
జోదులు గృశింప బద్మముల్ సొంపు దింప
జారులు చెలింప భోగులు సంతసింప
గలువలు హసింప దిమిరసంఘము నశింప
చంద్రు డుదయించె లోకులు సన్నుతింప.

వ. ఆసమయంబుననాంజనేయుండుగలవింకప్రమాణాంగుండై లంకాద్వారంబునంటినలంకిణిగాంచి నీవెవ్వడవనిచేతులెత్తి మొత్తిన జలింపక యుతండు వామాంగుళిచే వనిత యని వ్రేసిన నది నేలంగూలి లేచి చేతులుజోడించి యిట్లనియె నీచేత లంక విజితయయ్యె నదియరావణునకంతంబని విరించి తొల్లివచించె శింశుపావృక్షమూలంబున జానకి యున్నదియని పలికి చనియె నంత నతండు రావణాంతఃపురంబునకరిగి యచ్చట,

సీ. బాజుబాజునరత్నరాజిరాజిస్తంభ
దీపంబులోకకోటి తేజరిల్ల
నింద్రనీలాచలచంద్రకాంతములట్ల
రొమ్మునచౌదంతి కొమ్ములమర
బందీకృతామర్త్యసుందరీతతినిద్ర
జెందిసోలుచుబాద సేవజేయ
శిరములజెలగు జేజేమ్రాని క్రొవ్విరి
గుత్తుల నెత్తావి ఘుమ్మనంగ
దప్తకాంచనరత్నసౌధాగ్రపుష్ప
శయ్యనిద్రించుదై తేయచక్రవర్తి
గాంచిమదినెంచి యాభోగగరిమకెల్ల
దెచ్చుకొనె కీడు సీతనుదెచ్చి వీడు.

సీ. అని తనమనమున ఘనముగాదలపోసి
వానిదల్పంబున వరలుచున్న
మండోదరినిగాంచి మహిజగా శంకించి
భ్రమసితి ననుచు తద్భవనసీమ
దాటుచు దత్ప్రమదావనంబున శింశు
పావృక్షశాఖాగ్రభాగమందు

నిలచి తద్వనశోభ గలయనిరీక్షించి
బెడరెడుబక్షుల రొదలు వినుచు
సాలమూలసువర్ణాలవాలములను
లీలనవరత్నమంటపజాలములను
మొనసికాంచుచు తద్వృక్షమూలమందు.

సీ. జలదమాలాచ్ఛన్నజంద్రరేఖయనంగ
క్షితిపై నిభారలాడు లతికబోలి
శ్వగణమధ్యస్థయూసారంగిపోలిక
విస్మృతిగాంచినవిద్యరీతి
సర్థాంతరము జెందినట్టివాగ్గతిలీల
బంకదిగ్ధమృణాలవల్లిపగిది
మలినవస్త్రచ్ఛన్నమణిశిలాకఛాయ
ఘనధూమతతిదీపకళిక కరణి
ప్రకటమిథ్యాపవాదసంపతితకీర్తి
మాట్కిబద్ధైకవేణియు మలినవసన
ధూళిధూసరితాలక దుఃఖతప్త
రాజభోగోచిత విదేహరాజకన్య
గాంచెసంతోషశోకముల్ గడలుకొనగ.

వ. ఇల్లుగాంచి రాఘవలక్షితలక్షణంబులు నిరీక్షించి సీతగా నిశ్చయించి
వర్ణింపసమయంబు నిరీక్షింపుచున్న సమయంబున,

సీ. కాంచననవరత్నకరదీపికలుగొంచు
జేజేలకాంతలరాజి నడువ
బహుళకాహాళశంఖ పటహాదికములూని
గంధర్వకామినీగణము నడువ
జారుసితఛత్రచామరంబులుదాల్చి
విద్యాధరాంగనల్ వెంటరాగ

దగ వెండిగుడియలుధరియించికంచుకీ
పాళి ముందరబరాబరులు సేయ
పరశుముద్గరపట్టిసపాణులగుచు
దనుజవనజాస్యలందంద దగిలిగొలువ
వరవధూటులు గొంద రెచ్చరిక దెలుప
వచ్చెరావణుఁ డారామువనితజూడ.

సీ. ఈలీలజనుదెంచి యింపుసొంపు జెలంగ
రావణుఁ డారామ రామ యనియె
కామినినన్నేలగన్నులజూడవు
రాఘవుండు నరుఁడు రహితవస్త్వ
జనసంగతుండును సద్గుణరహితుండు
రాజ్యహీనుఁడు మునిరాఁహితుఁడు
కొందఱుగాంతురు కొందఱుగనలేరు
గాలంబుగలసెనో గలఁడొ లేఁడొ
ధరణిసిరుపాధికుండును నిరతిశయుఁడు
నరయ నీవెంతవలయు నీయందురక్తి
గలిగియుండిన నిటరాక నిలచునెట్లు
బుణ్యజననాథు ననుజూడుభూరిబలుని.

గీ. అనగ దా విని యొక తృణమంతరమున
వైచి వడిమాఱుమొగ మిడి వనజనేత్ర
బలికె నినుజూడ నీలంకభస్మమగును
నీమహాలక్ష్మి నశించునిజముగాగ.

సీ. సాంద్రచంద్రికచేత జాలువారెడుచంద్ర
మణులు గరంగునె మహిజకాంతి
విమలభానుప్రభవికసించుపద్మంబు
బూచునే ఖద్యోతరోచివలన

నవనీరదచ్ఛాయనటియించుగేకులు
నర్తించునే బయల్నలుపుగాంచి
మదకుంభికుంభస్థమాంసభోజి మృగేంద్ర
మరుగునే శునకమాంసాభిలాష
రామపాదారవిందమరందపాన
మత్తమచ్చిత్త మితరులబొత్తుగనునె
వేయునేటికి బలుకగా వినుముపంక్తి
వదన సజ్జనలోకదుర్వైరసదన.

గీ. అనుచు సీతబలుక నారక్కసుండును
వినుచు గోపవశత వేగబలికె
రెండుమాసము లిటులుండిన ఖండించి
వండితెండు దీనికండలెల్ల.

వ. అని రాక్షసకాంతల కాజ్ఞాపించి రావణుం డంతఃపురంబున కరిగెనంత,

క. ఘోరాకారులు రాక్షస, నారీమణు లపుడు రామనరపతిరాణిన్
క్రూరవచనంబు లాడగ, వారించెన్ ద్రిజట స్వప్నవార్తదెలుపుచున్.

వ. ఆసమయంబున జానకి శోకాక్రాంతయగుచు నశోకశాఖ నవలంబించి,

శా. రాకాసు ల్వడి జేయుబాధలకు నోర్వన్ రాక భీతిల్లుచున్
రాకాసోమసమాననంబుపయి వస్త్రంబొత్తియెల్గెత్తి యా
లోకాధీశ్వరుదేవి దా వగచె నుల్లోలాత్మ సత్పల్లవా
నీకగ్రాసకపాయకంఠకలకంఠీకంఠలుంఠధ్వనిన్.

వ. అట్లున్న దేవింగని గాలిపట్టి వేగచెట్టుపైనుండి దశరథుపట్టిచరిత మొట్టమొదలిటినుండియు గుట్టుగాను గట్టిగా దెల్ప విని నేలపట్టి యపుడు ఏవంవిధమంజులవాది మదగ్రవీథినిలచుగాక యనిన నాంజనేయుండు చెట్టు డిగివచ్చి వందనంబాచరించి యిట్లనియె.

సీ. మూడుకన్నులవాని పీడి వేవచ్చిన
దివ్యకాత్యాయని దేవివేమొ

వసుదేవస్వామి బాసి వేంచేసిన
పాలమున్నీటిరామాలి వేమొ
చతురాననునిపొత్తు చాలించివచ్చిన
రాణించువల్లకీపాణి వేమొ
సూనబాణునిపొందు మాని యివ్వనమందు
నొప్పుచుండినరతీయోష వేమొ
సోము నెరసినరోహిణీరామ వేమొ
గాక నాసామియగు రామలోకనాథు
బాసివచ్చినజానకీభామ వేమొ
వెల్లడిగదెల్పగదవె నాతల్లికాన.

ఉ సన్నుతపద్మపత్త్రములబూనెడు మంచుకణంబులట్ల నీ
కన్నులబాష్పముల్ దొరుగ గారణమేమొ నుదంబ! యట్లుగా
కున్నతసౌధవీథికల నుండగజాలిననీవు వృక్షమం
దున్నవిధంబు దెల్పగదె మోలలనాజనమాళిరత్నమా.

వ. అనిన విని సంతసించి భూమిసంతతి యిట్లనియె.

క జనకునిగృహమున బుట్టుట, బనివడి రఘురాముచెట్టబట్టుటవిపినం
బునకరుదెంచుటరావణు, డనయంబునదన్ను దెచ్చుటంతయుదెల్పెన్.

వ. ఇట్లు దెల్పిన విని,

క. నాతల్లి నిన్నుగాంచితి, నాతపములు పండె దొరకె నాకు సుకీర్తి
వ్రాతము ధన్యుడనైతిని, సీతాపతికార్యమేను జేసితి దేవీ.

వ. అనిన విని జానకీదేవి రామలక్ష్మణుల రూపంబులు దెలుపుమనిన
నతండిట్లనియె.

సీ. వాలుగన్నులవాడు నీలనీలాంబుజ
నీరదాంచచ్ఛాయ నెగడువాడు
దళుకుచెక్కులవాడు నలవసంతజయంత
కంతుకాంతాకృతి గలుగువాడు

చిలుకబల్కులవాఁడు బలుపెంపుగలకెంపు
దలకింపు సుమధురాధరమువాఁడు
పాండుహాసమువాఁడు మండితశుండాల
శుండాలసద్భుజశోభవాఁడు
డంబుగలవాఁడు పీనవక్షంబువాఁడు
బలముగలవాఁడు దినమణికులమువాఁడు
సొగసుగలవాఁడు రేవెల్గుమొగమువాఁడు
రాఘవుండు శ్రీరామమోఘులాఘవుండు.

వ. మఱియు లక్ష్మణుండు తప్తచామీకరగాత్రుండు కడమగుణంబుల రాముంబోలి వెలుంగునని చెప్పి దీనింజిత్తగింపుమని యుంగరంబిచ్చిన సీత దానిం గేలందూని,

క. కన్నుల నద్దును శిరమున, జెన్నలరగనుంచు ఫాలసీమను జేర్చున్
బన్నుగ ముద్దిడు దగనిల, గన్నియ యాయుంగరంబు గనుగొనిప్రీతిన్.

వ. మఱియు నిట్లనియె నాంజనేయు నుద్దేశించి,

సీ. నాకష్టవిపినంబు బోకార్చవచ్చిన
దివ్యతేజుండవో భవ్యచరిత
నాదుఃఖఘనపంక్తి వేదూల్చవచ్చిన
వరమహాబలుడవో వనచరేంద్ర
నాశోకతిమిరసంతతి మాన్పవచ్చిన
హరిమూర్తివో నీవు పరమపుణ్య
నావ్యాధిసాగరోన్నతిబీల్చవచ్చిన
కుంభసంభవుడవో గురుగుణాఢ్య
నాలసత్సౌఖ్యభూతిచందంబు నలర
జేయవచ్చిన నమ్మహాశివుడవేమొ
గాక నాపాలిసద్భాగ్యఖనివి ధరణి
నమితవిక్రమధారేయ యాంజనేయ.

వ. అని కొనియాడుచున్న సమయంబున నాపావని యిట్లను నోజనని! నిన్ను నామూపున వహించి రామునన్నిధికి దోడ్కొని చనియెదనని న జానకి యిట్లనియె నట్లైతే రావణుకంటె రాముడే దొంగయగు ద్రము గావున నిది యుచితంబుగాదన, నయితే రామలక్ష్మణ సుగ్రీవాదుల శీఘ్రంబ గొనివత్తునని పల్కి తచ్చూడారత్నం బానవాలుగొని సెలవుగొని వలగొని చనుచు దావచ్చినసంగతి దైత్యరాజున కెఱింగించువాడై వనంబు జెకలించి కావలివారల వధించిన హతశేషులు రావణున కంతయు విన్నవించిన నతండు జంబుమాలిప్రముఖులం బంపిన వారలు దన్ను చుట్టుముట్టిన,

సీ. వాలంబుచే దైత్యజాలంబులను జుట్టి
విసువీథిదాకంగ విసరివిసరి
పాణిచే దానవశ్రేణినొక్కటగొని
వడిచక్రవాలాద్రి వైచివైచి
కాలుచే రథములచాలు నొక్కుమ్మడి
దగగుండపిండిగా దన్నితన్ని
ముష్టిచే దైతేయదుష్టాత్ములను ధర
బడితన్నుకొని చావబాడిచిపాడిచి
మదగజము దోమలనుబట్టి చదుపుకరణి
జంబుమాలియు మొదలగు సప్తమంత్రి
సుతుల వధియించె రథరథ్యయుతముగాగ
బారిపోవంగ హతశేషబలము విఱిగి.

వ. లంకజొచ్చి రావణున కంతయు విన్నవించిన నతండు కోపించి రణోద్యుక్తుండగు నక్షకుమారునిం బనిచిన నతండు వచ్చి శరాసార ఘోరంబుగా జుట్టుముట్టినరాక్షససేనలం గాంచి యమ్మారుతనందనుండు సేనలకురికి,

సీ ఒకదారి వడిమీఱి యురగారి యురగుల
గమిబారి నిర్జించుకరణి దోవ

నొకచెంతఁగల్పాంత వికటకంతునిహంత
జనసంతతుల నేచుసరణి దోఁప
నొకసారి వెనుగాలి యురుతూలికలనోలి
వెలదూలఁబడఁ జేయువిధము దోఁప
నొకదండ లయఖండనోద్దండమార్తాండ
తతి జంతువులఁగాల్చుగతి చెలంగ
మీఱి సామీఱి యబ్బలుబోరిలోన
నక్షు దేవవిపక్షు నష్టాక్షుఁ జేసి
హతము గావించె దితిసుతయుతముగాఁగ
రథ్యరథసారథుల నుజ్జూర్ణంబు జేసి.

వ. తదనంతరంబ హతశేషులు లంకకరిగి రావణునకంతయుం దెల్పిన నతండు మూర్ఛిల్లుటయు నింద్రజిత్తుం డతనిఁ దేర్చి యేను జని వానిం బట్టి తెచ్చెదనని చతురంగబలసమేతుండై చనం జన రావణుం డిట్లనియె.

క. శరచాపంబులు భద్రము, ధరపై వేసాంతరంబు బూనిన శ్రీ
హరిగాని హరుఁడుగాఁడీ, తరుచరుఁడని వీని జూడఁదగదు కుమారా.

వ. అని తెల్పిన తండ్రిం గని యట్టివాఁడైన నతనిం బాశబద్ధుఁ జేసి తెచ్చెద చిత్తగింపుమని సెలవుకొని చని శస్త్రాస్త్రంబుల బావనిన్ ముంచిన నతండు సేనలకురికి,

గీ. కేలఁగాల్గొని వీవ దూలిసప్తాంభోధి
చరమభూస్థలిబడి చచ్చువారు
వాలంబుచే జుట్టివైచినదనుజులా
సత్యోర్ధ్వముగఁబోయి సమయువారు
ముంజేత మోదిన సంజీవనములు బాసి
గుండెపిండై నేలగూలువారు
డాకాలఁదాచిన వీకకోర్వఁగలేక
తుత్తుమురై ధరఁదొరఁగువారు

వైరిదానవు లదిగని యప్పుడింద్ర
జిత్తు మారుతిమీద నుదగ్రవృత్తినడరి
బాణజాలంబు లందంద బరపిపరపి
వేగ బ్రహ్మాస్త్రవిద్ధుగా వించె నతని.

వ. ఇట్లు బ్రహ్మాస్త్రవిద్ధుండగుట జూచి సంతసించి యాంజనేయుం గాంచి తనమనంబున,

మ. అరయన్ మూడవకన్ను డాసి కపిరాడాకారముం బూనుశం
కరుడో కాక సుదర్శనంబు నెడలంగా జేసి కీశాకృతిం
గరమర్థిం ధరియించినట్టికమలాకాంతేశుడో లేక వా
నరుడై గోత్వముమాని వచ్చినమహానందీశుడో జూడగన్.

సీ. శ్రీకాంతవిగ్రహస్థితిగతి నూహింప
హరిగాడితండు శ్రీహరియెకాని
చారువిక్రమకళాశక్తియుక్తినితండు
గపియుగా డలవృషాకపియె తలప
వాగ్విలాసప్రభావైఖరినితడువా
నరుడుగాడమ్మహానరుడె చూడ
దివ్యతేజఃప్రభాస్థిరవృత్తి నీతడు
గీశుండుగాడు నాకేశుడరయ
మున్ను గైలాసమునకు నే జన్నవేళ
శాపమొసగిన నంది కేశ్వరుడోగాక
యితరులకు నిట్టిరాజితాకృతియుగలదె
జూడలేదె బలీముఖస్తోమములను.

వ. అని మనంబునదలపోసి బ్రహ్మాస్త్రం గని వీడెవ్వండో వనంబేమికారణం బున బెకలించె రాక్షసుల నేల వధియించె వడుగుమనిన వతండట్లు సేయ నప్పావని రావణునితో నిట్లనియె.

సీ. శివధర్మవర్ధన స్థితిమించె నెవ్వాడు
బలిమిచే బాలించుకలిమిచేత
మారీచదానైకపారీణు డెవ్వాడు
బలముచే దానకౌశలముచేత
ఖరకరాధికశక్తినిరసించె నెవ్వాడు
దీప్తిచే భుజబలప్రాప్తిచేత
హరిసూనుగర్వంబు నణఁగించె నెవ్వాడు
గోలచే శృంగారలీలచేత
నట్టిరాముని దాసుడ ననిలసుతుడ
వసుమతీసుత వెదకంగవచ్చినాడ
కపినగుట జెట్లు బెరుకంగ గుపితులగుచు
గొట్టవచ్చినవారల గొట్టితధిప.

వ. మఱియు నొక్కవిశేషంబు దెల్పెద.

సీ. తావకీనపురస్థదనుజకంజాప్తజ
ప్రభాతగాదలపు మాసీత నెపుడు
భవదీయదశకళ బద్ధోరులోచన
శ్రోతగాదలపు మాసీత నెపుడు
దానవావళికాల దర్పితపార్వతీ
నేతగాదలపు మాసీత నెప్డు
యుష్మద్వినాశనోద్యోగభావితమృత్యు
భూతిగాదలపు మాసీత నెప్డు
డింద్రజిత్తుండు బ్రహ్మాస్త్రమేసి నన్ను
గట్టి తేలేదు సీతోడగలసియిట్టి
మాటలాడంగవచ్చితి పాటవమున
బూని గావున వేగనాబుద్ధివినుము.

వ. అనిన విని కోపించి రావణుండు వీనివధింపుడనిన విని విభీషణుండు దూతవధ నీతి గాదనిన వీనిదోకగాల్చి పంపుడనుటయు రక్కసులు పెక్కువలువ లాంజనేయుని వాలంబునఁజుట్టి వహ్ని సంఘటించి చోరుండని ఘోషించుచు నప్పురవీధి నరుగునప్పుడు,

క. పాశములు ద్రెంచుకొని యు, క్కీశాగ్రణి వారి నొక్కగృద్దునవడి కీనాశపురికనిచి పావక, మాశరణమలందు బెట్టియుంతనిలువకన్.

క. ఊరెల్ల గాల్చి వేగము, వారిధిశరములనునార్పి వాలధినపుడా ధారుణిసుత కంతయు దన,చారిత్రము తెలిపి సెలవుసయ్యానగొనుచున్.

శా. సారోదారత లంకగాల్చి రిపులం జుడాడి లంకేశుతో
వీరాలాపము లాడి వె డియు నతిన్వీక్షించి భద్రంబుతో
బారావారాము దాటి యంగదముఖప్రాజ్ఞాళితో జూచి తా
శ్రీరామప్రియసంచు దెల్పి వడి దత్సేనానమేతంబుగాన్.

గీ. మరలిపావని సుగ్రీవుమధువనంబు
గోరుకపులకు వే వేగ జూరలిచ్చి
యడ్డపెట్టిన దధిముఖాద్యఖిలకపుల
దోల వారలు రవిసుతుపాలికరిగి.

క. అంతయు జెప్పినవిని కపి
కాంతుడు భూసుతనువారు గనివచ్చుటనిం
తింతలోనరించిరనిమది
సంతోషమునొంది వారిసయ్యానబలికెన్.

వ. మీరు వేగంబపోయి హారిదోష్కానిరమ్మని వనపాలురం బంచిన వారరిగి యందరప్రముఖుల కిట్లనిరి మేమెఱుంగకచేసిన యపరాధంబు క్షమింపుడు, రామసుగ్రీవులు మిమ్ములదోడితెమ్మనిరని విన్నవించిన యాబలీముఖవీరులు జని సుగ్రీవాదులంగాంచి నమస్కరించి రందు నాంజనేయుండు చేతులుమోడ్చి రాఘవులతో నిట్లనియె.

సీ. కనుఁగొంటి సీతను వినుజానకీనాథ !
యెందఁ నో మారుతనందనుండ
లంకాపురంబులో బంకేజలోచన !
యెందున నెచ్చటో ననిలతనయ
రావణారామమందో వసుధాధీశ !
కంజాక్షి యెట్లుండె నాంజనేయ
ప్రాణావశిష్టయై స్థాణుకార్ముకభంగ !
యేమంటివో నీవు భీమశౌర్య
దన్ను రమ్మంటి నేమనె సన్నుతాత్మ
చోరగతి నాయమా యనె సూరతిలక!
యహహ పద్మాక్షియెంత గుణాఢ్యురాల
వనుచు వ్రాలెను రఘువంశ జనవిభుండు.

వ. ఇట్లు మూర్ఛిల్లి లక్ష్మణ సుగ్రీవబోధితుండై లేచిన రాఘవునకు సీతా రమణీమణిశిరోమణినొసంగి కాకాసురచరిత్రంబు దెల్పినన్ విని రాఘవుండానందించి పావనికిట్లనియె నోయాంజనేయ నీప్రసాదంబున నాతో రఘువంశవానరవంశంబులు నిలచె నిన్ను నేమని వర్ణింతునని యాలింగనంబు జేసెనని దేవముని నాకూద్భవునకు దెల్పిన నవలికథ నడుగుటయును,

శా. పారావారగభీరసాంధ్యసమయప్రారబ్ధఝంపాక్రియా
స్ఫారన్నానటదింమౌళి మౌళిప్రాంచజ్జటాజూటకా
సారాంతస్థలతీవ్రవేగవిలుఠత్స్వర్గాపగాజాతడిం
డీరాకారయశోవిహారయరిశౌండీర్యాపనోదక్రియా.

భుజంగప్రయాతము.

రమాభామినీపాదరాజీవపూజా
సమాధిక్రియాచారసంఘాతబీజా

సమారబ్ధవిద్యోరుసాహిత్యభోజా
క్షమాదైవతాఖ్యాతసత్కల్పభూజా.

—: గద్య :—

ఇది శ్రీ మదుమామహేశ్వరవర ప్రసాదలబ్ధ సరసకవితాసామ్రాజ్య
సుకవిశేఖర కౌండిన్యసగోత్రపవిత్ర సోమశేఖర ప్రణీతంబైన
శ్రీనరసభూపాలరాజీయంబను శృంగారరస ప్రబంధంబు
నందు చతుర్థాశ్వాసము సంపూర్ణము.

శ్రీసీతారామార్పణమస్తు శ్రీ శ్రీ శ్రీ.

# నరసభూపాలీయము.

## పంచమాశ్వాసము.



శ్రీ రాజితసద్గుణమణి
నారాయణరాజనందనగ్రామణి స
చ్ఛూరిజనవారసురమణి
భూరివిభాద్యమణి నరసభూపాలమణీ.

వ. అవధరింపు మవ్వాల్మీకిమునీశ్వరుండు భరద్వాజునకు నారదుం డిట్లనియె.

క. ఈరీతి ననిలసుతుం డా, శ్రీరామునితోడ దెల్పి సీతచరిత్రం
బా రఘురాముడు రాక్షస, వీరులనగరంపుసొంపు వినుపింపు మనన్.

వ. ముకుళితకరకమలుండై హనుమంతుం డిట్లనియె.

సీ. మహిమహిళాశిరోమణిరత్న రంజిత
నూపురంబల్ల లంకాపురంబు
పద్మాదినవనిధిసద్మాళివిజితాల
కాపురంబల్ల లంకాపురంబు
వీరరావణలోకవిజయలక్ష్మీబాలి
కాపురంబల్ల లంకాపురంబు
తప్తచామీకరసప్తసాలాశ్లిష్ట
గోపురంబల్ల లంకాపురంబు
నిశిచరాధిపభుజబలానీతభాను
చంద్రదేవేంద్ర పావకశమనదనుజ
వరుణవాయుకుబేరమాహేశరమకు
గాపురం బెన్నిచూడ లంకాపురంబు.

వ. మఱియును.

సీ. ఏవంక గన లంక నేణాంకరత్నాంక
మహీసముట్టంకిత మందిరమ్ము
లేదండగన జాడ వేదండరథకాండ
కోదండరథచమూ కోటికోటు
లే చెంతగన వింత లిందిందిరాక్రాంత
పారిజాతలతాంత పరిమళమ్ము
లేసీమగన రామ హేమాదిసురభామ
సత్కామినీమణి సంచయములు
వెలయ దేవేంద్రపురమును వెక్కిరించి
దివ్య కౌబేరపురమును ధిక్కరించి
మెరయునవరత్నరత్న చామీకరాంత
కుట్టిమంబు సురద్వేషిపట్టణంబు.

వ. అని మఱియు రావణకుంభకర్ణమహేంద్రజిదతికాయమహాకాయాదుల వేర్వేర వినుతించిన విని రఘువీరుండిట్లు నేమునభిజిన్ముహూర్తంబున నడిచితిమేని రిపులనోడుతుమని నిశ్చయించి తత్సమయంబున సుగ్రీవాంజనేయాంగద జాంబవదాద్యనుమతి సర్వసేనాసమేతంబుగా జని చని,

క. శరధిగనుగొనియె నటవా, శరధిమహాసేన జనక శరధిం దతదా
శరధిన్ నిర్భయవలవా, శరధిన్ భూభానుపరిధి శతపత్రరధిన్.

సీ. ఈరీతిగని రాము డాహూఢిసాగర
తటమున గపిచమూతతిని నిలిపె
నటలంకలోపల నసురాధినాథుండు
మహనీయ్యఘనసభామధ్యమందు
సచివులగని పల్కె సామీరి దనుజుల
గెల్చిపురంబును గాల్చిచనియె

జననాథుఁడిప్పుడు శతకోటికోటులు
　　　　వనచరుల్గొలువంగ వార్ధితీర
మునను విడిసెనునిప్పుడు ఘనముగాఁగ
గాన మీరలు సన్మంత్రకలితు లరయ
నాకు హితులను సచివు లస్తోకబలులు
మీమతంబులు దెల్పు డమేయమహిమ.

వ అనినవిని రావణునకు మంత్రులిట్లనిరి.

ఉ. శర్వనిశైలమెత్తినభుజాబలశాలివి నీవు శక్రదో
ర్గర్వమడంచినట్టిబలిగణ్యుఁడు నీతనయుండు దేవతా
ఖర్వచమూవిదారిఘనకాయుఁడు నీయనుజుండు జూడఁగా
సర్వజగంబులందును నసాధ్యము నీకొక టెద్ది రావణా.

వ మఱియును,

సీ. గురుసప్తకుంభినీధరములు నెగరంగ
　　　　వ్రేతుమేబ తులువ్రేసినట్లు
దారుణకకుబంతదంతిదంతంబులు
　　　　విరతుమే చెఱకులు విరచినట్లు
గరుడగంధర్వకిన్నరసర్పాదులఁగాల
　　　　నలతుమే చీమల నలచినట్లు
విషభీషణోరగవిభుని కోరలనూడ
　　　　దీతుమే తేఁగలదీసినట్లు
నేల బదునాల్గుభువనముల్ గూలిపడఁగ
ద్రోతుమే దొంతికుండలు ద్రోచినట్లు
వేయు నేటికి మముఁబంపు వీరవర్య
వడిగ నరవానరుల జంపివత్తుమిపుడ.

వ. అనిపల్కుచున్న మంత్రులమాటలు నిరసించి మంజులభాషణుండగు విభీషణుండిట్లనియె.

సీ. చక్రిచక్రక్రమవిక్రమావక్రమై
రంజిల్లు చూడు మా రామశరము
దండిదండాభీలచండప్రకాండమై
రంజిల్లు చూడు మా రామశరము
వజ్రివజ్రాసిదుర్వారమై ఘోరమై
రంజిల్లు చూడు మా రామశరము
దండిదండాభీలచండప్రకాండమై
రంజిల్లుచూడు మా రామశరము
అట్టిరామాస్త్రమునకు బ్రత్యస్త్రమొకటి
గలదు వందననామకఘనశరంబు
దానిగొనుచు జయించి యద్దాశరథుల
గులము నిలుపుము దైతేయకులిశపాణి.

వ. మఱియును.

సీ. ఖరుని దైతేయశేఖరుని గూల్చినమోక్ష
దాయకుం డవనిజానాయకుండు
వాలిదోర్విక్రమశాలి ద్రుంచినదివ్య
సాయకుం డవనిజానాయకుండు
దాటకజితమేఘఘోటకద్రుంచుని
ర్మాయకుం డవనిజానాయకుండు
రాము ఘోరకుఠారభీము మించినదేవ
గేయకుండవనిజానాయకుండు
గాన దత్సీత సుగుణసంఘాత నిత్య
పరమపూత జగన్మాత మరలనిచ్చి
ఘనము రాక్షసజనముజీవనముగీర్తి
ధనము నిలుపుము దైతేయజనవరేణ్య.

వ. అనిపల్కు విభీషణునయనిష్ఠురభాషణంబులకు గోపించి కులిశకఠో
రంబగు పాదంబునన్ దాకిన నేలకొరగిమూర్ఛిల్లి కొంతదడవునకు
మేల్కాంచి యిట్లనియె.

గీ. ఇపుడు నామాట నీ చెవికింపుగాదు
రామచాపవినిర్ముక్తభీమబాణ
ఘోరదావాగ్ని బురి దరికొన్నయప్పు
డింపుసొంపగుననిపల్కి పెంపుదక్కి.

క. దనుజులు నలువురు గొలువగ, జని జననికి దెల్పి యతనిచరితము వేగన్.
వనరాశి దాటి గొబ్బున, వినువీధిని నిలచి రామవిభుగని పలికెన్.

ఉ. శ్రీరఘురామ భాస్కరకులోదధిసోమ సురారిభీమ దు
ర్వారబలాభిరామ ఖరవాలివిరామవిరామమానవా
తారకనామ భద్రగుణధామ కృపారససీమ కేశవా
శూరలలామ లోకనుత సుందరరామ యటంచు భక్తితోన్.

గీ. చోరగతి నీకుభామిని గోరి తెచ్చి
నట్టిరావణుదమ్ముడ నసురకులుడ
సఖులజనులు విభీషణుడండ్రు నన్ను
రఘుకులాంబుధిచంద్ర శ్రీరామచంద్ర.

వ. అప్పాపాత్ముని మంత్రసమయంబున సీత మరలనిచ్చి రామునిపదం
బులు బట్టుకొమ్మనిన నన్ను పాదంబునదాకి ద్రోచి పుచ్చిననీచరణం
బులు శరణంబుగా దలంచి వచ్చితిననిన విని సుగ్రీవుండు రాక్షసుల
నమ్మకూడదనుటయు నదివిని హనుమంతుండిట్లను నీతడట్టివాడు కాడు
నీతిఘనుడు పకారపడు డనుగ్రహయోగ్యుం డనినవిని రాజశేఖరుం
డతనియం దనుగ్రహించిన సంతసించి విభీషణుం డతనికిట్లనియె.

సీ. జయమహాసురభీమ జయరాజసుత్రామ
జయజానకీరామ శరణుశరణు

జయభానుకులసోమ జయసద్గుణారామ
జయజానకీరామ శరణుశరణు
జయవిక్రమోద్దామ జయదయారససీమ
జయజానకీరామ శరణుశరణు
జయభార్గవీకామ జయనీరదశ్యామ
జయజానకీరామ శరణుశరణు
జయభయానకసంగ్రామ శరణుశరణు
జయకృతాశ్రితసుక్షేమ శరణుశరణు
జయవిచిత్రశరస్తోమ శరణుశరణు
జయవివిక్తజనప్రేమ శరణుశరణు.

వ. అనివినుతించు విభీషణు రాలింగనంబు జేసి రాఘవుండిట్లనియె.

సీ. ఎంతపర్యంత మనంత పర్వతనదీ
క్రాంతమై జగములగ్రాలుచుండు
నెంతపర్యంత మనంతపీఠిని బుష్ప
వంతులసంగతివదలకుండు
నెంతపర్యంత మనంతాత్మజాకాంత
కాంతసత్కథభువిగ్రాలుచుండు
నెంతపర్యంత మనంతభోగీంద్రుండు
పాతాళలోకంబు బాయకుండు
నంతపర్యంత మీవు నాయాన లంక
నేలుకొను మింకరాజుగా నిలిపినాడ
నిలవిభీషణసంతతలలితవినయ
భూషణా నీకుమంజుసంభాషణమున.

సీ. అనివిభీషణునకు నభయంబొసంగుచు
జెలువొప్పువారిధి సలిలములను
దెప్పించి యతనికి నొప్పుగా నభిషేక
మొనరజేయించి తా దనరనపుడు

హరిసుతజాంబవదాంజనేయవిభీష
ణామలమతమున మోదమలర
వరదర్భశయనుడై వాసరత్రయమంత
శరధిగూర్చి తపంబు సలుపుచుండ
గానుశరధిబ్రసన్నుండుగాకయున్న
గోపమడరంగ జాపంబుగొంచుసజ్య
ముగను జేయుచు బ్రహ్మాస్త్రమును దెమల్చి
నారిగూర్పంగ నమ్మహాఘోరవమున.

క. తారలు బ్రమ్మల్లెను గడగడ, ధారుణి వడకాడె బర్వతంబులుగదలెన్
వారిధులుగలిగె భాస్కర, తారాపతిమండలముల దమ సుడరెగసున్.

వ. అప్పుడు,

క. సాగరుడు వేగసన్మతి, సాగరమణులెల్లగొలువ సాగరమణులన్
వేగముగను గొనివచ్చుచు, సాగరు రఘువీరు బుద్ధిసాగరుగనగన్.

వ. ఇట్లువచ్చి తానిట్లనియె.

క. దేవనరదేవకిన్నర, దేవమహాదేవదేవదేవస్తుత్యా
యీవిధిజడధిగనన్నుం, గావించినవాడ వీవుకావె మహాత్మా.

సీ. అప్పుడు రఘువీరు డతనితో బల్కెను
నామహాస్త్ర మమోఘ మట్లుగాన
దీనికి లక్ష్యంబు మానుగాజూపుము
నన దృశ్యగుల్మంబు వనధిజూప
నటరఘువీరుండుదటకునదృశ్యగు
ల్మాభీరమండలమందువైవ
వడినేగికాండంబు వారల బరిమార్చి
ఘనతరపాతాళగంగజొచ్చి
వచ్చితూణీరమును వేగజొచ్చెనపుడు
దాశరథిదా శరధితోడ దగనుబల్కె

గొండలను దేర వానరకాండములను
బంపుమనగను వడిగ నబ్జాప్తకులుఁడు.

వ. సుగ్రీవునితో సెలవిచ్చిన నతండు గపులం బంపిన వారలరిగి కొండలు దెచ్చి సముద్రంబులో వైచిన నవి మునింగినఁ గాంచి సముద్రుండు వీరలు నలుని చేతికిచ్చిన దేలునని నతం డొక్కకొండ చేకొని,

మ. గణనాథాయ నమో నమోస్తు భవతే గంధేభవక్త్రాయ స
త్ఫణిభూషాయ వినాయకాయ త్రిజగత్పాలాయయంచున్ సురా
గ్రణి హేరంబు బ్రసన్ను జేసి నలుఁడాకంధింబడన్ వైచె గం
కణము ల్మ్రోలగ నొక్క పర్వతము వీకన్ భూమిభృద్బాలుకన్.

వ. ఇట్లు వైచిన నప్పర్వతంబు పాతాళలోకంబునం బడి మరలి దేలినఁ గాంచి వానరులు కోయని యార్చి పర్వతపాదపంబులుం దెచ్చిన నలుండు పంచదివసంబులకు సేతువుఁ గట్టిన దన్మార్గంబున రాఘవుండు సేనాసమేతుండుగా సముద్రంబు గడచి లంకాబహిఃప్రదేశంబున సేనలవిడియించి రాజనీతివిద్యావిశారదుండు గావున నంగదు బిలచి రావణునితో సామవాక్యంబులు బలికిరమ్మనిన నతండేగి సభాస్థలిలో గొలువున్న రాక్షసేంద్రుంగని యిట్లనియె.

ఉ. దుర్జన నిన్ను బట్టి గతదోర్బలు జేసినజట్టి కార్తవీ
ర్యార్జును బట్టి గొట్టిన బలాధికు గెల్చిన రాము బంట నే
నూర్జితవాలపాశమున నుగ్రత జుట్టి చతుఃపయోధులం
మార్జనజేయుశక్రజకుమారుఁడ నంగదనామధేయుఁడన్.

వ. మఱియు రామచంద్రుండు నీతో నాడుమన్న వాక్యంబులు వినుము.

ఉ. ఏమతి నాశ్రయించి మిథిలేశకుమారికఁ దెచ్చినాఁడవో
యామతి నాశ్రయించి యిపుడాలకు సేయఁగరమ్ము దక్కినన్
సామముమీర సీతనిడి చావక బొమ్మిటమీఁద లంకకున్
స్వామి విభీషణుండు సురసంఘము సంతసిలంగ రావణా.

వ. అనినవిని రావణుండు వాలిసూనుఁడవే నీవయని యంగదునితో ని ట్లనియె.

గీ. తండ్రిజంపినట్టి ధాత్రీశునెదిరించి
చంపవలయు లేద చావవలయు
రెండుమానినట్టి గండడవై రాము
గొలుచుచుంటివీవు గొడుకవటరా.

వ. అనిన నతండిట్లనియె.

గీ. సకలలోకములకు జనకజ తల్లిరా
వెలయుచుండ రామవిభుఁడు దండ్రి
వారియాజ్ఞ కెదిరి వర్తించరాదురా
యాయువల్పమగుట నడచెదీవు.

వ. అనినవిని వీనిం బట్టుండన నలుగురురక్కసులు బట్టిన వారల వాలం బునన్ జుట్టి గగనంబున కెగసి లంకాగోపురంబు విరుగవైచి వచ్చి రామునకంతయుం దెల్పిన రామచంద్రుండు వానరసేనాసమేతంబుగా లంకజుట్టి రావిడసినగని రావణుండు రాక్షసులకు యుద్ధంబునకు సెలవిచ్చిన వారు చతురంగసేనాసమేతులై కపిసేనందాకె నాసమ యంబున,

క. కర్షింపుచునటదేవా, మర్షవరులపైని వృక్షమహీధరచయముల్
వర్షించిరి కపులప్పుడు, శీర్షంబులు జిశికి శుక్రశిష్యులు బడగన్.

గీ. చిచ్చుబుడ్డి నగ్నిశిఖలుదోచినమాట్కి
భానునందుదోచు భానులనగ
నీరదమున వారిధారలుబుట్టిన
కరణి రాముబాణగణము లడరె.

వ. అట్టిసంకులసమరంబున రాక్షసబలంబులు విరిగివంగని యింద్రజిత్తు తనమనంబున,

శా. సారోదారకుఠారవజ్రకరుడౌ జంభాసురారి న్వడిం
గారాగారమునందు బెట్టిన భుజాగర్వోండ నే నుండగా
పారావార నిశాటసాలములకుం బాటిల్లె నిష్పాళ్లు మ
ద్ధారాధారబలంబి కేలసమితిం దుర్వారమై గ్రాలెడిన్.

వ. అని నిశ్చయించి యాథర్వణ మంత్రకలాపయోగంబున యాగంబొన
రించి తదగ్నిసంభూత రథరథ్యంబులతో దారాపథంబున కెగసి
సమస్త వానరానీకంబుల బడవైచి రామలక్ష్మణులను నాగపాశబద్ధు
లంజేసి మడసినవారిగా దలంచి లంకకరిగి యంతయు రావణున
కెఱింగించి నిజగృహంబునకుం జనియె నంత నిక్కడ నందఱు చింతా
క్రాంతులురై యుండిరప్పుడు,

సీ. కరమునస్ఫటికాక్షవరమాల హరినామ
గుణపదావృత్తిచే దిరుగుచుండ
నురమునందు విపంచి హరిహరీహరిహరీ
హరిహరీ యంచు దా మ్రోయుచుండ
వదనాంబుజమునందు వాణి నారాయణ
వనజాక్షనరసింహ యనుచు బలుక
బదములగజ్జలు పద్మనాభాజమా
ధవకృష్ణ యనుచు తాండవ మొనర్ప
లలితగంగాంబుధర కమండలము జెలగ
వచ్చె దనుకాంతిజితనిశావరపటీర
హారహీరతుషారడిండీరగాంగ
పూరశరపారదుండగు నారదుండు.

వ. ఇట్లువచ్చి నారదుండు నీరదవర్ణు బత్రరథరథనీరథంబగు సుపర్ణు దలం
తుగాకయని దివంబునకరిగె నా రామచంద్రుండు వినయంబున వైన
తేయుం దలంచిన నతండు వచ్చుసమయంబున,

సీ. ఆమూలచలిత హేమాచలప్రాసిత
భూరిబర్హిర్ముఖపురవరంబు
పాండువర్ణ పురాణ పత్రవిక్షేపిత
చటులకాదంబినీ సముదయంబు
తృణవద్ధృతకులాద్రిగణ శీఘ్రపాతన
శంకావికంపిత జనకులంబు
కల్పాంతనిర్ఘాతకల్ప ఘుంఘుమారవ
బధిరీకృతాశాంత పృథుగజంబు
చంచదభ్రనటత్తరుసంచయంబు
ఘూర్ణనిపాతిత సురయాన సముదయంబు
పత్రరథరాజ పత్రప్రభంజనంబు
వీచె విక్షోభితాహీంద్ర విసరమగుచు.

వ. ఇట్లువచ్చి రామలక్ష్మణులకు బ్రదక్షిణంబుజేసి విరుతించ నాగపాశ మోక్షణంబుగావించి వానరులదేర్చి నిజనివాసంబునకుం జనియె నంత వానరులు సింహనాదంబులుజేసిన రావణుం డదువదంది ధూమ్రాక్షాకంపన మహాకాయ ప్రహస్తులబంపిన వారలు,

సీ. హారవారోదారభూరి సర్వాంగీణ
కవచాభలు ధగద్ధగాలనంగ
భాస్కరోద్యద్ద్యుతిపాణింధమాభీల
ఖడ్గార్చులు భుగాల్భుగాలనంగ
సంవర్తజలదగర్జావదావదసింహ
ష్మధురవంబులు ఘెల్లుఘెల్లనంగ
ఘనవాహశోభితకనదయఃకింకిణీ
మాలికాలి ఘణాల్ఘణాలనంగ
గాలకాలాంతకోదగ్ర నీలనీల
కాయనిర్జితమేఘనికాయులగుచు

దైత్యవరు లప్పుడరిగి రుద్దండలీల
గపులపైకి బలాభీలనృపులపైకి

వ. ఇట్లు వచ్చినాకపారులు వానరానీకంబులబఱిమార్ప దొణంగినఁగాంచి,

క. అక్షీణబలుఁడు మారుతి, ప్రక్షీణప్రాణు జేసె బవరంబున ధూ
మ్రాక్షుంబలవిజితసహ, స్రాక్షున్ దైవతవిపక్షు సమరాధ్యక్షున్.

వ. మఱియును,

క. తెంపునపావనిశైలప, రంపరలన్ జదియమోదె రహిఁగృతనో
త్రాకంపునంకంపనుసురలు న,తింపను ఘనదనుజవరులుదెలిసి చలింపన్.

వ. అప్పుడప్పాలసుదింఁడులు శరాసారఘోరంబుగా వానరానీకంబులన్
దరిమిన,

సీ. కడకాలగొనిమత్తగజములబలిమిచే
విసువీధి దాకంగ విసిరివిసరి
వాలాగ్రమునదైత్య జాలంబులనుజుట్టి
వెసమహాపథముపై వ్రేసివేసి
రంగదుత్తుంగ తురంగంబులనుగని
ముంజేత నిలబడ మోదిమోది
వరపదాతులడాసి గురుతరబలమున
త్రొక్కితలి డాకాల జమిరిచమిరి
వడిరథంబులరథములపైచిపైచి
మఱిమహాకాయుశతమూయు మహితకాయు
ఘోరదైతేయులనుబట్టి గుదియగొట్టి
యలరెచామీకరాంగదుం డంగదుండు.

వ. అప్పుడు,

క. నీలుండుఁగూల్చెగ్రక్కున, వాలాగ్రముచేతమోది వైరులు బెదరన్
లీలఁబహాస్తు బ్రహాస్తున్, వ్రీలగదైత్యప్రహస్తు విబుధధ్వస్తున్.

వ. హతశేషులగు రక్కసులు లంకసొచ్చి రావణునకంతయు నెఱింగించిన విని తాను సమరంబుసేయువాఁడై సమస్తసేనాసమేతంబుగా యుద్ధంబునకువచ్చినం గాంచి రామచంద్రుండు విభీషణునకిట్లను నీవచ్చు వీరవరు లెవ్వరనిన నతం డతని కిట్లనియె.

సీ. శేషాహికన్న విశేషమౌ యసిబూను
వాఁడింద్రజిత్తు దుర్వారసార
ఘనమూర్తికన్న బలీఘనమూర్తి గలిగిన
వాఁడతికాయుండు వాలిమథన
జౌదంతికన్న హెచ్చౌదంతిపై నున్న
వీరుండు కుంభుండు వీరవర్య
యుచ్చైశ్శ్రవముకన్న నుచ్చైస్తురగమెక్కు
వాఁడు నికుంభుండు వారిజాక్ష
మత్తుఁడనగనుమఱియు నున్మత్తుఁడనఁగ
గురుమహాపార్శ్వుడును మహోదరుఁడు యజ్ఞ
శత్రుఁడనగను దైవతశత్రుఁడనఁగ
వీరలీవచ్చువారలు శూరతిలక.

సీ. కుంతాంచితాదిత్యదంతావళాభీల
దంతవ్రణాంకదోరంతరుండు
బృందారకానీతమందార కనకార
విందారచితగంధ మందిరుండు
సాలాంకలచ్ఛుజ హేలాసముద్ధృత
కైలాసనామకక్ష్మాధరుండు
నానామణిప్రభానూనకౌబేర
విమానాభిగతపయస్స్రాంతలుండు
సింహారవభీషితాష్టదిక్సింధురుండు
కయఃకాంతివిగర్హితకంధరుండు

పుత్రపౌత్ర సుమిత్ర సద్భూరివీర
బంధురుండైన యద్దశకంధరుండు.

గీ. ఇతఁడు గావున దానవకసితశరముల
వితతి చవిజూపి యీవచ్చు వీరవరుల
బారదోలుము రఘుకులశూరతిలక
సరసగుణధామ రవికులసార్వభౌమ.

సీ. అనవిని రామరామానుజు లప్పుడు
ఘనకవచంబులు గార్ముకములు
ధరియించిరంత నద్దశకంధరుండును
దశబలంబులదోడ ననిమొ మీఱు
నిలువుండువైరుల నేవవసించెద
ననిపల్కి వేగ దానరిగె నప్పు
డతివేగమున బ్రహ్మాస్త్రంతకు మీఁదికి
నతఁడు వర్షించె ఘనాగచయము
లంతవాటిని ఘోరతరాస్త్రసమితి
దునిమి తోడనె శరముల దూయ సేయ
గాంచి నలుడంత లఘుచిత్రగతులు మెరయ
నతనిశిరములపైని నాట్యంబు జేసె.

గీ. దానిగని రావణుం డంత వానిమీఁద
నౌరవానర నీగంతులణగునంచు
బావకాస్త్రంబు బరపినబడియె నతఁడు
మూర్ఛమునుంచ విసంజ్ఞుడై భూమిపైని.

వ. అప్పు డాంజనేయుండు భుజంబెత్తి రావణున కిట్లనియె.

ఉ. నీచ సురాసురాధిపుల నెమ్మిజయించితి నంచు జాలగ
ర్వోచితవృత్తిజూడకుమి యూశరవేట్కబరాంగనావళిన్

జూచినయట్లుగా దిటుల జూచుము నీకుగనె త్రినట్టిసా
రోచితకాలదండమయి యొప్పిన మామకబాహుదండమున్.

గీ. అనినదశకంధరుఁ డిట్లనియె రామ
వసుమతీజానిలోభార్ధవాహజాఁక
వలువ దిదెనాయురంబు జేనైచు బిదప
సార దిమద్బాహుసారంబు జూపువాఁడ.

వ. అని పల్కుచున్న సమయంబున,

క. ఎదురుగజనిపావని వడి, భిదురనిపాతోగ్రమైన పిడికిట బొడిచెన్
మదమత్తదుష్టమేధా, సదనున్ దశవదను నుగ్రకచసన్నిభరదనున్.

వ. ఇట్లు బొడిచిన రథంబుపై బడి కొంతవడవునకు జేల్కాంచి యి
ట్లనియె.

క. బలిసాటిగలరె మావా, బలి నీకోసినపోటుబలిమిని వేగన్
బలలాశీశ్వరుడు మహా, త్పలసఖసుతుజూచివచ్చెభళిభళియనుచుఁగన్

గీ. అపుడుపావని యిట్లను నోరినాక, వ్రేటుకనిమాటలాడెదివేటిపోటు
గాన మారొనరింపుడు దానవేశ, పిదప నిన్నువధించెద బృథులశక్తి.

వ. అనినవిని రావణుం డధికప్రయత్నంబున బొడిచిన నతండొక్కింత విసం
జ్ఞుండైయుండ రావణుండు శరాసారఘోరంబుగా గవిసి సుగ్రీవలక్ష్మ
ణాముల విసంజ్ఞులంజేసి వానరులపై గవిసిన దత్కోశులు దనవెనుక
జొచ్చిన రాఘవుండు కవచధారణాదిసన్నద్ధుండై మారుతిపై నారో
హణంబుచేసి నిలచిన రావణునకు శరాసారఘోరంబుగా గదిసిన,

ఉ. హరులను నాల్గుబాణముల నాజి బడన్ బడనేసి సూతునిన్
శిర మెడలించి చాపమును శీఘ్రగతిన్ దునుమాడి కేతువుం
ధరదొరుగంగనేసి యెద దారుణబాణము దుస్సిపోవ ని
ష్ఠురగతిజొన్పి చాళిపటిశోభితపంక్తి నెడల్చి క్రక్కునన్.

క. దశకంధరుండు మూర్ఛా, దశబాధునుడగుచు మేను దడదడవడకన్
గృశగతి జెందగ గనుగొని, దశరథసుతు డిట్టులనియె దానవుతోడన్.

గీ. బవర మింత సాక పవనజముఖవీర, భటులతోడ జేసి బడలితివి
గాన నిన్ను నేయుమానితి, నికడప్పి, తీర్చుకొనిగడంగు దితిజవర్య.

క. అని రాఘవుండు వలుకగ, దనుజేశుడు రథముడిగ్గి ధరణిపడంకన్
వనచరులార్వగ బారెన్, దనలంకకు భీతి విగతధైర్యుండగుచున్.

వ. అట్టిసమయమున రాముడు లక్ష్మణాదుల విశల్యులం జేయుచుండె నంత నక్కడ రావణుండు సభాసీనుడై మంత్రులతో నిట్లనియె నేను జేసినతపంబు బూడిదనిడిన హవ్యంబయ్యె, గావున కుంభకర్ణుని మేలుకొలుపు డింక యనిన వార లతిప్రయత్నంబున బోధించిన లేచి,

సీ. గుర్వాజ్ఞ గడతేర్చి గర్వోద్ధతిని లేచి
విను వీధి నరికట్టు వింధ్యుడో కొ
సురదానవులు పునశ్శరధిని మథనేచ్ఛ
రహి దెచ్చు సరమందరాగమో కొ
యశ్రాంత వారివాసాయాసమున లేచి
నాక్రాంతచరితమైనాక మొకొ
వైరివైరికి దోడు వడగనే తెంచిన
సర్వధరాధరస్వామియొకొ
గాకయుండిన యీరూపగరిమ గలదె
యనుచు గపినాథులెల్ల నందంద బర్వ
జారుమణికుండలాకార శాతకుంభ
కర్ణుడైనట్టి యక్కుంభకర్ణుడరిగె.

వ. ఇట్లుజని సభకేగి యగ్రజుశాసనంబున సింహాసనాసీనుండైనతరి రావణుం డతని కిట్లనియె విను కుంభకర్ణా! రామునిచేత నాజి పరాభవంబు గలిగె గావున నకాలంబున నిన్ను మేలుకొలుపవలసె నరవానరుల జయించిరమ్ము పొమ్మనిన నతం డతని కిట్లనియె.

సీ. తాటక ఘోరాఘ తాటక గూల్చిన
రాఘవుండాదినారాయణుండు

రాము ఘోరకుఠారభీము నిర్జించిన
రాఘవుండాదినారాయణుండు
ఖరుని దైతేయశేఖరుని భర్జించిన
రాఘవుం డాదినారాయణుండు
వాలిదోర్విక్రమశాలి మర్దించిన
రాఘవుం డాదినారాయణుండు
అట్టిరాముసీత నఖిలవిష్టపమాత
నేల దెచ్చితయ్య బేలవగుచు
నైన మరలనిచ్చి యసురాన్వయము నిల్పు
చారుకీర్తి దైత్యచక్రవర్తి.
వ. అనినవిని రావణుం డిట్లనియె.
క. రాముడు విష్ణుండగుటయు
సౌమిత్రియు భీముడగుట జాంబవుకును గీ
ర్స్వామియునగుటరమాసతి
యీమహిజాతయును నగుట యెఱుగుదుసుమ్మీ.
ఉ. దానవవైరి మానుల సుదారత గావదలంచి యిట్టిచం
దాన వసుంధరాస్థలికి దానవతీర్ణత జెందె వేగ నో
దానవనాథ నిక్కమిది దాచగనేటికి సంధిజేసినన్.
బూనినగార్యమున్ విడచి పోవును దైన్యము శేషమయ్యెడిన్.
క. బలిని సమర్పిత లోకా, వలినిం దైత్రిలోక్యపీరబలి గట్టి మహా
బలిసద్మమునకు మట్టిన, జలజాక్షుని నమ్మదగునె సంధికి నెపుడున్.
వ. అనినవిని వానియభిప్రాయంబు దెలిసికొనిన కుంభకర్ణు డిట్లను సో
దరస్నేహంబున మనవి జేసితి నింతియకాని మఱియొండు దెరంగుగాదు.
సీ. నేలయునింగియు దాళంబులుగ జేసి
వాయింతు బూర్వగీర్వాణనాథ!
మేరుమందరముల మీరి బంతులు జేసి
తాకులాడింతు నస్తోకచరిత!

సప్తసాగరములు దృష్టోద్ధతినిగల్పి
చల్లెద దైతేయసార్వభౌమ!
చండతబ్రహ్మాండభాండంబువగులంగ
జరచెద నింద్రారిచక్రవర్తి!
రామలక్ష్మణతరుచరరాజనీల
పవననందనముఖ కపిబలములెల్ల
మ్రింగివచ్చెద నను బంపు సంగరమున
రణజయాటోప భూరిపీరప్రతాప!

వ. అనిపల్కి రావణునిచేత సెలవుగొని దానవసేనాసమేతుండై లం
కాప్రాకారంబు లంఘించి వచ్చు కుంభకర్ణుంగనుంగొని,

సీ. వైరివైరికిదోడువడగ నేతెంచిన
సర్వధరాధరస్వామి యనగ
శ్యాలకశంకరచాపభంగునిరాము
దాకంగవచ్చుమైనాక మనగ
దనవారిబెకలించి వనధివైచెనువారి
పైకివచ్చెడుశైలభర్త యనగ
దన్ను భేదింప నిదానంబు రామాఖ్యు
డనిగెల్వవచ్చు క్రౌంచాద్రి యనగ
మిన్నుముట్టినపొడవుతో జెన్నుమిగిలి
వచ్చుఘటకర్ణుగని కపివరులు దోక
లెత్తి కడుభీతితో బరువెత్తిరాము
పజ్జనిలచిరి నఃపాహి పాహియనుచు.

వ. అనిపల్కుచున్నసమయంబున రాఘవుండు వానరులను వెరవకుండు
డని ధనుష్పాణియగుచు విభీషణుంగని వీడెవ్వండనిన నతండిట్లను
రావణున కనుజుండు నాకగ్రజుండు రణధీరుండు కుంభకర్ణుండు వీనిం
దేవరవారు వధింతురు గాకయనునంత నతడు గపులంజీమలన్‌వలె

గాలంబేలజముకుచున్న యన్నంగని గదాపాణియగుచు విభీషణుండు
దండంబు పెట్టినంగాంచి కుంభకర్ణుడిట్లనియె.

ఉ. తమ్ముడ! నీవు నన్ను గద తాడితు జేసిన రాముసత్కటా
క్షమ్మున లంకలో దనుజసంతతిబీజము నంతరించకుం
డిమ్ముగనీవుయుండ గలవిమ్మహిం శాశ్వతవృత్తినంచు దా
నెమ్మిగ బల్కె ఘోరగద నేలను వైచె విషాద మొందగన్.

వ. కాంచి తలంగుము నాకు దనవారలు బరులుం దెలియకున్న యది
యని పల్కి వానరులన్ మ్రింగుచున్న సుగ్రీవుండు పర్వతంబు వాని
పక్షంబున వైచిన నది గుండపిండియై వానరులం జదిపె నప్పుడా ఘుట
కర్ణుడు సుగ్రీవుం బొడిచిన నతండు మూర్ఛిల్లం జూచి వానిన్ భుజంబు
నందాల్చి పురంబు జొరగ బౌరకాంతలు జల్లు లాజల పుష్పాదుల
మేల్కాంచి సుగ్రీవుండు తత్కర్ణనాసాభేదనంబు జేసి రాముసన్నిధికిం
దాటిపోయిన మరలి వాడు వానరులం మ్రింగుచున్నంగాంచి రఘు
వీరుండు,

గీ. ఆశుగాశుగము నైంద్రాస్త్రమున వాని
భుజయుగంబు ద్రుంచి భూరిశక్తి
నర్ధచంద్రబాణహతిని రక్షఃపాద
యుగము ద్రుంచివైచె నురుబలమున.

వ. మఱియును,

క. భానునిపై నరిగెనుస్వ, ర్భానుడనం బారివచ్చు పటుబలుడగున
ద్దానవునికంఠదేశము, భానుకులుం డడరి దునిమె బ్రహ్మాస్త్రమునన్.

సీ. ఇటుల నాఘటకర్ణుడిల మీద గూలిన
భటకోటి లంకకు బరుగులెత్తి
ఘటకర్ణువధ దశకంఠుతో జెప్పిన
దటుకున మూర్ఛిల్లి దశగళుండు

వెసదెలివొందుచు విలపింపుచుండంగ
నతికాయదేవాంతకాసులైన
రక్కసుల్ దండ్రిని గ్రక్కునబోధించి
యాలంబునకు సెలవందివేగ
సకలసేనాసమేతులై సాలచరుల
గూల్పజొచ్చిన నీలాదికుధరచరుల
గడగి దేవాంతకాదుల మడయజేయ
గాంచి యతికాయు డందర జించిమించె.

వ. ఇట్లు వనచరులదూలించి శరాసారఘోరంబుగా రఘువీరుం దాక లక్ష్మణుం డడ్డంబుసొచ్చిన నతండతని కిట్లనియె.

సీ. పిన్నవాడవుగాన మన్ననజేసితి
దొలగుమా సౌమిత్రి దోర్బలాన
విజితసురాసురవీరుని ననుదాకి
తింతియచాలును పంతమెక్క
ననగసౌమిత్రి దా ననియె బతత్త్రాళ
ఫలగతి నీతల నిలనుగూల్ప
నాపిన్నదనమును నీపెద్దతనముచు
గనవచ్చునని ఘోరకాండసమితి
బరప నవి వానికవచంబు జొరకపడిన
గాంచి సౌమిత్రి వానిపైఘనశరముల
నింప నవి దాకదొలగిన బెంపుదక్క
కాంచగా మారుతుం డరుదెంచి వీని
మించి బ్రహ్మాస్త్రమున ద్రుంచు మంచుజనియె.

గీ. డంబుబ్రహ్మాస్త్రమునట సమంత్రంబుగాగ
నేయ నదిబారి యద్దుచు జేసుశిరము

గూల్చె నిలబడ వానరుల్ గోయనంగ
బాఱిపోయెను హతశేషబలము విఱిగి.

వ. ఇట్లుబాఱి రావణునకంతయు విన్నవించిన చింతాక్రాంతుండగు తండ్రి నిబోధించి యింద్రజిత్తుండు హోమంబుగావించి రథంబుతో దివికెగసి బాణవర్షంబుగురిసిన వానరు లిట్లనిరప్పుడు,

సీ. శర్వఫాలానలజ్వాలలు రావుగా
లోకావసానంబు గాకమున్న
నిష్ఠురనిర్ఘాతనివహముల్ బడవుగా
కల్పాంతసమయమ్ము గాకమున్న
ద్వాదశార్కప్రభాతతు లింక జొరవుగా
బ్రహ్మకాయువు నిండబడకమున్న
గాలకాకోదరజాలముల్ దిగవుగా
బాతాళ మట బయల్పడకమున్న
బుట్టుచోటుదెలియబోలకు వచ్చెడి
జాడ గానరాదు జడిమ లేద
టచు తరుచరేంద్రు లాజినల్లడమంద
దనుజనాథు బాణధార లడరె.

వ. అట్టిసమయంబున నమ్మేఘనాథుండు మేఘంబులమాటుననుండి బలీముఖాలి శిలీముఖాలిబాలుజేసి నిశ్శంకలంక కరిగె నిటజాంబవంతుండు మారుతింగాంచి మేఘనాథుబాణంబుల గపులు దెగిరి నృపులుమూర్ఛిల్లిరి గావున నీవుదక్క నితరు లిక్కార్యంబు నిర్వహింపలేరు. మీతండ్రి లోకంబులకు బ్రాణంబులిచ్చు నీ వీవానరలోకంబునకు బ్రాణంబు లిత్తువుగా. సంజీవని గొనిదెచ్చి, తన్మార్గంబు వినుమని యెఱింగించిన నప్పవమానసూతి జని సంజీవనీపర్వతంబు దెచ్చిన దత్ప్రయోగంబున నరవానరులు పూర్వప్రకారంబున వర్తిల్లుచుండి రాంజనేయుం డ క్కొండ నెప్పటియట్ల నుంచి వచ్చెనట రావణుం డంతయుం దెలసి

చింతించి కుంభనికుంభాదియోధులం బనిచె వార లరుదెంచి వానరు లన్ వధింపఁదొడఁగిన,

క. అంభోజప్రియసూనుఁడు, దంభోళికఠోరపాణితలహతి గూల్చెన్
గుంభుఁ బాటితదిగ్గజ, కుంభున్ ఘనదంభు శేషగురుదోస్స్తంభున్.

క. మారుతనందనుఁ డప్పుడు, ఘోరంబగుముష్టిహతినిగూల్చెను గడిమిన్
వీరుని కుంభుని ఘనఁబ్రుం, దారకసంస్తంభుభూరితరదోస్స్తంభున్.

వ. ఇట్లు గూల్చిన హతశేషులు రావణునకంతయు నెఱింగించిన మూర్ఛాక్రాంతుఁడగు తండ్రిం బోధించి మేఘనాథుండు దాను సమరంబున కరిగి యుద్ధభూమిం దనచుట్టు చతురంగబలంబుల గాపువెట్టి హోమంబు జేయుచున్నం గాంచి విభీషణుండు రాఘవునకంతయు విన్నవించి తదియ్యానుమతి లక్ష్మణాంజనేయాదుల దోడ్కొనివచ్చి వానరులచేత బలంబుల వధియింపించినం గాంచి రావణి హోమంబు చాలించి రథారూఢుండై దాకిన సౌమిత్రి యాంజనేయాధిరూఢుండై దలపడిన నిద్దరకు ఘోరయుద్ధంబయ్యె నప్పుడు,

సీ. వరబలతారకాసురకుమారులమాడ్కి
నంధకదేవారిహరులపోల్కి
వృత్రదైత్యాధిపగోత్రభేదులరీతి
పరహిరణ్యాక్షభూపతులకరణి
మందేహపుష్కరమణులచందంబున
హైహయపరశురామాఖ్యులట్ల
ఘననృసింహహిరణ్యకశిపులకైవడి
కైటభపుండరీకాక్షులగతి
గలయఁబడి పోరఁదొణఁగిరి బలిమిఁగలిమి
పాశుపతవాయువారుణపావకాస్త్ర
నాగగరుడముఖ్యబాణములచేత
రామదశకంఠసూను లుగ్రంపుసరణి.

వ. ఇట్లు దినత్రయంబు పోరాడి లక్ష్మణుండప్పుడు,

గీ. జానకీవల్లభుడు సత్యసంధుఁడేని, సీత పతిహితచారిత్రశీలయేని
వారిపదభక్తి వదలనివాఁడ నేని, శరమ నిర్జింపు రావణి నురుబలమున.

క. అని బ్రహ్మాస్త్రం బేసిన, ఘనశర మపుడేగి దనుజుకంఠము దునిమెన్,
సునిసితఘోరాశని గ్ర, క్కునపర్వతశృంగ మిర్వి గూల్చినభంగిన్.

వ. ఇట్లింద్రజిత్తుఁడు గూలిన లక్ష్మణుండు మరలివచ్చి రామునకు నమస్క
రించిన నతండాలింగనాదుల గారవించె నంత హతశేషులు లంకకరిగి
రావణున కంతయుం దెల్పిన మూర్ఛితుండై కొండొకదడవునకు మే
ల్కాంచి యుద్ధసన్నద్ధుండై రక్కసులు బెక్కండ్రు గొలువ వానరు
లం దాకి శిలీముఖంబుల వలీముఖుల బ్రాణంబులు గొనుచు విభీషణు
నిపై మయదత్తశక్తిం బ్రయోగించిన,

సీ. భీమమై శిఖిశిఖాస్తోమమై రవిమహో
ద్దామమై భీకరాభిరామ మగుచు
చండమై ఘంటాపిచండమై వజ్రప్ర
కాండమై జితకాలదండ మగుచు
ఘోరమై పరుషప్రచారమై హరశూల
సారమై కృతభయాకార మగుచు
స్థూలమై బాడబాభీలమై హాలహా
లోత్తాలమై రౌద్రాలవాలమగుచు
వచ్చుమయశక్తిగని రఘువల్లభానుఁ
జుండు దా నడ్డమగుచును గాండసమితి
బరపు నిలువక వచ్చి తద్వీరునివక్ష
మును బగుల్చుచు వీపున జనియె వెడలి.

వ. ఇట్లు మాయాశక్తి వక్షంబుసోకిన మూర్ఛిల్లులక్ష్మణుం గాంచి రా
వణుండు గొనిపోవ గైలాసంబెత్తినభుజదండంబులు బెండుబడ బెనం
గునెడ బావని యరుదెంచి విరిగిపడ రావణుం బొడిచి సౌమిత్రిం భుజం

బునం దాల్చి రామునిసన్నిధికిం జనియె నంత రాఘవుండు రావణు బాఁ దోలి లక్ష్మణుం గాంచి యనేకభంగుల విలపించి జాంబవంతునివాక్యం బు లాలించి పావనిఁ సంజీవని కనిచిన నతం డేగుచున్నసమయంబున,

సీ. పరివేషవలయితభాస్కరుండో కాదు
గలితపూర్వాపరగతియు లేదు
కడువేగమున బారు గరుడమూర్తియొ కాదు
గళనక్షసితద్యుతి కానబడదు
ఘనరాశి వెలువడివచ్చు మైనాకుడో
కాదు పక్షస్ఫూర్తి గానబడదు
వాయువేగోక్తి ప్రవరవారివాహుడో
కాదు విద్యుద్దీప్తి కానబడదు
అనుచు లోకులు వలుక దానరిగె గగన
వీధి వాలోరుదీప్తితో విక్రమంబు
తో మహాతనుగరిమంబుతో మహోగ్ర
వేగగమనంబుతో రఘువీరవరుడు.

గీ. అట్టిసమయంబునను రావణాసురుండు
మించుదద్వృత్తమెల్ల నాలించి కాల
నేమి బంచిన దన్మార్గసీమ నతడు
బెనుతపోవన మొకటి గావించియుండు.

సీ. కరమున స్ఫటికాక్షకటకముల్ చెవులను
మండితరుద్రాక్షకుండలములు
శిరమున భద్రాక్షవరకిరీటం బెద
భూరిపద్మాక్షమాళహారసమితి
గటి కృష్ణమృగచర్మపటమును దర్భప
విత్రసంతతులును బ్రేళ్ల హస్త
మున తీర్థకుండికయును గక్షమునఁబూల
సజ్జసాలగ్రామచయము మెరయ

పేటియును బంచగడ్డముల్ బెరిగివెలుఁగ
శిష్యులకు వేదపాఠంబు జెప్పుకొనుచు
జారుగతితోడ నొకమునిస్వామియయ్యె
గాలనేమి సమాగతకాలనేమి.

సీ. ఇటులున్నకపటాసురేంద్రుఁగనుంగొని
దటుకున మార్గము దప్పించనుచు
నిలకొచ్చి మునికి సాగిలిమ్రొక్కి సతమును
బలిముఖ్యుఁడగురామ భద్రుఁడనుప
బనివింటిలక్ష్మణు బ్రతికింపగా బూని
ఘనముగా సంజీవి గొనుచురాఁగ
జనియెదవింతేల సంజీవినిచ్చట
గనునట్టిమంత్రంబు గలదుసీకు
దసరనుపదేశమిచ్చెద కొనుమటన్న
జలములను వేడ దనకమండలముజూప
జాలవనగను మొసలున్నసరసిఁరసి
శిష్యచేతను గనజేయశీఘ్రమరిగి.

వ. వాయుసూతి జలంబులు గ్రోలుచున్నసమయంబున మకరి తత్పాదంబులంగొనిమ్రింగుచున్న విని బహుఁజాలక దానికడుపులోనికి జని ప్రేగులంద్రెపి నెమ్ముంబు విరచి దాని బైకివెడలించి తీరంబుఁకొచ్చుతరి,

సీ. మేఘసంస్థితిమాని మెయిబూనిధరణిపై
సంచరించగవచ్చు చంచల యన
బాలయల్కగతిజేసి వలరాజునెడబాసి
యొంటినుండెడురతీయోష యనగ
నొకవేడుకను జెందియుర్విసంగతినొంది
వారకవిహరించు దారక యన
నవయవంబులదాల్చి యవనిమీదను నిల్చి
గ్రాలువెన్నెలరేనికళ యనంగ

జారుచేలంబుతో ఝుణంఝుణితనూపు
రములతో ముద్దుమోముతో రమ్యకుచయు
గంబుతో నొప్పిమకరిరూపంబువిడచి
రామయైయున్న జేజేలలేమ గనియె.

వ. కాంచి యిట్లనియె.

ఉ. మంజులమూర్తితో గుసుమమాలికతో దటిదుజ్వలప్రభా
పుంజముతో ధగద్ధగితభూషణవారముతో శుభాంగివై
రంజిలు నీకు గష్టపుశరగ్రహరూప మి దేలవచ్చెనీ
సంజననాదికృత్యమును సర్వముదెల్పుము సుందరీమణీ.

ఉ. అచ్చెరుపాటుతోడ బవనాత్మజుడెవ్వతె వీవనంగన
య్యచ్చర యాత్మవృత్తము నయంబునసర్వముదెల్పి వీడునీ
కిచ్చటగార్యవిఘ్నమున కిచ్చయివచ్చిన కాలనేమి యో
సచ్చరిత్రప్రతాప యనిసయ్యనబోయె విమానరూఢయై.

వ. అనంతరంబ పవనాత్మజుండు కాలనేమిన్ వధించి ద్రోణాద్రి కరిగి
యందుమందులుగానక యగ్గిరియంబెకలించి గొనివచ్చుసమయంబున
దద్రక్షులగు గంధర్వులు చుట్టుముట్టిన,

సీ. సంతోసదర్శనాసక్తిరంజితమనో
నాకవిభ్రాజతానోకహములు
భుక్తిపిధీపరిత్యక్తమస్త్రావళీ
సంభ్రామితాంభోదసముదయములు
జటులమహోదరీఘటితజంఝూరావ
భేరీకృతానేకభూరిగిరులు
సింహనాదత్రస్తశిఖరభూధావిత
గంధేభనిపతితగండకములు
శుష్కపత్రావళీభ్రమతుస్సరరథములు
బటుజవామూలకంపిత పర్వతములు

భ్రమితసామీరి వారలభంజనములు
తూలములమాడ్కి వారల దూలవిసరె.

వ. తదనంతరంబ, హనుమంతుండు నందిగ్రామంబున భరతుం దర్శించి లంకాసమీపంబునకుం వచ్చునెడ,

ఉ. కొండధరించి యాహనుమ గొబ్బునరా వనరా శిలోన ను
ద్దండత దాకినట్టి ఘనదైత్యుల మాల్యవదాదియోధులం
గండణగించి భూరిబలగర్వత వానరసేన జొచ్చియా
దండ నగంబు డించి వసుధాపతికిన్ బ్రణమిల్లియిట్లనెన్.

మ. తడువయ్యెన్ దనుజాంతరాయములచేతన్ జానకీనాథయీ
నను రేయిన్ క్షమియింపుమన్న నతడానందంబుతో వాయుజుం
గను మోదంబున నాదరించి యెదపై గాఢంబుగా జేర్చెన
ప్పుడు సుగ్రీవముఖప్లవంగులట సమ్మోదాబ్ధిలో దేలగన్.

వ. అప్పుడు,

క. మంజులగతినిసుషేణుడు, సంజీవని నొసగ వేగ సౌమిత్రిగడున్
స జాతసంజ్ఞుడై రఘు, కుంజరు డలరంగ లేచెనొమరొప్పారన్.

వ. ఇట్లుపగతకశ్మలుండై లేచిన నిజానుజున్మనింగని నిరవధికానందసందోహాసీరధినిమగ్నని జాంతరంగుడై యయ్యిక్ష్వాకుకులాధ్యక్షుండు గపికులహర్యక్షునిం గని యన్న నీమహిమంబెన్న యన్నలినభవాదులకైన నశక్య బని గాఢోపగూహనాదులబహూకరించి త్రిభువన వందనీయ్యుండగు మహేంద్రునిశాసనంబు మనకు మహనీయ్యంబు గావున నీకులపర్వతంబు యథాపూర్వస్థితంబుగా నునిచిరమ్మనిపనిచిన నతం డట్లుగావించివచ్చెనంత,

గీ. చారముఖమున దత్సమాచారమెల్ల
నరసి హనుమంతుమహిమ కబ్బురమునొంది
నయముమీరంగ వడి శరణార్థియగును
శుక్రుకడ కేగెదానవచక్రవర్తి.

గీ. పగి కావ్యునిషదముల కెరగి భక్తి
మస్తకన్యస్తహస్తుడై మదముదక్కి
భార్గవుని వేడె నప్పుడప్పుణ్యశ్రీ గళుడు
దీనుడను గావు దానవదేశికుండ.

ఉ. రాముడు లక్ష్మణుండనగ రాజసుతుల్ హరివీరవాహినీ
స్తోమముతో నవార్యగతి సూర్యతనూజుడు దోడుసూప ను
ద్దామసమీరకరంగముల దారుణశాతశిలీముఖమ్ములన్
భీమనిశాటవీరులను బింఛనుమించిరి దుర్నివారులై.

ఉ. కుంభుడు గుంభకర్ణుడు నకుంఠబలుండలధూమ్రమాలినీ
సంభవుడున్ విరించివరసంపదవాప్తసుదీప్తవీర్యుడా
జంభవిరోధిబాహుబలచండిమహారిమహేంద్రజిత్తుడున్
శుంభదుదగ్రవీర్యరఘుశూరశరాహతిగూలి రాజిలోన్.

గీ. నాడు కిన్నరగంధర్వనాగయక్ష
సాధ్యచారణదేవతాసమితివలన
సభయమొప్పారగా వేడియలవనాట
పంచజనులను దృణముగా నెంచినాడ.

వ. అని లజ్జానమితవదనుండై యున్న యద్దశవదనుం గనుంగొని శుక్రుం డిట్లనియె.

శా. ఓహో! సర్వసుపర్వగర్వహరణోద్యత్రైజ్యదోర్విక్రమా
స్వాహావల్లభునందు మారణవిధిన్ సంపూతపూర్ణాహుతుల్
స్వాహాకారముతోడ వేల్చిన వడిన్ సంపన్నసత్వుండవై
బాహాశక్తి నెదిర్చి గెల్చెదవు దద్బాహాజదాయాదులన్.

వ. అనియిట్లు దన్మాంత్రతంత్రకలాపం బుపదేశించిన నప్పులలాశివర్యుండు లంకకరుదెంచి హోమంబుజేయనమకట్టి,

శా. నైయగ్రోధపలాశఖాదిరశమీనవ్యేధ్మసంయుక్తుడై
వైయాఘ్రాసన మొప్ప గల్పవిధిగా వ్యాధిష్టషట్కున్ గ్రియా

వై యర్ఘ్యంబును బొందకుండగను గ్రవ్యాదోత్తముండగ్నిలో
భూమాత్తై కృపయా జయో మమ శుచే భోయుంచు వేల్చెన్ గడున్.

గీ. వీతిహోత్రుని నం దిట్లు వేల్చుచున్న
వితతధూమంబు లాకాశవీధి గప్పె
నంతనది జూచి మనమున జింత సేసి
సరమ రమణుని తో బల్కె నరవరుండు.

క. వ్యోమంబున ధూమ బులు, భీమంబుగ బర్వె నొగి విభీషణ గంటే
ధామనిధి మీద నిగ్రహ, కాముకులై జను మహాంధ కారములనగన్.

క. నిగనిగని నీల కాంతుల, మొగులన్ మిగులంగ జాలి మొత్తములగు మగ్
గగనంబు బోగరు జేయుచు, బొగలెగయ నిమిత్తమే మొపోలగ జెపుమా.

సీ. అనిన విభీషణుండాతని కిట్లను
వినుము రఘూత్తమా ఘనబలుండు
రావణదైత్యుండు రణమందు నీకోడి
భార్గవు పాలికి జరచి భీతి
ఘనమంత్రతంత్రముల్ గరచి మహానిష్ఠ
మారణహోమంబు ఘోరముగను
వేల్చుచుండుట జేసి వెసమహాద్యుతులతో
నీలధూమంబులు నింగిగప్పె
నోలి నీక్రియ సాకల్యమొందె నేని
వానినిర్జింపవశమౌనె వసుమతీశ
కాన దత్కార్యమునకు విఘ్నంబు జేయ
దరుచరులబంపుమిప్పుడు దైత్యపురికి.

వ. అనిన విని రామచంద్రుండు నల నీలాంగదాంజనేయ గజగవయ
గవాక్ష జాంబవదాదుల మూడుకోట్ల వలీముఖులం బంచిన వార
లరిగి లంకాద్వారంబులు బీరంబునాదన్ని పురంబు జొచ్చి రావణుం

దున్నచోటుగానక చింతిలుచున్నసమయంబున నట సంచరించుచు న్న యొక్క కాంతాలలామం గని వానరులతో నంగదుం డిట్లనియె.

సీ. లసదబ్జములగేరు లలితాంగిపదములు
వదనకంఠవిలాస వైభవములు
సారంగములగేరు సకియనేత్రంబులు
వేణికానోజ్వల విభ్రమములు
జక్రంబులనుగేరు జంద్రాస్యపాలిళ్లు
గటినాభిగంభీర కాంతరుచులు
పుష్కరంబునుబోలు పూబోణిమధ్యంబు
గరనఖరాభోగకలితరుచులు
కనకమునుగేరు సతినాసకాయరుచులు
గాన యిక్కాంత యెవ్వరికాంత యగునొ
నరసిజూచెద నంచు దా నరిగిపలికె
వనిత దెల్పవె నీపేరు వరునిపేరు.

వ. అని యడిగిన నక్కాంతామణి యిట్లనియె.

సీ. రాజరాజనగను రంజిల్లు దివ్యప్ర
భావుండు మాపెద్దభావగారు
విపులతపశ్శక్తి వెలయు విశ్రవసుండు
మహనియ్యమూర్తి మామామగారు
మాలివిక్రమకళాశాలితనూజయౌ
యల్లకై కసియు మాయత్తగారు
మూడులోకంబులు బీడించుచున్నయు
ష్పుంక్తికంధరు డిరుభావగారు
జానకీనాథపదభక్తిసంగతుండు
భీషితాఘుచయుండు శ్రీభీషణుండు

వల్లభుండు మహాకపివల్లభుండ!
సరమ యందురు నాపేరు తరుచరేంద్ర.

గీ. అనిన నంగదుం డిట్లను నంబ వినుము
మహిపుకార్యంబు మనకు సమానమగుట
గంటకుండైన యద్దశకంఠు డేడ
డాగియున్నాడొ దెల్పవే నాగయాన.

వ. అనిన నాసరసిజాక్షి కరసంజ్ఞంజూపి చని మె ననంతరంబ,

గీ. అపుడు చామీకరాంగదుం డంగదుండు
వాతనున్నట్టిబలురాయి వ్రయ్యదన్ని
మఱియు బాతాళగుహాలోన మానముాను
రావణునిగాంచి యక్కపిరాజసుతుడు.

వ. జాంబవదాదులకుం జెప్పిన వారలు వానిం గదల మోదియు ముష్టిఘాతంబుల నొప్పించియు నఖదంష్ట్రికులం జీరియు మీసంబులుబట్టి నులిచియు సృక్కిణిపంబులు దిగిచియు నతని గదలింపంజాలక వేసరునంత,

క. పాషాణమువలె భూధర, శేషాహిమహేంద్రకుంభంగి స్థిరతరుడగు న ద్దోషాచరేంద్రు గన్గొని, భాషాపతిసుతుడు వాలిబాలునకనియెన్.

వ. ఈరావణు పట్టంపుదేవియగు మండోదరిం దోడితెచ్చిన పీడు లేచును గాని యొండుకృత్యంబున లేవండనిన నంగదుం డంతఃపురంబున కరిగి యందు,

సీ. ఘనమేఘనాదాదితనయుల దలపోసి
కాటుకకన్నీరుగారుదాని
దీరంబుజేరిన సారసంబన వాడి
విన్ననై నెమ్మోముచిన్నదాని
రాముని గెలువ మీరాజుశక్యమె యను
చెలులతో బలుమారు దెలుపుదాని

హృదయతాపము వేడి నొదవుచుండుటగంది
విరిసినముత్యాలసరులదాని
రుచిరసింహాసనమున గూర్చున్నదాని
శ్రోణితలమున బెనగొన్న వేణిదాని
విన్ననై యున్న దొడవులవన్నెదాని
దేవవిద్వేషిపట్టంపుదేవి గనియె.

వ. ఇట్లుగాంచి లంఘించి యమ్మండోదరి వేణిఁ గొని సింహాసనంబు దొలంగ నీడ్చిన దత్సఖీమణులు బోరన నవ్వుచు రాజవీథిం దెచ్చి రావణుగట్టెదుర నిలిపిన మండోదరి యిట్లనియె.

ఉ. దొంగతనంబు జేసి వడితోడను సీతను దెచ్చి తీవు నీ
చెంగట వానరుండొకడు చేకొని యీడిచి తెచ్చె నన్ను దే
వాంగనలెల్ల బెట్టుటుసు రంటకబోవునె నేరికైనవే।
సంగరరంగనిర్దళితశక్రపరాక్రమ ప్రాణవల్లభా.

వ. అనియును,

సీ. హేలారచితవృత్తి కైలాసమెత్తిన
దోర్విలాసప్రౌఢి దూలెనేమొ
యింద్రాదిసురల నిస్తంద్రశక్తిని గెల్చు
చంద్రహాసమువాడి సమసెనేమొ
యలసురాసురపీరకులము గెల్చినధనుః
పాండిత్యచతురత బాసెనేమొ
కాలకేయనివాతకవచుల గెల్చిన
మాయావిలాసంబు మాసెనేమొ
మానప్రనిబంటు వేగ నీమానవతిని
మానమెడలంగ నీడ్చిన మానవేమి
తపము నిటుజూడవేమి నాంతసయుడున్న
బట్టె నే భూతిసితికంఠ పంక్తికంఠ.

వ. అనిన విని కోపించి యంగదుభుజాంతరంబున గదాప్రహారంబు చేసిన నంగదుండు మూర్ఛిల్లినం గాంచి వాయుతనయుం డారావణుం బొడిచిన రాక్షసులదొర మూర్ఛిల్లె నంత నంగదుం దేర్చుకొని మరుత్తనయాదులు రామసన్నిధి కరిగి యంతయు విన్నవించి రట రావణుండును లేచి యంతఃపురంబున కరిగి మండోదరిం దేర్చి యుద్ధసన్నద్ధుండై యున్న సమయంబున,

సీ. కాలాంతసంభూతకాదంబినీజాత
నిర్ఘాతశతకోటినినద మనగ
ఖగసురాసురకరాకర్షితమంధాన
ధరమథితాంబుధిధ్వాన మనగ
సంవర్తవర్తితసప్తమహావాత
చటులఝంఝాఘనస్వన మనంగ
గల్పకాలానల్పకాలభైరవుచేతి
దళితఢక్కాఘనధ్వని యనంగ
డంబుగతి మించ గగనభాగంబు నిండ
గుధరదరులదగంబ్రతిఘోష మడర
నొక్కపెట్టుగ దిక్కులు బిక్కటిల్ల
ఘోరతరముగ సంగరభేరి మ్రోగె.

ఉ. వీలుగనగ్నివర్ణుడును వృశ్చికరోముడు సర్పరోము డా
భీలుడు ఖడ్గరోముడును భీషణవృత్తి దలిర్ప సేనతో
మూలబలంబులం గొనుచు ముందుగ వారణవాజిరాజి రా
గాలకఠోరకింకరులు గ్రాలగ నేగిరి దుర్నివారులై.

గీ. అష్టచక్రసనాథమై పుష్టిమీఱు
వేయుగుఱ్ఱములను బూన్చు విపులరథము
కాలకేతుండు దేగ లోకాళికెల్ల
కంటకుండైన యుద్ధశకటుడెక్కె.

వ. ఇట్లు సన్నద్ధుండై వచ్చి వానరసేనం దాకిన సుగ్రీవాంగదాంజనేయు రాఘవులు ఖడ్గరోమ వృశ్చికరోమ సర్పరోమాగ్నివర్షులన్ మూగిన రావణుండు కోపించి రాఘవుం దాకిన నిరువురకు బోరు ఘోరం బయ్యె నయ్యెడ,

సీ. రామరావణుల సంగ్రామంబు జూడంగ
సోము డింద్రుండును సురగణములు
దశరథు డజుడు మాంధాత హరిశ్చంద్రు
డును విమానంబులు దనరవచ్చి
గగనంబునందుండి గనుగొనుచుండంగ
బలభేది బనుప మాతలియు రథము
గొనివచ్చి రాఘవుగని మ్రొక్కి యిట్లను
దేవ! యీరథమెక్కి దివిజవైరి
గూల్పుమన మ్రొక్కి రాముడు గురురథంబు
నెక్కి రావణుదాకెను నక్కజముగ
నిరువురకు బోరు ఘోరమై బరగెనిట్లు
వరశరాసారధారాప్రవాహ మడర.

వ. ఇట్లు పాశుపత నారాయణాగ్నేయాదిమహాస్త్రంబుల నేడహోరాత్రంబులు బోరునంత రాఘవుండు రావణశిరంబులు దునుము నుప క్రమించిన,

సీ. గగనవీధికి నటుం డెగరంగవైచిన
కాంచనమణికందుకంబు లనగ
గారుశక్తి నవాయివేరియంత్రంబున
దూలుగంధకముష్టి కాలి యనగ
వేటకానియెలుంగు విని సరస్సునుండి
పైకెగురాయంచ బారు లనగ

శిల్పిదావినుగురిఁజేసిన యాటవు
గురుతరయంత్రంపు గుంపులనఁగ
డాసి శ్రీరామశరతాఁగుతాఁగునినప
పటునికృత్తపునఃపునర్భవపునర్ని
కృత్తగగనాంతధూత లంకేశరక్తి
శిక్తశిరములు వినువీధి జెలఁగెనంత.

క. తెగునవియును గగనంబున
ఎగురునవియు మరలవచ్చి యిలబడునవియు
మగుడన్ మొలచెడినవియును
దగుశిరములు గోటికోట్లు ధరపై మెరసెన్.

వ. మఱియు నారాఘవుండు కదళీకారుండు నరికి బ్రోగులువెట్టిన రంభాకాండంబులభంగి కనకాంగదకంకణోత్కటకరంబులగు కరంబుల బ్రోకలును, చంచత్కాంచనమణిసంచయవిరాజమానకుండలకిరీట భాసురంబులగు శిరంబుల రాసులం గాంచి వెరగందుచు విభీషణుం జూచి యిట్లను విభీషణ యిదియేమి చోద్యంబు రావణశిరంబులు దృంపబడి పునర్జనితంబులగుచున్నవని యడిగిన నతం డిట్లను దేవ నీవెఱుంగనిది యేమియున్నది యైన విన్నవించెద వీఁడు పూర్వకాలంబున నమృతకలశము మ్రింగెఁ గావున పునర్జనితంబు లగుచున్నయవి కావున వీని నాభీస్థలంబు నాగ్నేయాస్త్రంబున శోషింపజేయుదు గాకనిన నతం డట్లుసేయ నది శోషించె నంత రాఘవుండు కృతాచమనుండై,

ఉ. పాయక పృష్ఠభాగమున బాశుపతంబు దదగ్రమందు నా
రాయణబాణరాజమును నంచితపార్శ్వములందు మారు
తాగ్నేయశరంబు లన్యములు క్రిందనుమీఁదను గూర్చిసంపుటిం
జేయుచు బ్రాహ్మ్యమస్త్రము విశిష్టసమంత్రకశక్తినేసినన్.

వ. అప్పు డమ్మహాస్త్రంబు,

సీ. సప్తసాగరములు సరగున గబళించు
ప్రళయబాడబశిఖాపటలికంటె
జగములొక్కుమ్మడి సమయంగ జేయుక
ల్పాంతరౌద్రోగ్రఫాలాగ్నికంటె
పర్వతాదుల నెల్ల భస్మంబుజేసెడు
క్షయకాలచండభాస్కరులకంటె
నిఖిలలోకంబులు నిరసించిమించిన
లయకాలదండసంచయముకంటె
ఘోరమై తోరమై దుర్నివారమగుచు
బారి రావణవక్షంబు దూరి చనిన
గొబ్బునను రక్కసుం డిలగూలె భిదుర
దళితమై కూలు కులపర్వతంబుపగిది.

సీ. ఈరీతిరావణు డిలగూలెనంతట
శ్రీరామదేవుండు జెలగి యనుజ
నిహితధమ్వండయి నెమ్మితోడనుబాల్కి
లపనానుజభుజావలంబియగుచు
గపులనుగని భవద్భవతేజమున జేసి
దనుజనాథుడుగూలె దర్పమొనలి
యనె విభీషణుడు శోకాక్రాంతుడై నను
రహిదేర్చె నప్పుడు రఘువరుండు
మఱియు మండోదరీముఖ్యమానినులను
దేర్చి రఘురామదేవుండు దివిజవరుల
కూర్ధ్వకృత్యంబు జేయించె నొగివిభీష
ణాదులను దార్చి సురలకు మోదమలర.

వ. అనంతరంబ రాఘవుం డంపిన విభీషణాంజనేయులు నశోకవనంబున కేగి,

సీ. శుక్లద్వితీయేందుశుభ్రరేఖయుఁబోలె
విస్మృతిఁగాంచిన విద్యఁబోలె
దటమునఁబడి వాడుతామరలతఁబోలె
బెళకెడుదినదీపకళికఁబోలె
మలినవస్త్రచ్ఛన్నమణిశలాకయుఁబోలె
భ్రమణంబుఁజెందిన ప్రజ్ఞఁబోలె
ధరణిసంగతమైన తారకయుఁబోలె
శైవలప్రచ్ఛన్న సరసిఁబోలె
గంధవహవేగకంపితకదళిఁబోలె
ప్రకటపంజరబద్ధశారికయుఁబోలె
భషకతతివృతసారంగబాలఁబోలె
రాక్షసీవృతయై యున్న రామఁగనిరి.

వ. ఇట్లుగాంచి చేతులు జోడించి కపివరుం డిట్లనియె.

క. ఓతల్లి రామచంద్రుఁడు, ఘాతుకుఁడగు పంక్తివదను ఖండించెన్ భట
వ్రాతంబుతోడఁ గూడఁగ, సీతా! త్రైలోక్యమాత క్షేమసమేతా.

వ. అనినవిని సీత సంప్రీతయయ్యె ననంతరంబ రామదర్శనార్థంబు వేంచే తుఁగాక యునిన సఖ్యాచీనంబని కృతస్నానయగుచు శిబికారోహణంబుజేసి రామసన్నిధికిన్ వచ్చినం గాంచి రామునుండు మాగ్ధంబిడ నింగితజ్ఞానయగు నద్దేవి కృతాగ్నిప్రమాణయయినం గాంచి రాముఁ డారామ నాదరించి లక్ష్మణునిచే విభీషణునకు లంకారాజ్యాభిషేకంబు జేయించి తద్దత్తేంద్రకృతామృతవర్షంబుచే సమరనిహతులగు వానరుల బ్రతికించి విభీషణదత్తపుష్పకారూఢుండై నిజపట్టాభిషేకనిరీక్షణాపేక్షులగు సుగ్రీవ విభీషణాదులతో నయోధ్యామార్గంబు పట్టి చనుచు సీతతో నిట్లనియె.

సీ. ఇదిసుముఖీ రాకేందువదన లంకేశుండు
పటుబాణహతి ద్రెళ్ళిపడిన చోటు

యిదెసుమీ నవకుందరదన! వజ్రశరాళి
గుంభకర్ణమహాద్రి కూలుచోటు
ఇదిసుమీ సద్గుణసదన! సౌమిత్రిచే
నింద్రజిత్తుండు దివి కేగుచోటు
యిదెసుమీ మంగళాస్పద! నరాంతకుడను
ఘోరాసురుడు గంతుకొనినచోటు
మఱియు కుంభనికుంభ దుర్మదనరాంత
కాతికాయ మహాకాయ ఖరతనూజ
ఖడ్గవృశ్చికరోమముఖాసురాళి
బొట్టక్రొవ్వన దివి కేగునట్టిచోటు.

ఉ. భీతమృగాక్షి జూడుమిటు భీకరవానరబద్ధ మమ్మహా
సేతువు దర్శనాగతవిశిష్టజనావళిమంగళక్రియా
హేతువు నిత్యసంగత మహీధరరాజకుమారికావృషే
త్కేతువు భూధరాగ్రతరు కీలితసుస్వరకీర గావుతన్.

సీ. కీశాలిపురి జూడు కేశాళిజితభృంగ
శ్రీశాలయప్రభాశ్రీకరంబు
పంపాసరసి జూడు శంపాసదృశదేహ
సొంపారురాజీవశోభితంబు
గోదావరిని జూడు మోదావహామహాత్మ
ఖేదాపహస్నీరకీలితంబు
గంగానదిని జూడు శృంగారరసపోష
పొంగారువెలినీటిపొలుపుదాని
చిత్రకూటాఖ్యమిది లసచ్చిత్రరూప
శృంగిబేరంబు గను మిది శృంగిరదన
యింగుదక్షోణిరుహ మిది మంగళాంగి
రామ కిట్టులజూపె నారాముడపుడు.

క. మించి భరద్వాజాశ్రమ, మంచితగతిగాంచి దేవయానము డిగి భూ
సంచారి యగుచు ముని గని, ప్రాంచిత తత్పాదయుగముపైబడిభక్తిన్.

వ. తనవృత్తాంతంబంతయు నతనితో జెప్పి తత్కృతసత్కారుడై పావనిం
గని నీవు నందిగ్రామంబుననున్న భరతునకు మదాగమనంబు దెలిపి
రమ్మనిన నతండు జని,

సీ. ఇందీవరచ్ఛాయ నిందించు రుచిమించు
సుందరంబగు మేనిసొబగు వాని
శతపత్రసత్పత్రజైత్రంబులై మీరు
వాలుగన్నులమేలుడాలు వాని
నాజానులంబాహి రాజాధిరాజోరు
బాహావిలాసవైభవము వాని
సంపూర్ణపూర్ణిమాచరదిందుసౌందర్య
ధామమౌ చిఱునవ్వుమోము వాని
డంబుమీరుజటామకుటంబు వాని
సతతవేల్లితచీరవస్త్రముల వాని
రంజితకవాటవక్షోంతరంబు వాని
భరతు శ్రీరామసద్భక్తినిరతు గాంచె.

వ. కాంచి ముకుళితకరకమలుండై హనుమంతుం డిట్లను దేవా రామ
చంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై భరద్వాజాశ్రమంబున పుష్ప
కంబు డిగ్గి యేతద్వృత్తాంతంబు దేవరవారి కెఱింగింపుమని నన్నుం
బనిచె ననిన విని భరతమహీకాంతుండు హనుమంతు నాలింగనంబు
జేసి బ్రహ్మానందంబున బొంగి గురుజనమంత్రి సేనాసమేతంబుగా జని
సీతారామలక్ష్మణులం గాంచి తత్పాదంబుల కెరగిన సంతసించి
రాఘవుండు గురుజనంబులకు బ్రణమిల్లి తత్పరివారసమేతుండై
సాకేతపురంబునకుం జని నిజమందిరంబు బ్రవేశించి తదనంతరంబు

భరతప్రార్థనంబున పట్టాభిషేకం బంగీకరించి చతుస్సముద్రనీరంబులు దేర వానరులం బనుప నందు,

సీ. ఉత్తరవారాశిసత్తోయములు దెచ్చె
నత్తరి మాతరిశ్వాత్మజుండు
పూర్వపయోరాశి సర్వతోముఖముల
బర్వతాభుడు వాలిపట్టి దెచ్చె
బరమపారావార శరముల గొని తెచ్చె
వరమతి భల్లూకవల్లభుండు
దక్షిణకీలాలధిక్షీరములగొంచు
దక్షుడౌ నలుడు మోదమునవచ్చె
సకలసంభారములుగూర్చె శత్రుహంత
నాపితలు వేగ శ్మశ్రుకృంతనముసేయ
జడలువిప్పిరి ప్రేమదజ్జనులపుడు
జలములాడించిరట సమజ్జనములంత.

వ. అనంతరంబ సింహచర్మపరిష్కృతంబగు సింహాసనంబున సీతారాముల గూర్చుండబెట్టి,

ఉ. ముందు వశిష్ఠశిష్టజనముఖ్యు లనంతరమందు దేవ ఘం
క్రందనపద్మసూతిభుజగాభరణాదులు పుణ్యకామినీ
బృందము మంత్రివర్గమును బెద్దలు గన్నియ లార్యులందఱుం
జెందగ రాఘవేంద్రు నభిషిక్తుని జేసిరి భూరివారిచే౯.

వ. అనంతరంబ,

సీ. పావని బావని పాదపీఠము నూచ
భరతుండు ధవళాతపత్రమూన
శత్రుసాలత్మ్మణుల్ జామరంబులు వీవ
గుడిపెక్కు గపిభర్త గొలుచుచుండ

నెడమదిక్కున దానవేశుండు సేవింప
వాలిసూనుడు ముందు వరలుచుండు
జాంబవంతుడు వెన్కచాయను నిలువంగ
నలనీలులందంద బలయుచుండ
విధి శివేంద్రాదులంతంత వెలయుచుండ
ఘనవశిష్ఠాదిసప్తర్షిగణము లమర
లలితవామాంకమున సీత సొలయుచుండ
జెలగె రాముడు పట్టాభిషిక్తుడగుచు.
అట్టిసమయంబున శంకరుం డిట్లనియె,
సురవరమణినీలం సూరిదేవాద్రిమూలం
కనకరుచిరచేలం కర్బురేశాదికాలం
వినమితమునిజాలం విశ్వవిఖ్యాతశీలం
జగదవనవిలోలం జానకీపాలమీళే.
సుగుణమణిలలామం సుందరాకారసోమం
విజితపరశురామం వేదమూర్త్యాభిరామం
నిఖిలకలుషభీమం నిస్తులౌదార్యసీమం.
సకలరిపువిరామం జానకీరామమీడే.
అనంతరంబ విరించి యిట్లనియె,
సీతాకళత్రం సితికంఠమిత్రం
రాజీవనేత్రం రమణీయగాత్రం
రాకేందువక్త్రం రఘురాజగోత్రం
సేవేపవిత్రం శ్రితపద్మమిత్రం.
రామం కామసహస్రసుందరతనుం రాజీవనేత్రాంచితం
శ్రీమన్మౌక్తికహారహీరమకుట శ్రీకంకణాలంకృతం।
సుగ్రీవాంగదనీలమారుతికపిస్తోమాభిరామం విభుం
సీతాలక్ష్మణసోదరాదిసహితం సింహాసనస్థంభజే.

వ. అనంతరంబ రాఘవుండు సుగ్రీవాంగద విభీషణ పావనిజాంబవదాదుల సను స్తభూషణ వస్త్రాదులం బూజించి వారి నిజనివాసంబుల కనిచి యగస్త్యాదిమహర్షులం బూజించి తదాశ్రమంబుల కనిచి దిగ్దేశాగతులయిన రాజులకు గట్నంబులిచ్చి నిజరాజ్యంబులకుం బంపి యింద్రాదిదేవతలకు వందనంబులు జరిపి నిజలోకంబుల కనిచి సప్తాంగపూజ్యంబగు రాజ్యంబు జేయుచుండె నంత,

సీ. దుర్భిక్షడాంబరదురితంబు లెడవాసె
నెలమూడువర్షముల్ నెమ్మిగురిసె
మారిబాధయు శిశుమరణకృత్యముజారె
నపమృత్యుపీడలు నణగిపోయె
వైశున్యరోగాది పాటవంబులుమానె
బరులలచ్చికసూయపడుట దొలగె
గ్రతువులెల్లెడలను ఘనముగా వర్తిల్లె
వర్ణాశ్రమాచారపరతమించె
జారచోరాదివృత్తులు సడలిపోయె
విమలధర్మంబు నాల్గుపాదముల నడచె
సర్వజనులకు సంపదల్ జాలవెలసె
రామచంద్రుండు పాలించురాజ్యమందు.

వ. ఇట్లు రామచంద్రుండు శ్రీహనుమత్సీతాలక్ష్మణభరతశత్రుఘ్నసమేతుండై యశ్వమేధాదియజ్ఞంబులు జేయుచు సుఖంబుండె నని వామలూరుభవునకు నారదుం డుపదేశించియుండుటయును,

సీ. భువి వామలూరుసంభవునిగావ్యమురీతి
నలరామచరితామృతానుబంధ
బంధురమైన ప్రబంధరాజంబిది
దీనికంతమునందు బూనువారు

పంచమాశ్వాసము.

విబుధులై జగతిలో వెలయుదు రటమీాద
స్వస్థితిగాంతురు సరసులగుచు
విన్నవారలు నమ్మి వేబురుషోత్తము
లగుదురు శ్రీరంజితాత్ములగుచు
గాన సేవించు సద్ద్విణగజములకును
వాంఛితార్థఫలావాప్తి వరలజేసి
వెలయు హరిచందనంబన విశ్వమందు
సుకవులార రసాకరసుకవులార.

క. ధీరార్పితకుండల సుకుమార యశోవిజితచంద్రమండల విలస
ద్ధారావళిరుచిపిచండిల, వీరరసాఖండలప్రవేపితవైరీ.

చ. వితతసురాసురేంద్రఘనవీరసమావృతభోగిభోగవే
ష్టితధృతవామదక్షిణవిశేషచరద్గురుమందరాద్రిఘూ
ర్ణితగురుదుగ్ధసాగరవినిర్మల తుంగతరంగభంగభా
సితవరగర్వనిర్భరవిశిష్టయశఃప్రభ రాట్పురందరా.

క. నారాయణబోధకథా, పారాయణలోలచిత్త పంకేజలస
త్నారాయణసద్భుజబల, నారాయణరాట్కుమారనరసన్నృపాలా.

—: గద్య :—

ఇది శ్రీ మహామామహేశ్వరవర ప్రసాదలబ్ధ సరసకవితాసామ్రాజ్య
కౌండిన్యసగోత్రపవిత్ర సుకవిశేఖర సోమశేఖర ప్రణీతంబైన
శ్రీనరసభూపాలరాజీయంబను శృంగారరస ప్రబంధంబునందు
నందు సర్వంబును బంచమాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీసీతారామార్పణమస్తు శ్రీ శ్రీ శ్రీ...

వలయువారు:—

ఒరుగంటి శ్రీరాములు,

పెదనందివల్లి అగ్రహారం,

చోడవరంపోష్టు-విశాఖపట్నంజిల్లా,

అని వ్రాయవలయును.